








సెప్టెంబర్ 20
ధర్మవరపు సుబ్రహ్మణ్యం
పుట్టిన రోజు సందర్భంగా
హాస్య సంగీతాభిమానులందరి
తరపున శుభాభినందనలతో...

హాసం



నిండగు నిగ్రహమున్నది
దండిగ డైలాగు జెప్ప దమ్మూ ఉందీ
మెండగు వరమై దొరికెను
వెండితెరకు ధర్మవరపు వెన్నెలకంటీ !

- వెన్నెలకంటి రాజేశ్వరరావు

హాసం
హాస్య-సంగీత పత్రిక


# ఇవీ సంగతులు

48

**Also available on net:**
**www.haasam.com**



ముఖచిత్రం
'ఠాగూర్' లో
చిరంజీవి

## హాస్యం





## సంగీతం





'సెంటర్ స్ప్రెడ్' లో
వనకి Weds శ్రీరామ్
సినిమా పాటల పుస్తకం
కలర్‌లో

ప్రముఖ కర్ణాటక సంగీత విద్వాంసులు, 'పద్మవిభూషణ్' శ్రీ మంగళంపల్లి బాలమురళీ కృష్ణ గారిని రాష్ట్ర ప్రభుత్వం సాంస్కృతిక సలహాదారుగా నియమించడం సంగీత ప్రియులందరూ చాలా ఆనందించదగిన విషయం.

ఓ ప్రముఖునికి పదవి ఇచ్చి చేతులు దులుపుకోకుండా... ఆ పదవికి కావలసిన నిధులను, అధికారాన్ని కూడా తప్పక ఇవ్వాలి. కేవలం రాజధాని నగరమైన హైదరాబాద్ లోనో లేక రవీంద్రభారతిలో మాత్రమే గాక... కళలను, సాహిత్యాన్ని మరియు సంస్కృతిని ఆంధ్రదేశ మంతటా పునరుద్ధరిస్తూ వ్యాపింప జేయాలి. వీటన్నిటినీ నిర్వహించడానికి ప్రభుత్వం డాక్టర్ బాలమురళీకృష్ణ గారికి తగిన చేయూత నివ్వాలి.

గతంలో ఎన్.టి.రామారావు ముఖ్యమంత్రిగా ఉండగా ఒక్క జి.వో.తో సంగీత, నాటక అకాడమిని రద్దుచేసి, ఆస్థాన సంగీత విద్వాంస పదవి నుండి శ్రీ బాలమురళీ గారిని తొలగించి నట్టుగా కాక మరియు ఈ మధ్యకాలంలో నిర్వహణాలోపం వల్ల షెహనాయ్ విద్వాంసులు శ్రీ ఉస్తాద్ బిస్మిల్లాఖాన్ గారికి జరిగినటువంటి అవమానాన్ని మరవక ఇటువంటివి ఇకముందు ఆంధ్రప్రదేశ్‌లో ఎప్పుడూ, ఎక్కడా, ఎవరికీ జరగకూడదని కోరుతున్నాం. ప్రస్తుతం బలవత్తర మైనటువంటి మీడియా ద్వారా సంస్కృతిని వికసింప చేయాలి. తనకు తగిన అవకాశాన్ని ఇస్తే సంగీతం ద్వారా వర్షాన్ని కురిపిస్తానని బాలమురళీకృష్ణ గారు చేసిన ప్రతిపాదనని ప్రభుత్వం తప్పక ఉపయోగించుకోవాలి.

ఈ ఉత్తరాన్ని సంగీత ప్రియులందరి తరపునా రాస్తున్నాము. బాలమురళీకృష్ణ గారి ఆధ్వర్యంలో ఆంధ్రప్రదేశ్‌లో సాంస్కృతికత విస్తరించాలని కోరుకుంటున్నాము.

**- సురేష్, నటరాజ్ & ఫ్రెండ్స్, కొత్తగూడెం.**

అలనాటి 'మాయాబజార్', 'పాతాళభైరవి', 'మిస్సమ్మ', 'అప్పుచేసి పప్పుకూడు' సినిమాలు ఘన విజయం సాధించి ఈనాటికీ మైమరపిస్తూ ఉన్నాయంటే వాటిలో సంగీత, సాహిత్యాలు ఒక దానితో ఒకటి పోటీ పడటమే కారణం అని వేరే చెప్పనవసరం లేదు. ఇప్పుడు వస్తున్న సినిమాలు మూడు నాళ్ల ముచ్చటగా మిగిలిపోతున్నాయి అంటే సంగీత సాహిత్యాలకు కాక సెక్సు, వైలెన్స్‌కు ప్రాధాన్యత యివ్వటమే (సంగీత సాహిత్యాలను పక్కనబెట్టి)కారణం.

16-31 ఆగస్టు సంచికలో పొడూరి కృష్ణకుమారి గారి 'పెళ్లినీది -పగనాది' హాస్యరస భరితంగా ఉంది. చదువుతూ ఉన్నంతసేపూ నవ్వు ఆపుకోలేక పోయామంటే నమ్మండి. జీవితంలో 'ఆశ' గురించి ఆచార్య తిరుమలగారి వివరాణాత్మక విశ్లేషణ బాగుంది. చరమ దశలో నవ్వులరేడు జానీవాకర్ నిజాయితీ, కృతజ్ఞత ఆశ్చర్యంలో ముంచెత్తింది. కొమ్మ కొమ్మకో సన్నాయిలో ఆదినారాయణ రావు గారికి అంజలి ఆకట్టుకుంది. 'సువర్ణసుందరి', 'అనార్కలి'




సంగీత రసమాధురిని ఎలా మర్చిపోగలం?

విజయా వారి 'అప్పుచేసి పప్పుకూడు' సినిమాలోని జనరంజకమైన, పరవశింప చేసిన పింగళి వారి పదునైన పాళిని, రాజేశ్వరరావు గారి రసమయ బాణి చక్కగా విశ్లేషించారు.

**-సి.వి.యల్.నరసింహారావు, ఖమ్మం**

ఒక సంవత్సరపు కాలపు ఆనందాన్ని, తద్వారా ఆరోగ్యాన్ని చిరుధరకే మాకందిస్తున్న ధన్వంతరి లాంటిది మీ హాసం! హాస్యం పేరుతో అపహాస్యం రాజ్యమేలుతున్న ఈ కాలంలో సినిమాల్లోని వుదాత్తతని, వున్నత భావాన్ని, కళా రూపాల్ని అందంగా మాకందిస్తున్న మీ వుత్తమాభిరుచికి అభినందనలు.

**-మంగాదేవి, హైదరాబాద్.**

రసజ్ఞులైన, సంగీతప్రియులైన తెలుగు పాఠక లోకమునకు, తమ తమ ఉత్తమాభిరుచులతో సంగీత, సాహిత్య, అలనాటి ఆణిముత్యాలు చిత్ర రాజాలను సంగీత శిఖామణులను, గాయకులను ఈనాటి తరానికి అందిస్తున్న 'హాసం' పత్రికకు అభినందన కుసుమాంజలి.

గత 2సం॥లుగా విధిగా 'హాసం' నా హస్తంలో ఉంచుకొని చదివి ఆనందిస్తూ విషయాలు తెలుసుకొంటున్నాను. చౌకబారు సినీపత్రికలు వస్తున్న ఈతరుణంలో 'హాసం' ప్రతి సంచికా విన్నూతంగా శోభాయమనంగా సర్వంగా సుంద రంగా తీర్చిదిద్దుకుంటూ ముస్తాబవుతున్నం దుకు సంతోషం. సి.నారాయణరెడ్డిగారు పాటల లోనే కాదు సాటి సినిమాల సంభాషణలలో ఘనాపాటి అని మీ పజిల్‌లో ప్రశ్నావళి ద్వారా తెలుస్తుంది. మీ విన్నూత ప్రయోగమునకు, కుర్చరి శ్రీ బి.బాల సుబ్రహ్మణ్యం గారికి నాధన్య వాదములు. 'హాసం' పత్రిక దినదిన ప్రవర్ధ మానం పొంది కొంగ్రొత్త సొబగులు చేకూర కోవాలని నా హార్దిక శుభాకాంక్షలు అందిస్తూ న్నాను

**-ఎమ్.నాగేంద్రం, నాగర్‌కర్నూలు**

'హాసం'లో కొమ్మ కొమ్మకొ సన్నాయిలో వేటూరి కలం, రమేష్ నాయుడి స్వరం, జేసుదాసు గళం గల మేఘసందేశం చక్కని అనుభవం. కనుల కన్నీరు కాదు పన్నీరు. ఇదీ నా అనుభవం. కీపిట్ అప్ 'హాసం'.

**-పెద్దాడ వేంకటేశ్వర్లు, సిర్పూర్ కాగజ్‌నగర్.**

మెదడుకు మేత పెట్టే పజిల్ పెట్టినందుకు మాకు చాలా సంతోషంగా ఉంది. ఒక ప్రక్క బాధగా ఉంది. మీ ప్రతిక నవరత్నాల ఉంగరం లాంటిది. ఇందులో ఏ ఒక్క పేజీ చింపడానికి మనస్కరించడం లేదు. ఆగష్టు 16-30 పత్రికలో మిష్టర్ పెళ్ళాం కథ ఉంది. దాని ముందు పేజిలో పజిల్ ఉంది. 1-15 సెప్టెంబర్ పత్రికలో పజిల్ వెనుక ఆపాత(ట) మధురం చిత్రం 'అప్పు చేసి పప్పుకూడు' ఉంది. విధి లేక పజిల్ నింపి మరొక 'హాసం' పత్రిక కొని దాచుకున్నాను. నవరత్నాలులో ఒక రత్నం లేకపోతే విలువ పోతుంది. ఏపేజిని చించాలన్నా ఇబ్బందిగా ఉంది. పుస్తకం నిండా(హాసం) మంచి విలువైన సమాచారం, కార్టూన్లు, ఇహ చెప్పలేను.

"హాసం" ముందు తరం వాళ్ళకి ఒక డిక్షనరీగా చెప్పవచ్చు. పాత చిత్రాలకు రిఫరెన్సు లాంటింది.

**-మాదాబత్తుల లక్ష్మి, విజయనగరం.**

ఇటు హాస్యాన్ని, అటు సంగీతాన్ని సమానంగా అందిస్తున్న 'హాసం' పత్రిక ఎప్పుడు వస్తుందో అని ప్రతినెలా ఎదురు చూస్తుంటాం.

'ఎలుక వచ్చే ఇల్లు భద్రం' సీరియల్ మరీ మరీ నవ్వు తెప్పించేదిగా ఉంటున్నది.'హాసం' పత్రిక సదా యిలాగే హాస్యాన్ని వెద జల్లుతూ ఉండాలని కోరుకుంటున్నాను. మరుగు పడిన ఎంతో మంది కళాకరుల గురించి ఎన్నో విషయాలను తెలుసుకునేందుకు అవకాశాన్ని కలిగిస్తున్న 'హాసం' పత్రికకు నా ధన్యవాదాలు

**-డి.జె. కుమారి, బరంపురం.**

మీరు ప్రచురించే అన్ని శీర్షికలు బాగుంటాయి. అందుకనే నేను మీ పత్రికకు అభిమానిని అయ్యాను. మొదటి సంచిక నుండి కొని భద్ర పరిచాను. నాకు అమితంగా నచ్చినవి ఆపాత మధురం, బావూరమణీయం, హ్యూమరథం. మీరు కొత్తగా మొదలుపెట్టిన సరిగపదమని శీర్షిక చాలా బావుంది. కాకపోతే ఈ పజిల్‌ను మీకు పంపటం కొరకు కత్తిరించటం వలన ఆపాత మధురం లోని రెండు పాటలు పోగొట్టుకున్నాను. చాలా బాధ వేసింది. అసలు 'హాసం' పత్రిక మీద చిన్న మరకపడినా సహించను. మీ పత్రిక దినదినాభివృద్ధి చెందాలని కోరుకుంటూ...

**-విజయ్‌కుమార్(ఊరి పేరు రాయలేదు)**

మీ 'హాసం' పత్రికను ఈ మధ్యనే చూశాను. చాలా బాగుంది. కొనే స్థోమత మాకు లేకపోయినా మా అమ్మగారిని అడిగి గొడవ పెట్టి మరీ కొని చదువుతున్నాను. ఇంత మంచి పత్రికను మీరు అందిస్తున్నందుకు చాలా సంతోషంగా ఉంది.

**-సి.వి.ఎస్.మాధవి, బాపట్ల**

'హాసం' పత్రికను గత సంవత్సరం నుండి చదువుతున్నాను. మరో 'హాసం' వచ్చే వరకు వచ్చిన పత్రికను రెండు మూడుసార్లు చదువుకుని ఆనందిస్తున్నాము. 'ఎలుకవచ్చేఇల్లు భద్రం' సీరియల్ సరదాగా ఉంది. ఆచార్య తిరుమల గారి రచనలు పత్రికకే హైలైట్‌గా ఉంటు న్నాయి.. 'హాసం' పత్రికా లోకానికే హైలైట్‌గా ఉంటుంది.

**-వి.శేషతల్ప శాయి, అద్దంకి**

సంపుటి : 2 సంచిక:24

**16-30 సెప్టెంబరు 2003**

పేజీలు: 68 + 8

విడి ప్రతి : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $50

జీవిత చందా : రూ. 2000

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $400

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

## హాస్య-సంగీత పత్రిక

48

మేనేజింగ్ ఎడిటర్
**ఎమ్బీయస్ ప్రసాద్**

ఎడిటర్
**రాజా**

రిఫరెన్స్ కర్టెసీ
**డా॥ కె.వి.రావు**
**జె.మధుసూదన శర్మ**

**HAASAM HAASYA SANGEETHA PATHRIKA**
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
*email:* haasammag@hotmail.com

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
On behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD - 500 018
Fax: 040-23541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eeenadu Compound
Somajiguda, Hyderabad-82

ఈ సంచికతో 'హాసం' రెండు సంవత్సరాలు పూర్తి చేసుకుంటోంది. సహజంగా ఇది సమీక్షా సమయం. ఈనాటి ఎలక్ట్రానిక్ యుగంలో ఓ పత్రిక రెండు సంవత్సరాలలోనే నిలదొక్కుకోవడం, తేదీ తప్పకుండా 48 సంచికలు మార్కెట్లోకి తీసుకురావడం,ప్రచురణారంగంలో చెప్పుకోదగ్గ విశేషంగా పరిశీలకులు అంటున్నారు.

సర్క్యులేషన్ పరంగా మేము సాధించిన విజయం కూడా గణనీయమని మార్కెట్లో అభిప్రాయం ఉంది. కానీ ఈ అభిరుచి వున్నవారందరికీ పత్రిక గురించి పూర్తిగా తెలియలేదనీ, 'హాసమా? అదేమిటి?వీక్లీయా? మంత్లీయా?' అని అడిగేవారు ఇంకా ఉన్నారనీ మాకు అసంతృప్తిగానే ఉంది. పత్రిక కొనడం, మానడం పాఠకుడి ఇష్టం. కానీ హాస్యం, సంగీతం అంటే ప్రేమ ఉన్నవారందరికీ 'హాసం' ఉనికి గురించి తెలిసినప్పుడే మమ్ము మేము అభినందించుకోగలం.

అయితే సంతృప్తి పడవలసిన కొన్ని అంశాలను 'అనవసర వినయం' కొద్దీ ముచ్చటించకపోవడం భావ్యం కాదు. ఈ రెండేళ్లలో 'హాసం' సాధించిన ఘనవిజయం -మేధావి వర్గాలకు, సామాన్య పాఠకులకు వంతెన వేయడం! ఈనాటి పాఠకులకు ఏం చెప్పినా వృథా అనే నిస్పృహతో కలం ముడిచివేసినవారు కూడా 'హాసం'కై కలం పట్టారు. సాధారణ పాఠకుడితో భావాలను పంచుకోవడానికి వారికి 'హాసం' ఒక వేదికగా మారడం మాకు గర్వకారణం.

పేర్లు చెప్పబూనితే ఎందరో మహానుభావులు... బాపుగారు హిందూస్తానీ సంగీతాన్ని తామెలా ఉపయోగించుకున్నారో చెప్పారు. ముళ్లపూడి వెంకటరమణగారు ఆత్మీయుల గురించి వ్యాసాలు రాస్తున్నారు. వేటూరిగారు ఎంతో సమయాన్ని వెచ్చించి తన భావాలను పాఠకులతో పంచుకుంటున్నారు. పి.బి.శ్రీనివాస్‌గారు తన అనుభవాలను రంగరించి లతా జీవితచరిత్రను అక్షరబద్ధం చేస్తున్నారు. పద్మనాభం గారు తన ఆత్మకథను అందించారు.

తనికెళ్ల భరణిగారు షూటింగ్‌ల నుండి తీరిక చేసుకుని పదును తగ్గకుండా శీర్షికను నడుపుతున్నారు. ఏ వూరు వెళ్లినా, ఏ పుస్తకం చదివినా శాస్త్రీయ సంగీతకారుల గురించే ఆయన అన్వేషిస్తూంటారు. చిత్తరంజన్ గారు లలితసంగీతకారుల గురించి ఫోటోలతో సహా అందిస్తున్నారు . విజయచిత్రను విజయవంతంగా 26 యేళ్లపాటు ఎడిట్ చేసిన రావి కొండలరావుగారు తమ అనుభవాలతో పత్రికకు వన్నె తెస్తూండగా తమ క్లాసిక్స్ రీటోల్డ్ ద్వారా పద్యాల సారాన్ని పదిమందికీ పంచుతున్నారు ఆచార్య తిరుమలగారు.

ఆలిండియా రేడియో పి.యస్.గోపాలకృష్ణగారు అనితరసాధ్యమైన శీర్షికను నిర్వహిస్తుండగా తెలుగు యూనివర్శిటీ అసోసియేట్ ప్రొఫెసర్ మృణాళినిగారు తన అభిమాన సంగీతకళాకారుల గురించి హృదయంతో రాస్తున్నారు. అడపాదడపా రాసినప్పుడు సిరివెన్నెల వారు, కులశేఖర్‌గారు, కీరవాణిగారు 'హాసం'నే ఆదరిస్తున్నారు. వెన్నెలకంటివారు ఈ సంచికతో ఓ శీర్షికనే ప్రారంభిస్తున్నారు. ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యంగారు లభించిన వేదికలన్నిటిలోనూ 'హాసం' పై ప్రశంసావర్షం కురిపిస్తున్నారు. తెలియనివారికి తెలియజెప్పుతున్నారు. ఈనాటి మేటి గీతకారులూ, సంగీతకారులూ అందరూ 'హాసం'ను గౌరవించేవారే! కోరినవెంటనే ఇంటర్వ్యూలు ఇవ్వడమే కాదు, 'హాసం' కోసం ప్రత్యేక విశేషాలు తెలియబరుస్తున్నారు.

హాస్యనటులలో కూడా ఆనాటివారే కాదు, ఈనాటి వారు కూడా 'హాసం'కు మేలు కూర్చే పనిని చేయడానికి సంసిద్ధత వ్యక్తపరుస్తున్నారు. హాస్య రచయితలలో పేరెన్నికగన్న మల్లాది, ఆదివిష్ణు తరం నుండి నేటితరంవారి దాకా అనేకులు 'హాసం'కు రచనలు అందిస్తున్నారు. అలాగే సత్యమూర్తి వంటి సీనియర్ల నుండి యువకార్టూనిస్టుల వరకు కూడా 'హాసం' అభిమాన వేదిక అయింది.

పాటల పుస్తకాల, వెండితెరనవలల సంప్రదాయాన్ని పునః ప్రవేశపెట్టిన ఘనత 'హాసం'దేనని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఘంటసాల అభిమానులను సంఘటితం చేయడంలో 'హాసం'కూ పాత్ర ఉంది. ఘంటసాల క్విజ్, 'సరిగపదమని' వంటి శీర్షికలకు పాఠకుల స్పందన ఎంతో స్ఫూర్తిదాయకంగా ఉంది. అంతేకాదు, తమ వద్దనున్న అరుదైన పుస్తకాలను, ఫోటోలను 'హాసం'కు బహూకరిస్తున్న వారెందరో ఉన్నారు. తమ ఊరికి ఆహ్వానించి 'హాసం' సంపాదకవర్గాన్ని అభినందించినవారు కొందరయితే, 'హాసం క్లబ్' తమ ఊరిలో పెడతామని ముందుకొస్తున్నవారు మరికొందరు.

'హాసం' తమ పత్రిక అని భావించేవారి సంఖ్య క్రమంగా పెరుగుతోంది. ఈ సంఖ్య ఇంకా ఇంకా పెరగాలని, దానికి 'హాసం' అభిమానులే పూనుకోవాలనీ కోరుకోవడమే ఈ సమయంలో మేము చేయగలిగేది.



పాఠకలోకానికి, రచయితలకూ కృతజ్ఞతలర్పిస్తూ మా శక్తిసామర్థ్యాల మేరకు 'హాసం' ద్వారా అలరించే ప్రయత్నంలోనే ఉంటామని మనవి చేసుకుంటున్నాం.

# బ్రహ్మానందం బ్యాంకుకొస్తే...!

- కర్లపాలెం హనుమంతరావు




**(బ్రహ్మానందం బ్యాంకుకొస్తే ఎలా ఉంటుందని సరదాగా ఊహించి తమాషా కోసం రాసిన స్కిట్ ఇది)**

**(గజి బిజి బ్యాంకు... బిజీ బిజీగా ఉంది. బ్రహ్మానందం గబగబా లోపలికొచ్చాడు. నల్ల కళ్ళజోడు. చేతిలో బ్రీఫ్‌కేస్. మనిషి మహా స్టైల్‌గా ఉన్నాడు. వస్తూనే టోపీ క్రింద పడేస్తాడు)**

బ్రహ్మానందం : (పక్కనే ఉన్న గుండు హనుమంతరావుతో) ఎందుకు పడేశానో తెలుసా... !?

గుండు : తెలీదు సార్!

(బ్రహ్మానందం బోర్డు చూపిస్తాడు. 'ప్లీజ్ డ్రాప్ ఇన్' అని ఉంటుంది)

బ్రహ్మ : అందుకూ.... ఎన్‌క్వయిరీ ఎక్కడా?

గుండు : ఎన్‌క్వయిరీలో అడగాలి సార్!

బ్రహ్మ : ఛ... మాకు తెలీదులే...! అదేనయ్యా... ఆ ఎన్‌క్వయిరీ కౌంటరే... ఎక్కడా అని అడుగుతున్నా.

గుండు : మనం బ్యాంకుకు కొత్తా?

బ్రహ్మ : యస్... కానీ ఎన్‌క్వయిరీక్కాదు.

(గుండు బుర్ర గోక్కొని ఎన్‌క్వయిరీ కౌంటర్ చూపిస్తాడు)

(ఎన్‌క్వయిరీ కౌంటర్లోని కల్పనారాయ్‌తో)




బ్రహ్మ : మేడమ్! ఇటునుంచి అటు చూసినా... అటునుంచి ఇటు చూసినా ఒకే రకంగా కనబడేది ఎవరూ?

కల్ప : (సిగ్గుపడుతూ) ఎవరూ?

బ్రహ్మ : మీరే.

కల్ప : నేనా! (కులుకుతుంది)

బ్రహ్మ : యస్. ఇటునుంచైనా మేడమే... అటునుంచైనా మేడమే... MADAM... ఎటునుంచి చూసినా ఒకేలాగే లాగ కనిపిస్తుంది కదా...!?

కల్ప : ఛీ... పాడు...నాకు సిగ్గేస్తుంది బాబూ....

బ్రహ్మ : ఓకె... వెయ్‌నీవ్వండి. ఈ చెక్కు ఎక్కడ మార్చుకోవాలో చెప్తారా!

(చెక్కు కింద పడుతుంది. గుండు తీసి ఇస్తాడు)

కల్ప : కరెంట్ ఎకౌంట్ కౌంటర్లో సార్!

బ్రహ్మ : నో... నేను వాటర్ ఎకౌంట్లో మార్చుకోవాలనుకుంటున్నా... మీకేమైనా అభ్యంతరమా?

కల్ప : మాదగ్గర వాటర్ ఎకౌంట్ లేద్సార్!

బ్రహ్మ : సిల్లీ.... వాటర్ లేకుండా కరెంటు ఎలా ఉంటుంది. ఓకే... కరెంటు ఎక్కౌంటు ఎక్కడో చూపిస్తారా!

కల్ప : (చూపించి అటువైపు తిరిగి బ్రహ్మానందం అన్న మాటల్ని తల్చుకుని తల్చుకుని సిగ్గుపడిపోతూ ఉంటుంది)

(కరెంటు ఎక్కౌంటు కౌంటర్ క్లర్క్ జెన్నీతో)

బ్రహ్మ : ఇది కరెంటు ఎక్కౌంటేనా?

జెన్నీ : యస్సార్! మీరేమైనా ఆపరేట్ చేయాలనుకుంటున్నారా?

బ్రహ్మ : ఆపరేషనా?!... ఇదేమన్నా ఆసుపత్రా... ఆపరేషన్ చేయటానికి... అంతా పరేషాన్‌గా ఉందే.

జెన్నీ : బ్యాంకుకు కొత్తా?

బ్రహ్మ : యస్... కాని చెక్కుకు కాదు (చెక్కు చూపించి) దీన్ని కేష్ చేసుకోవాలంటే ఏం చెయ్యాలి?

జెన్నీ : వెనక సంతకం చెయ్యాలి

బ్రహ్మ : ఎవరిది?

జెన్నీ : (ఎగతాళిగా) ఎవరిదైనా చేస్తారా?

బ్రహ్మ : య్యా... ప్రెసిడెంటాఫ్ ఇండియాదైనా సరే... మనం రెడీ.

జెన్నీ : అంతొద్దులెండి సార్! తమరిది చెయ్యండి... చాలు.

(బ్రహ్మానందం పెన్ను తీయబోయి పడేస్తాడు. గుండు తీసిస్తాడు)

బ్రహ్మ : థాంక్స్! (సంతకం చేసి చెక్కు జెన్నీకిస్తాడు)

జెన్నీ : పొట్టిది కాదు... పొడుగుది చెయ్యండి!

బ్రహ్మ : (సీరియస్‌గా) మేం పొట్టిగా ఉన్నా సంతకం మాత్రం పొడుగ్గా చెయ్యాలా!... ఎలా చేస్తారండీ...!?

గుండు : సాగతీయండి సార్!

బ్రహ్మ : ఇందాకణ్ణుంచీ చూస్తున్నా... నన్నే ఫాలో అవుతున్నావు. ఏంటి సంగతి?

గుండు : పరోపకారం ఇదం శరీరమని మా పెద్దలు చెప్పారు సార్... మీరిందాకణ్ణుంచీ ఏదో ఒకటి కింద పారేసుకుంటున్నారు కదా! హెల్ప్ చేద్దామనీ...

బ్రహ్మ : నువ్వు నాకు నచ్చావోయ్ (జెన్నీతో) చూశారా! మనకెంత ఫాలోయింగుందో!

జెన్నీ : (టోకెన్ ఇస్తాడు)

బ్రహ్మ : ఏంటిది? నీ కళ్ళకు నేనెలా కనిపిస్తున్నానూ!?

జెన్నీ : ఏంటి సార్! అలా అడిగేశారూ?

బ్రహ్మ : లక్ష రూపాయలకి నేను చెక్కిస్తే... అఫ్టాల్ ఒక్క సత్తు రూపాయి బిళ్ళ నాచేతిలో పెడతావా!... అదీ చిల్లున్నది... !?

జెన్నీ : అది రూపాయి బిళ్ళ కాదు సార్! టోకెన్... యూ కెన్ విత్‌డ్రా కాష్ విత్ దిస్.

బ్రహ్మ : (సర్దుకుని) ఛ... మాకు తెలీదులే... సరే నెంబరు ఎంతిచ్చావ్?

జెన్నీ : 111

బ్రహ్మ : (టోకెన్ తిరిగిచ్చేస్తూ) లక్ష రూపాయలకి చెక్కిస్తే నాకు నువ్విచ్చేది 111. కుదర్దయ్యా... నాకు లక్ష నెంబరు కావాలి.

జెన్నీ : అంత నెంబరు ఉండదండీ.

బ్రహ్మ : ఎందుకుండదూ... ఉండండి... ఆ కేషియర్నే అడిగిపారేస్తాను. (విసురుగా కాష్ కౌంటర్ దగ్గరి కెళతాడు) (టోకెన్ క్రింద పడితే మామూలుగానే గుండు తీసి ఇస్తాడు)

బ్రహ్మ : హలో.... మిస్టర్ కేషియర్.

(కేషియర్ పనిలో ఉండి పలకడు)

బ్రహ్మ : (గుండుతో) చూశావా... ఎంత టెక్కో... నా నెంబరు పిలువు అప్పుడు చెబుతా నీ పని... (వెళ్ళి వెయిటింగ్ ఛెయిర్లో కూర్చోబోతుండంగా కాషియర్ 111 నెంబరు పిలుస్తాడు) (బ్రహ్మానందం కదలడు)

గుండు : అదుగోసార్! మీ నెంబరే పిలుస్తున్నాడు.

బ్రహ్మ : పిలవనీయవోయ్. నేను పలకను. ఇందాక నేను పిలిచినప్పుడు వాడు పలికాడా ....!?

గుండు : అయ్యో! వెళ్ళకపోతే మనకే నష్టం సార్!

బ్రహ్మ : అంతేనంటావా (ఆలోచించి) అవునూ... వెళ్ళకపోతే నాకు నష్టం. కానీ.. నీకెందుకురా నష్టం...!?

గుండు : మాట వరసకన్నానులే సార్!

బ్రహ్మ : ఓకే... నీ సంగతి తరువాత ఆలోచిస్తా.. పద!

(కేష్ కౌంటర్ దగ్గర చేరతారు ఇద్దరూ) (కేషియర్ సుబ్బరాయశర్మ)

శర్మ : టోకెన్ ఇవ్వండి.

బ్రహ్మ : ముందు కాష్ ఇవ్వండి.

శర్మ : అదెలా కుదురుతుందీ... టోకెన్ చూడకుండా డబ్బెలా ఇస్తానూ...!?

బ్రహ్మ : డబ్బివ్వకుండా టోకెన్ ఎలాగిస్తానూ...!?

శర్మ : యువర్ ట్రస్ట్ ఈజ్ అవర్ ట్రస్ట్... అదిగో ఆ బోర్డు చూడండి!

బ్రహ్మ : ఓకే.. (టోకెన్ ఇచ్చి కేష్ తీసుకుంటాడు) ఇదేంటి! లక్ష రూపాయలకు ఇంత కొద్దిగానే ఇచ్చావు?

శర్మ : అన్నీ... అయిదొందల నోట్లేసార్!

బ్రహ్మ : అయిదొందల నోట్లు నేనడిగానా.. (తిరిగిస్తూ) నాకు వందనోట్లు కావాలి.

(శర్మ నుదురు కొట్టుకుని వంద కట్టలిస్తూంటాడు)

బ్రహ్మ : లెక్కపెట్టు!

శర్మ : ఆల్రెడీ లెక్కపెట్టినవేనండీ బాబూ! సీల్ కూడా వేసుంది చూడండి.

బ్రహ్మ : నేను చూడకుండా సీలెవడు వేయమన్నాడు... వీల్లేదు. విప్పి నాదగ్గర మళ్ళీ అన్ని కట్టలూ కౌంట్ చేయ్! కావాలంటే ఆ తర్వాత సీల్ వెయ్

శర్మ : కుదర్దండి... కావాలంటే తీసుకోండి.. లేకపోతే లేదు.

గుండు : తీసుకోండి సార్! మనం లెక్కపెట్టుకుందాం!

బ్రహ్మ : ఓకే... మా బ్రదర్ చెబుతున్నాడు కదా అని తీసుకుంటున్నా... కట్టకు ఎన్ని నోట్లు కట్టావూ?

శర్మ : వంద.

బ్రహ్మ : నో... నాకు 75 కావాలి. తీసి మళ్ళీ కట్టలు కట్టివ్వు.

శర్మ : కట్టకు వంద నోట్లు కంపల్సరీగా ఉండాలండీ... అది రిజర్వు బ్యాంక్ రూలు.

బ్రహ్మ : తొక్కలో రూలేం కాదూ... నాకు డెబ్బైయ్యేదు చాలయ్యా. అంతకు మించి మనకు అంకెలు రావు... అదీ మన ప్రాబ్లమ్... అండర్ స్టాండ్...!?

శర్మ : నోటి లెక్కలు కూడా రావు... నోట్లు లెక్క పెట్టుకోవటాని కొచ్చావా... పేద్ద.. పద... పద... నెక్స్ట్ (తన పనిలో పడిపోతాడు)

గుండు : పదండి సార్!... మనం పక్కకెళ్ళి అన్నీ నిదానంగా లెక్కపెట్టుకుందాం!

(బ్రహ్మానందం చేతిలోనుంచి ఒక కట్ట క్రింద పడుతుంది. గుండు తియ్యడు)

బ్రహ్మ : అదేంటీ?... ఎప్పుడు తీస్తావుగా... ఇప్పుడేమయిందీ?

గుండు : పరాయి సొమ్ము నాకు పాముతో సమానం సార్! మీరే వంగి తీసుకోండి

బ్రహ్మ : (అటుపక్కవాడితో) చూశారా... మా బ్రదర్ ఎంత నిజాయితీ పరుడో... ఇలాంటివాడు నూటికొకడుంటే చాలు దేశం ఎప్పుడో బాగుపడి ఉండేది.

(పక్కవాడు నిజమేసార్! అంటాడు)

(బ్రహ్మానందం కట్టవిప్పి నోట్లు బిగ్గరగా లెక్క పెడుతుంటాడు. డిస్టర్బెన్సుకి చుట్టు పక్కలవాళ్ళందరూ దూరంగా వెళ్ళిపోతారు. బ్రహ్మానందానికి చెమటలు పడుతున్నాయి.

గుండు ఫేన్ వేస్తాడు)

గుండు : సార్... నోటు క్రింద పడింది... అరెరె... ఎగిరిపోతోంది.

బ్రహ్మ : (గుండుతో) పట్టుకో.... పట్టుకో!

గుండు : పరుల సొమ్ము... పాము... మీరే తెచ్చుకోండి సార్! కావాలంటే మీ నోట్ల కట్టలకు కుక్కలాగ కాపలా ఉంటా.

బ్రహ్మ : థేంక్స్ (నోటు వెంట పడతాడు. అష్టకష్టాలు పడి పట్టుకుంటాడు) (సంతోషంగా) చూశావా... బ్రదర్... మన తడాఖా...

(అప్పటికే గుండు నోట్ల కట్టలతో మాయం)

వీడేడీ...

పక్క : మీ బ్రదరేనా!... ఇటే పోయాడు సార్...

బ్రహ్మ : బ్రదరా... నా బొంద. అయ్యో నా లక్ష... నా డబ్బు (గోల మొదలు పెడతాడు)

(మేనేజర్ మల్లికార్జునరావు వస్తాడు)

మల్లి : అందుకే ఆ బోర్డు ఇక్కడ పెట్టింది. బివేర్ ఆఫ్ థీవ్స్. దొంగలున్నారు జాగ్రత్త అని ఎన్నిసార్లు హెచ్చరించినా జనంలో మార్పులేదు. డబ్బు చేతిలో ఉన్నప్పుడు కొత్తవారితో మాటలు పెంచకూడదు. ముందుపోయి.. పోలీస్ కంప్లెయింటివ్వండి.

బ్రహ్మ : (ఘొల్లుమని ఏడుస్తూ) నేనేనయ్యా ఆ పోలీస్‌ని... మఫ్టీలో ఉన్నా... పోయింది మా జీతాల డబ్బే...

■



# సరిగపదమని

**కూర్పు : ఎన్. అరవింద**

3




పంపినవారి పేరు : ______

వయసు : ______ వృత్తి : ______

చిరునామా : ______

______ ఫోన్ : ______

## నిబంధనలు:

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పైన ప్రచురించిన కూపన్‌తో పజిల్‌ను నింపి కవరులో పంపాలి. మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'సరిగపదమని' అంటూ నంబర్‌తోసహా పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే డ్రా తీయటం జరుగుతుంది.

విజేతల ఎంపిక
ప్రతిసారి
ఓ సినీ ప్రముఖునిచే...



## ఆధారాలు:

### అడ్డం:

1. వహీదా రెహమాన్ అభినయించిన తెలుగు నృత్య గీతం పల్లవిలోని కొంత (4)
3. నా హృదయంలో నిదురించే చెలీ / నా మది నిన్ను పిలిచింది గానమై / అరె ఏమైందీ... ఈ పాటలన్నిటికీ సినిమా పేరొక్కటే (4)
6. '.... చూపిన దేవతా' ఒకటి నిలువులోని గాయకుడు పాడిన పాట (2)
7. 'చిన్న మాట -- ------' లక్ష్మి అభినయించిన 'మల్లెపూవు' వంటి గీతం (6)
10. 'తొలిసారి మిమ్మల్ని చూసింది మొదలు' అనే పాట గల చిత్రం (8)
13. సందేహించకుమమ్మా .... రాము ప్రేమను సీతమ్మా' 19 అడ్డంలో వున్న సినిమాలోని పాట (2)
15. '.... పిచికమ్మా కథలే మాకొద్దూ' (3)
16. '.... గతి ఇంతే' (3)
18. పదహారు అడ్డంలోని పాటను స్వరపరిచిన వారికి గుండె వంటి సహాయకుడు (4)
19. ఘంటసాల సంగీత దర్శకత్వంలో సుశీల, లీల పాడిన మంచి పాటలు గల ఓ పౌరాణిక చిత్రం (4)

### నిలువు

1. తెలుగు సినీ సంగీత రంగంలో చక్కటి పేరు సంపాదించుకున్న మలయాళ గాయకుడు (4)
2. 'కురిసింది ....... నా గుండెలోన' (2)
4. బాలూ తొలిసారి పాడిన చిత్రంలోని చివరి మూడక్షరాలు (3)
5. '..... మరలిరాదు' అంటూ 16 అడ్డంలోని పాట తొలి చరణం మొదలవుతుంది (5)
8. '.... ..... పరువాలు ......' జంటిల్మన్ సిన్మాలో పాట (3)
9. 'చిన్నదాన ఓసి చిన్నదానా' అనే డబ్బింగ్ గీతాన్ని స్వరపరిచిన సంగీత దర్శకుడు (2)
11. '.... ..... చీకటిలో' రమేష్ నాయుడు స్వరపరిచిన గీతం (3)
12. 'కళ్ళు చూసి మోసపోయి కలవరించకు ..... కోరచూపు ఒకటనుకోకు' అన్నాడు ఆత్రేయ ఆత్మబలం లో (4)
14. '..... చల్లగా స్వామీ నిదురపో' (3)
15. 'కురిసే ఈ .......... జడిలో తడిసి నిరుపేదయినావె' సిరివెన్నెల 'చిలకా ఏ తోడు లేక' పాటలో కురిపించిన ధనం... (3)
17. 'చిన్ని చిన్ని..... చిన్నదాని .......' రెహమాన్‌కి జాతీయ స్థాయిలో గుర్తింపు తెచ్చిన పాట (2)

**పజిల్, కూపన్ 30-9-2003 లోగా చేరాలి**

**పంపవలసిన అడ్రసు**

'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.

మొదటి బహుమతి(ఆల్ కరెక్ట్)



36 పాటలు గల
డబుల్ ప్యాక్ ఆడియో సి.డి.

రెండవ బహుమతి (ఒక తప్పుతో)



15 పాటలు గల
ఆడియో సి.డి.

మూడవ బహుమతి

(రెండు తప్పులతో)



29 పాటలు గల
డబుల్‌ప్యాక్ ఆడియోక్యాసెట్

కన్సొలేషన్ బహుమతి

(మూడు తప్పులతో)




20 పాటలు గల
ఆడియో క్యాసెట్



నేను కౌన్సిలింగ్ బాగా చేస్తాను గురువుగారు. నన్ను కూడా మీతో చేర్చుకోండి. బోలెడు డబ్బు సంపాదించొచ్చు
మొదట నేను ట్రీట్ చేస్తాను. నేను నయం చెయ్యలేని వాళ్ళని మీ దగ్గరకి పంపిస్తూ ఉంటాను... ఓకేనా?
సరే ఈ వేళే జాయినవు
నేను బాలా సమస్యలతో జుట్టు పీక్కోలేక ఛస్తున్నాను. దీనికి పరిష్కారం చెప్తారా?
?!!!
దీనికి 2 పరిష్కారమార్గాలున్నాయి. మొదటిది నేను చెప్తాను. రెండోది మా గురువుగారు చూసుకుంటారు.
సరే చెప్పండి
ఫస్టు నా కన్సల్టేషన్ కి 1000 రూపాయిలు ఇవ్వండి
సరే తీసుకోండి
1. మీరు సమస్యలతో జుట్టు పీక్కోలేక ఛస్తున్నానన్నారు కదా? తక్షణం నున్నగా గుండు చేయించుకోండి. అప్పుడు సమస్యలే మిగుల్తాయి
ఆ సమస్యలకే మా గురువుగారి దగ్గరకెళ్ళండి
!!!?
?

# లలిత సంగీతం



ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-27402993

## మనసాయెరా మాధవా

| | |
|---|---|
| రచన | : శ్రీమతి శారదా అశోకవర్ధన్ |
| సంగీతం | : పాలగుమ్మి విశ్వనాథం |
| గానం | : శ్రీమతి విజయలక్ష్మి శర్మ |
| రాగం | : మోహన |
| | - రాగ్ భూప్ (హిందుస్తాని సం॥) |
| తాళం | : ఆది (కర్ణాటక సంగీతం) |
| | - కహరువా (హిందుస్తాని సం॥) |
| ఆరోహణ | : స రి గ ప ద స |
| అవరోహణ | : స ద ప గ రి స |

ప: మనసాయెరా మాధవా నిను చూడ
మదిలోన దరిచేర ముదమార నినువేడ ॥మనసాయెరా॥

1చ: మల్లెలు మొల్లలు మాలతీ లతలు
వేయి కనులతో వేచియుండగా
అల్లన మెల్లన పిల్లన గ్రోవితో
అల్లరి చేయుచు ఆడేటి వేళ ॥మనసాయెరా॥

2చ: నందన వనమున నడిరేయి జాముున
కల్లలెరుగని గొల్ల భామలే
మోహిని యమునా మోహన మురళీ
మురిసి మురిసి నిను వెదకిన వేళ ॥మనసాయెరా॥

3చ: మధువును మించిన తీయని మమతను
చెదరిన మనసుతో కొసరిన రాధ
ఎటుల దాటుదువో ఆనతి నీవని
బిగువు బింకమున పలికిన సత్య
స్వామి సేవకై సాధ్విరుక్మిణి
నోములు నోచిన పండుగ వేళ ॥మనసాయెరా॥



షడ్జము, చతుశృతి రిషభం, అంతరగాంధారం, పంచమం, చతుశృతి దైవతం యీ రాగంలోని స్వరాలు.

28 వ మేళ కర్త అయిన హరికాంభోజి యొక్క జన్య రాగంగా మోహన రాగం కర్ణాటక సంగీతంలో పరిగణించ బడుతుంది. హిందుస్తాని సంగీతంలో యీ రాగాన్ని భూపాలి అని భూప్ అని పిలుస్తారు. ప్రాచీనమైన యీ రాగం ఉత్తర, దక్షిణ భారతదేశం అంతటా బహుళ ప్రచారంలో వున్నది. కర్ణాటక సంగీతంలో త్యాగరాజు మొదలుకొని యీనాటి వరకూ ఎందరో వాగ్గేయకారులు మోహనరాగంలో అనేక రచనలు చేశారు. "నను పాలింప నడచి వచ్చితివో", "రారా రాజీవలోచన" వంటి కీర్తనలు కడు ప్రసిద్ధమైనవి. లలిత సంగీతంలోనూ యీ రాగం తరచుగా వాడబడుతున్నదే. ఆకాశవాణిలో ఎంతోమంది స్వరకర్తలు మోహన రాగాన్ని ఉపయోగించి మధురమైన బాణీలను కూర్చారు. డాక్టర్ బోయి భీమన్నగారి రచనలు "మోహన రాగరాగి", "ఏ గాలి వడిరాలి" మొదలైన వాటికి నేను సంగీతం కూర్చగా ఆకాశవాణిలో ప్రసారమై ప్రాచుర్యాన్ని పొందాయి. దాదాపు అన్ని భారతీయ భాషా చిత్రాలలోను మోహనరాగాన్ని అనేకమంది స్వరకర్తలు ఉపయోగించి బాణీలు కూర్చారని చెప్పవచ్చును. ప్రసిద్ధ హిందీ చలన చిత్ర దర్శకుడు, నిర్మాత వి.శాంతారాం "అమర్ భూపాల్" అనే టైటిల్‌తో మరాఠీ భాషలో మోహన రాగ ప్రాశస్త్యాన్ని చాటి చెప్పే చిత్రాన్ని నిర్మించారు సుమారు 1950 ప్రాంతంలో. ఈ చిత్రంలోని "ఘన శ్యామ సుందరా" అనే పాట విశిష్టత గురించి, ఆ చిత్రం భారతదేశం అంతటా ప్రజలను సమ్మోహన పరచిన విషయం తదితర వివరాలను నేను 16-31 మార్చి, 2002 "హాసం" సంచికలో ప్రస్తావించడం జరిగింది. ఆ పాట ప్రభావంతో దేశంలోని స్వరకర్తలు చాలామంది మోహనరాగంలో మృదు మధురమైన పాటలను మనకందించారు.

ప్రకృతి అంతా స్త్రీ స్వరూపము, పరమాత్మ ఒక్కడే పురుషుడు అనే 'నాయికా - నాయక' భావము మధుర భక్తిలోని ముఖ్యాంశము. భక్తితో రుక్మిణి, ప్రేమతో సత్యభామ, ఆరాధ నాభావంతో రాధ, గోపికలు శ్రీకృష్ణుని సేవించారు. అంతేకాదు లతలు, పుష్పాలు, యమునాధుని కూడా స్వామి సేవలో మురిసి పోయినవి అంటూ "మనసాయె మాధవా" అనే యీ మధుర భక్తి గీతాన్ని రమ్యంగా మలచారు శ్రీమతి శారదా అశోకవర్ధన్. మోహనరాగం శృంగార రసానికి అనువైనది. శ్రీకృష్ణుడు జగన్మోహనుడు. సాధారణంగా స్వరకర్తలు కృష్ణునికి సంబంధించిన గీతాలను మోహనరాగం వాడడం పరిపాటి. శృంగారం భక్తితో పర్యవసించిన యీ 'మధుర భక్తి' గీతానికి మోహన రాగం ఉపయోగించి విశ్వనాథంగారు సుందరమైన బాణీని కూర్చగా విజయలక్ష్మి శర్మ శ్రావ్యంగా గానం చేశారు.

## శ్రీమతి శారదా అశోకవర్ధన్

ఆధునిక తెలుగు సాహిత్యంలో వివిధ ప్రక్రియలలో తనదైన శైలిలో రచనలు కొనసాగిస్తూ ప్రఖ్యాతిగాంచిన మహిళామణి శ్రీమతి శారదా అశోకవర్ధన్.



సుమారు నాలుగు దశాబ్దాలుగా వైవిధ్యంగల యితివృత్తాలతో నవలలు, కథలు, వచన కవితలు, పద్యాలు, వ్యాసాలు, పాటలు,

నాటికలు, బాల సాహిత్యం మొదలైనవి ఎన్నో వ్రాశారు. కొంతకాలం ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలో కుటుంబ నియంత్రణ విభాగంలో ఫీల్డు ఆఫీసరుగా పనిచేశారు.

ఆకాశవాణికి అనేక భక్తి, ప్రణయ, దేశభక్తి, కుటుంబ సంక్షేమ గీతాలను రచించారు. ఆమె రచించిన గీతాలు శ్రీయుతులు నిర్మల్ కుమార్, పాలగుమ్మి విశ్వనాథం, ఉషాకాంత్ మొదలగు స్వరకర్తల బాణీలతో ఆకాశవాణిలో ప్రసారమై శ్రోతలను ఆకట్టుకున్నాయి. నేను కూడా ఆమె రచనలకు సంగీతం కూర్చాను. వాటిలో "ఎంత రాతి మనసు నీది కొంచెమైనా కరుగదే అది" (గానం: విజయలక్ష్మి శర్మ), "పదిమందికి చాటాలి యీ మాట - పదే పదే పాడాలి యీ పాట" ('ఈ పాట నేర్చుకుందాం' కార్యక్రమంలో నేను నేర్పిన పాట) మొ॥నవి ప్రచారాన్ని పొందిన మచ్చుకు కొన్ని పాటలు.

నిర్మల్ కుమార్ స్వరపరచిన "మొయ్యర మొయ్యర బరువులు" (బృందగీతం) అనే గీతం పలుమార్లు ఆకాశవాణిలో ప్రసారమై పాప్యులర్ అయింది.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సమాచార పౌరసంబంధాల శాఖలో జాయింట్ డైరెక్టర్‌గాను, జవహరు బాల్ భవన్ డైరెక్టర్‌గాను ఆమె పనిచేశారు. వృత్తిరీత్యా తీరిక దొరకని పనులలో వున్నా రచనా వ్యాసంగాన్ని మాత్రం కొనసాగిస్తూనే వున్నారామె.

అడుగుజాడ, తప్పెవరిది, వి పాని, రాగబంధం, అశ్రుతర్పణ మొదలగు నవలలు, మనస్విని, పాడవే రాట్నమా, పతకం తెచ్చిన పేచీ, శారదా అశోకవర్ధన్ కథలు వంటి కథల సంపుటాలు, శారదాలోచనం వంటి అనేక వ్యాసాలు, భావరాగిణి, గీతమాలిక అనే లలిత గీతాల గ్రంథాలు, యింకా అనేక వచన కవితలు, బాల సాహిత్యం, ఆత్మార్పణ (రేడియోకి), మళ్ళీ వచ్చిన వసంతం (దూరదర్శన్‌కి) మొదలగు నాటకాలు - యిలా ఎన్నెన్నో శారద లేఖిని నుండి జాలువారి ప్రచురితమైనాయి.

రచయిత్రిగానే కాక ప్రముఖ వ్యాఖ్యాత్రిగా కూడా ఆమె రాణించారు. అనేక ప్రభుత్వ, సాంస్కృతిక కార్యక్రమాలలోను, కొన్ని డాక్యుమెంటరీ చిత్రాలకు వ్యాఖ్యాత్రిగా వ్యవహరించి తన బహుముఖీనమైన ప్రతిభను చాటుకున్నారు. ఆమె రచించిన పద్యకవిత "శ్రీ విఘ్నేశ్వర సుప్రభాతం" ఆడియో క్యాసెట్లు, ఎల్.పి.రికార్డును డా॥ మంగళంపల్లి బాలమురళీకృష్ణ గారు గానం చేశారు. "ధృవ మార్కండేయ" (నిర్మాత: భానుమతీ రామకృష్ణ, సంగీతం: ఎస్ రాజేశ్వరరావు), "గోడమీద బొమ్మ" (నిర్మాత: గిరి, సంగీతం: సత్యం) చలన చిత్రాలకు పాటలు రచించారు శారద.

ఆకాశవాణి, దూరదర్శన్‌లలో కవి సమ్మేళనాలు, ప్రపంచ తెలుగు మహాసభలు (హైదరాబాద్, కౌలాలంపూర్), లండన్‌లో రాధాకృష్ణుల విగ్రహ ప్రతిష్ఠా కార్యక్రమంలోను పాల్గొన్నారు. శారద రచించిన 'స్త్రీ' టి.వి. సీరియల్‌కు ఉత్తమ రచయిత్రిగా 'నంది' అవార్డు, కవితా ప్రక్రియకు తెలుగు విశ్వవిద్యాలయం వారి పురస్కారం, వచన కవితా గ్రంథానికి ప్రియదర్శిని అకాడమి పురస్కారం - యిలా ఎన్నో అవార్డులు ఆమెను వరించాయి. 'సంచలన రచయిత్రి', 'సాహితీ శిరోమణి' బిరుదాంకితురాలు శ్రీమతి శారదా అశోకవర్ధన్ తన బహుముఖీనమైన ప్రజ్ఞా పాటవాలతో వాగ్దేవి శారదకు అందిస్తున్న నిరంతర సేవతో ఆమె జీవితం సార్ధకతను సంతరించుకున్నది. ●

ప॥ గదపదపగగరి | రి,గా,రి | సా; | రిరిస ధాధా |
మన. సా.. యె. | రా. మా. ధ | వా. | నిను చూ. డ |
పధా స రిరి | గదాప దాదా | దసారి,గా | ససాదపాదా |
మది లో. న | దరి చే. ర | ముదమా. ర | నిను వే. డ |
॥మన సాయెరా॥

1.చ॥ ;గా,గపా | రి స స స | ;ధసాసరిగరి | స స స స |
. మ. ల్లెలు | మొ. ల్లలు | . మా. లతీ.. | . లతలు |
;సరిగపా | దదదా | ;దసాసదప | దపపా |
. వే. యి క | ను లతో | . వే. చియుం. | . డగా |
;సరిరిరి | సదదద | ;దగాగగప | రిగసా సస |
. అ. ల్లన | మె. ల్లన | . పి. ల్లన. | గ్రో. . విలో |
;సరిసదదా | దసదపపప | గపాదసాసా | దపగరిసా; |
. అ. . ల్లరి | చే. . . యుచు | ఆ. డే. టి | వే. . . ళ. |
॥మన సాయెరా॥

మొదటి చరణం వలె 2వ చరణం పాడాలి.

3.చ॥ ;దదాదదా | పగగగ | గరిగపా | గరిరిస సస |
. మధువును | మిం. చిన | తే. యని | మ. మ. తను |
;సరిగపా | దదదద | ;దసాసరిస | దపపా |
. చెదరిన | మనసులో | . కొస రిన. | రా. ధ |

పై రెండు పంక్తుల వలెనే "ఎటులదాటుదువు . . . . . . పలికిన సఖి" పంక్తులను పాడాలి

;సరిరిసా | దదదా | ;దగా గప రిగ | స స సా |
. స్వే. చ్ఛ | . వ త్తై | . సా. ధ్వ. రు. | . కిన్నెర |
;సరిసదదా | దసదపపాపగ | ;గపాదస సా | దపగరిసా; |
. నా. . ముల | నా. . . చిన. | . పం. డు. గ | వే. . . ళ. |
॥మన సాయెరా॥



# వెన్నెలకంటి వెలుగులు



## వెన్నెలకంటి పదాలు

1. హాసం కెనయగు పత్రిక
దేశము నందెచటలేదు దేఖోఅంటూ
మీసము దువ్వుతు జెప్పెద
వీసము లేదతిశయోక్తి వెన్నెలకంటీ!
2. ఎందుకు 'హాసం'లోనే
ముందుగ ఈ శీర్షిక నువు మొదలెట్టావోయ్?
అందరి మనసులకింపగు
విందీ హాసం గనుకనె వెన్నెలకంటీ!
3. నిన్నటి విలువలు, మ్యూజిక్
సున్నితమౌ హాస్యమిపుడు శూన్యం బయ్యెన్
సన్నని చురకలు వేయగ
పెన్నుకు నువ్వు పదునుపెట్టు వెన్నెలకంటీ!
4. మెత్తని అభినయమును సుతి
మెత్తని సంభాషణలను మేలౌ హాస్యం
గుత్తకు గొన్నట్టి సినీ
వేత్త కదా అక్కినేని.. వెన్నెలకంటీ!
5. తెలుగున సినిమా పాటలు
తెలుగేరానోళ్ళు వచ్చి తెగపాడేస్తే
తెలుగిది కాదని తెగులని
విలవిల లాడింది మనసు వెన్నెలకంటీ!

## వెన్నెలకంటి పదాలు

1. తెలుగు జిలుగుల 'హాసం'
గీర్వాణి దర హాసం
గీతాల పదకోశం
ఓ వెన్నెలమ్మా!
2. హాస్య సంగీతాలు
హాసాన వేవేలు
అందుకే జేజేలు
ఓ వెన్నెలమ్మా!
3. బాపు అను నవబ్రహ్మ
రచియించ నా బొమ్మ
తరియించెనీ జన్మ
ఓ వెన్నెలమ్మా!
4. 'కంటి వెలుగు'ల నుండి
కలల 'వెన్నెల' పిండి
వినిపింతు వినరండి
ఓ వెన్నెలమ్మా!
5. చందాల కేశవుడు
అందాల 'పాటకుడు'
అతడె మాకులగురుడు
ఓ వెన్నెలమ్మా!



అక్కినేని నాగేశ్వరరావు






బాపు



చందాల కేశవదాసు
తొలి తెలుగు గీత రచయిత
(20.6.1876 - 14.6.1956)

## మోహన / భూప్ రాగాల ఆధారంగా కొన్ని చిత్ర గీతాలు

(16-31 మార్చి 2002 'హాసం' సంచికలో మోహనరాగం ఆధారంగా కొన్ని తెలుగు చిత్రాలు పేర్కొనడం జరిగింది. ఈ సంచికలో కొన్ని తెలుగు, హిందీ చిత్ర గీతాలు)

| పాట | చిత్రం | గానం | స్వరకర్త |
|---|---|---|---|
| **తెలుగు** | | | |
| 1. నను పాలింపగ నడచి వచ్చితివా | బుద్ధిమంతుడు | ఘంటసాల | కె.వి.మహదేవన్ |
| 2. మోహనరాగ మహామూర్తిమంతమాయె | మహామంత్రి తిమ్మరుసు | ఘంటసాల, సుశీల | పెండ్యాల |
| 3. కృష్ణా ముకుందా మురారి | పాండురంగ మహత్యం | ఘంటసాల | టి.వి.రాజు |
| 4. నీవు రావు నిదుర రాదు | పూలరంగడు | సుశీల | ఎస్.రాజేశ్వరరావు |
| 5. పాడవేల రాధికా ప్రణయ సుధా గీతికా | ఇద్దరుమిత్రులు | సుశీల | ఎస్.రాజేశ్వరరావు |
| 6. ఘనా ఘన సుందరా | భక్త తుకారం | ఘంటసాల | ఆది నారాయణరావు |
| 7. చందన చర్చిత (జయదేవ అష్టపది) | తెనాలి రామకృష్ణ | సుశీల | విశ్వనాథన్, రామమూర్తి |
| **హిందీ (భూప్ రాగం ఆధారంగా)** | | | |
| 1. జిందగీ దేనే వాలే సున్ | దిలే నాదాన్(1953) | తలత్ మహమూద్ | గులాం మహమ్మద్ |
| 2. జోతీ కలశ్ ఝలకే | భాభీకీ చూడియాఁ(1961) | లత | సుధీర్‌ఫడ్కే |
| 3. రసిక్ బల్‌మా | చోరీ చోరీ(1956) | లత | శంకర్ - జైకిషన్ |
| 4. చాంద్ ఫిర్ నిక్‌లా | పేయింగ్‌గెస్ట్(1957) | లత | ఎస్.డి.బర్మన్ |
| 5. సయొనారా సయొనారా | లవ్ ఇన్ టోక్యో(1966) | లత | శంకర్ - జైకిషన్ |
| 6. రాహీ మత్‌వాలే | వారిస్(1954) | తలత్, సురయ్యా | అనిల్ బిశ్వాస్ |
| 7. కోరా కాగజ్‌థాయే మన్ మేరా | ఆరాధన(1969) | కిశోర్, లత | ఎస్.డి.బర్మన్ |




# మిస్టర్ పెళ్ళాం



దర్శకత్వం
బాపు

కథ-స్క్రీన్‌ప్లే-సంభాషణలు
ముళ్ళపూడి వెంకటరమణ

వెండితెర నవల

**4**

నవలీకరణ
ఇలపావులూరి మురళీమోహనరావు

**జరిగిన కథ**

**బాలాజీ, ఝాన్సీ భార్యాభర్తలు. బాలాజీకి ఆడవారంటే కొంచెం చులకన భావం. బ్యాంకులో క్యాషియర్‌గా ప్రమోషన్ పొందిన ఆనందంలో టీవీ, వి.సి.పి. కొంటాడు. క్యాషియర్‌గా బ్యాంకులో చార్జ్ తీసుకున్న రోజే లక్ష రూపాయలు తేడా రావటం వల్ల మేనేజర్‌తో బాలాజీ ఘర్షణ పడవలసి వస్తుంది. -(ఇక చదవండి)**

"అది... అది... నేను డబ్బుతో కొనలేదు. అది అసలు డబ్బు కాదు. ఇన్‌స్టాల్ మెంట్లో..." నీళ్ళు నములు తున్నట్లు వణుకుతున్న స్వరంతో చెప్ప బోయాడు.

ఎవరికీ నమ్మకం కుదర లేదు. ఇదే సమయమని ధీమాగా కూర్చున్నాడు మేనేజర్. "ఆ సంగతి నాకేలా!? పాయింటుకొస్తాను. ఉదయం నీ కప్పగించిన పది లక్షల్లో ఒక లక్ష లోటుందని లెక్క తేలింది. ఆ సంగతి ఒప్పుకుంటూ ఈ పత్రం మీద సంతకం పెట్టు" పెన్ను, పేపరు ముందు పడేశాడు.



కాగితం మీద రాసిన దాన్ని కన్నీళ్ళతో చదివాడు బాలాజీ. "రేపుదయం పది గంటలకల్లా ఆ లక్షా పట్రా. నిన్ను క్షమించి కేసు లేకుండా వదిలేస్తాను. లేదా.... జైలు తప్పదు." హెచ్చరించాడు మేనేజర్.

దిక్కులు చూస్తున్నాడు బాలాజీ.

"దస్కత్ పెట్టవయ్యా ఆలోచించ కుండా. ఆయన మనసు మార్చుకుని పోలీసులకు ఫోన్ చేస్తే ఇట్నుంచిటు జైలుకే. పెట్టూ...రాత్రి ఆలోచించు కుని ఆ డబ్బు తెచ్చి కట్టెయ్" వత్తిడి చేశాడు కొండయ్య.



మేనేజర్ చిరాకు నటిస్తు న్నాడు. "ఎందుకయ్యా ఆ దౌర్భాగ్యుణ్ణి బతిమాలతావు చెప్పు? ఒక్క నిముషం టైము.... తెల్లార్లూ జాగారం చెయ్యడానికి నాకు ఓపికలేదు. అవసరం అంతకంటే లేదు." లేచాడు మేనేజర్.

నిస్సహాయంగా చూశాడు బాలాజీ. తననెవ్వరూ సమర్థించేవారు లేరని అర్థమైంది. ఉదయం తానిచ్చిన విందు కుడిచిన వారంతా తనను అను మానంతో కుళ్ల బొడుస్తూ న్నట్లు చూడటం అమిత వేదన కలిగించింది.

"పెట్టవయ్యా... పెట్టూ... రేపు కాకపోతే మరి కొన్నాళ్లు అవుతాలే" అన్నాడు కొండయ్య.



"పెట్టండి సార్ సంతకం పెట్టండి" బలవంతం చేశాడు మరొకడు. కొండయ్య్య సముదాయింపుగా" నేరం చేశావని కాదుగా. కాష్ బ్యాలెన్స్‌లో ఓ లక్ష తక్కువుందని. పర్లేదులే. సంతకం పెట్టు" అన్నాడు.

చేసేదేమీ లేక, కన్నీళ్ళను దిగమింగుకుంటూ సంతకం చేశాడు బాలాజీ.

"మీరంతా సాక్షి సంతకాలు చెయ్యండి...లేకపోతే నేను బలవంతంగా చేయించానంటాడు" అన్నాడు మేనేజరు బోల్డెంత ముందుచూపున్న అనుభజ్ఞుడిలా....

* * *

విషాద వదనంతో ఇంటి కొచ్చాడు బాలాజీ. ఇల్లంతా సందడిగా ఉంది. అందరూ తుమ్మ బంక వేసి నేలకు అతికించినట్లు కూర్చుని టీవీ చూస్తున్నారు. (ఈ సినిమా విడుదల నాటికి కేబుల్ ప్రసారాలు ఇప్పుడు న్నంత స్థాయిలో లేవని, టీవీ అప్పుడు విలాసవస్తువని, నూటికి ఒకరిద్దరి ఇళ్ళలో మాత్రమే ఉండేదని పాఠకులు గమనించ ప్రార్థన).

ఇంటిముందు నిల్చుని సిగరెట్ కాలుస్తున్న ఒకాయన 'అరె... బాలాజీ గారొచ్చారు. వెల్‌కమ్ బాలాజీ గారూ. వెల్‌కమ్." అన్నాడు నవ్వుతూ కలుగు లోంచి ఎలుకల్లా బిలబిల మంటూ బయట కొచ్చారందరూ. షేక్ హాండ్సిచ్చారు.

"ఒట్టి బాలాజీ కాదు. టీవీ బాలాజీ గారు." చమత్కరించా డొకాయన.



"ఒక్క టీవీ కొని వంద మందిని ఆనందపరుస్తున్నారు. మీరు కూడా చూస్తే మాకింకా ఆనందం. రండి సార్'' అన్నాడొకాయన.

బాలాజీ ఇంట్లోకి వెళ్ళాడు. జనం హాలు మొత్తం పరుచు కుని చీమ దూరడానికి సందు లేకుండా కూర్చున్నారు. బాలాజీ ముఖంలోని విషాదాన్ని ఎవరూ గమనించలేదు. బాలాజీకి కొంచెం కోపం వచ్చింది. భర్త ముఖ కవళి కలను గమనించిన ఝాన్సీ మెయిన్ స్విచ్ ఆపేసింది. కరెంట్ పోవడంతో అందరూ తిట్టుకుంటూ లేచారు.



"అన్నట్లు మూకుళ్లో కూర ముక్కలు పడేసొచ్చాను మాడిపోతున్నాయో ఏమిటో'' అంటూ- మధ్యాహ్నం నుంచీ టీవీకి అతుక్కుపోయిన ఒక మహిళా రత్నానికి గుర్తొచ్చి లేచింది.

"పాడు టీవీ.... పాడు సినిమాలు....నేన్చెప్పలేదూ మన ఇండియా టీవీలు ఇలాగే అఘోరిస్తాయి." శాపనార్థాలు పెట్టింది ఓ శకుంతల.

అందరూ వెళ్ళిన తరువాత లాంతరు వెలిగించింది ఝాన్సీ. పెరట్లోకి వచ్చింది. దీనంగా, దిగాలుగా కూర్చున్న భర్తను చూసి ఏదో జరిగిందని సందేహించింది.



''వీళ్ళంతా వెళ్ళేటట్లు లేరు. అందుకని నేనే కట్ చేశాను." అన్నది. ఏమీ మాట్లాడలేదు బాలాజీ.

"చూశారా... ఇంతసేపూ నవ్వుతూ టీవీ చూస్తూ కరెంట్ పోగానే పాడు సినిమా పాడు టీవీ అంటూ తిట్టుకుంటూ పోయారు.'' మాట్లాడించాలని ప్రయత్నిం చింది. జవాబు లేదు.



"ఏమిటింత ఆలస్యం? ఇవాళ పార్టీయా?" నవ్వుతూ అడిగింది ఝాన్సీ.

భార్య లాలనకు దుఃఖం పొంగుకొచ్చింది బాలాజీకి.

నిద్రపోతున్న పిల్లల మీద చేతులు వేసి "వీళ్ల మీద ఒట్టు... నేను ఏ పాపం ఎరుగను." అన్నాడు బొంగురు గొంతుతో.



ఝాన్సీకి ఏమీ అర్థం కాలేదు. ఆప్యాయంగా భర్త భుజాల మీద చేతులు వేసి "ఏంటండీ? ఏం జరిగింది?" ప్రేమగా అడిగింది.

''ఆ మేనేజర్ గాడు మోసం చేశాడు. నాకేం తెలియదు. ఒట్టు... పిల్లల మీదొట్టు. నీ మీదొట్టు....'' అంటుండంగా తమలపాకుల వంటి హస్తాలతో భర్త పెదవులు మూసింది ఝాన్సీ. 'కార్యేషు దాసీ' వంటి ఇల్లాలి ఒడిలో పసిబాలుడిలా ఒదిగిపోయాడు బాలాజీ. తను అస్తమానం చిన్న చూపు చూస్తూ చీదరించుకునే భార్య కన్న తల్లిలా కనిపిస్తున్నదిపుడు.

* * *

లాడ్జీలో ఒక గది. మంచం మీద మందు కొడుతూ మేనేజర్ కూర్చున్నాడు. అతనికి ఎదురుగా కుర్చీలో మీసాలాయన కూర్చున్నాడు. నమస్కరిస్తూ కింద కూర్చున్నాడు కొండయ్య.

జేబులోంచి నోట్ల కట్టలు తీశాడు మీసాలాయన. "అయ్యా ఇదిగో పొద్దుట మీరిచ్చిన లక్ష. నా వాటా నాకు పడేయ్యండి'' కట్టలు అందించాడు.



"నా డబ్బేంటి?... బ్యాంకు డబ్బు. ప్రజల డబ్బు. పొద్దున్నే కట్టేయ్యాలి.'' కట్టలు అందుకున్నాడు మేనేజర్.

కొండయ్య జేబులోంచి కొన్ని కట్టలు తీశాడు. "అయ్యా ఉడతాభక్తిగా నేను సమర్పించేదిదుగో లక్ష" అన్నాడు.

అందులోంచి ఇరవై వేలు తీసి మీసాలాయనకు ఇచ్చాడు మేనేజర్.

"ఇదేమిటి? ఏభై ఇస్తానని ఇరవై ఇచ్చారు? మరి నా కష్టం?' అన్నాడు మీసాలాయన.

కొండయ్య కోపంగా లేచాడు. "ఏమిటయ్యా నీ బోడి కష్టం? ఆయన ముందు నీదేపాటి? పాపం! బుర్ర పగిలి నెత్తురు కూడా వచ్చింది చూడు." అన్నాడు.

"అంతేనా? అసలు అయిడియా నాది. ప్లాన్ నాది. నటన నాది. ఎన్నాళ్ల ఆలోచించాను? ఎంత పర్ఫెక్టుగా ప్లాన్ చేశాను?" కొనసాగించాడు మేనేజర్.



"అదీగాక...రేపువాడు మళ్లీ వచ్చి పడినా, అప్పుచేసి డబ్బు తెచ్చినా...'' అని కొండయ్య అంటుండగానే

"ఈ జన్మకి తేలేదు"అని నిర్ధారించేసి"లక్ష కావాలంటే మర్డరు చెయ్యాలి..లేదా ఆలిండియా బందులూ దొమ్మిలూ జరిగినప్పుడు దోచుకోవాలి. ఇంత కష్టపడితే నాకు దక్కింది ఇరవై..." అని అన్నాడా మీసాలాయన తనకున్న అనుభవసారాన్ని విశదీకరిస్తూ.

అంతకన్నా అనుభవజ్ఞుడైన మేనేజర్‌కిదేం రుచించలేదు.

"ముందు ఆ విగ్గు, మీసం పీకేసి ఇలా ఇయ్యి" అన్నాడు చిరాకుగా.

"మరో పదిప్పించండి" బతిమాలాడు మీసాలాయన తన పెట్టుడు మీసం, పెట్టుడు విగ్గు తీసి పక్కన పెడుతూ.



"నీ కెందుకివ్వాలి? ఇంకా వత్తాసు డ్రామా ఆడి చాలా శ్రమపడ్డాను ఇస్తే నా కివ్వాలి కానీ." అన్నాడు కొండయ్య.

"నీకెందుకయ్యా మగడా... లడ్డూలాంటి క్యాష్ కీపర్ జాబిస్తుంటే! రోజూ పది నుంచి

ఐదు దాకా వడ్డీ వ్యాపారమేగా! పొద్దున్నే పదింటికి ఓ లక్ష బయటకు పంపి వడ్డీకి తిప్పుతావు. సాయంత్రం ఐదింటికల్లా వెయ్యి రెండువేలూ వడ్డీ గుంజేస్తావు. నిత్య కళ్యాణం ఏడాదికి మూడొందల అరవై అయిదు రోజులున్నూ.... " అన్నాడు మేనేజర్.

తన గుట్టు మట్టులన్నీ విప్పుతుండటంతో ఖంగుతిని మేనేజర్‌కు దణ్ణం పెట్టాడు కొండయ్య.



"బలేవారే! మూడొందలరవై ఐదెక్కడ? అందులో ఐభై రెండు ఆదివారాలూ శెలవా! అర పూట శనివారాలు ఇరవై ఆరా! పండగలు, బందులు నూటేభయ్యా, ఇక మిగిలేదెంతా? రేపట్నుంచి ఆ సీటెక్కయ్యమంటారా మరి?" ఆశగా అన్నాడు.

" నువ్వన్నట్టు రేపు ఆదివారం. ఎల్లుండి పండగ. కాస్తాగు. ఈ డబ్బును వెనక్కి చేర్చాలి. వాడు రాసిచ్చిన కాగితం వేరే దాచి పెట్టుకోవాలి. రికార్డుల్లో ఈ మరక పడకుండా చూసుకోవాలి. ఎన్ని పనులు! ఎన్ని పన్నాగాలు!! అసలు నా శ్రమకిది చాలదు. అన్యాయం....అతనికిచ్చిన ఆ ఇరవై భర్తీ చేస్తే బాగుంటుంది." కొండయ్యతో అన్నాడు మేనేజర్ విషపు నవ్వు నవ్వి.

"అమ్మో... అలా నవ్వకండి. నాకు భయం. అలాగే చూద్దాం" అన్నాడు కొండయ్య

దొంగలు దొంగలు ఊళ్ళు పంచుకున్నారు...అదీ ఆ దుష్టత్రయం...వాళ్ల తాపత్రయం.

* * *

భార్య ఒడిలో పడుకుని రావిచెట్టు క్రింద బాటసారిలా సేద దీరుతున్నాడు బాలాజీ.



ప్రమోషన్ రోజునే డిస్మిసల్ కూడా వచ్చి పడుతుందని కలలో కూడా అనుకోలేదు. ఆ దేవుడిగారి కిదేం సరదానో?" అన్నాడు.

"దేవుడిక్కాదు.... సరదా అంతా మనకే. లేకుంటే బోరు కొడుతుంది బ్రతుకు." నవ్వింది ఝాన్సీ.

"వాట్! నా ఉద్యోగం ఊడితే నీకు సరదాగా ఉందా?" మూతి ముడుచుకున్నాడు బాలాజీ.

"పెళ్ళైన కొత్తల్లో మా నాన్నారో కథ చెప్పారు."

"గీతోపదేశం చేస్తున్నావా?"

"నాకిది ఐదో ఉద్యోగమట. పుట్టి నాలుగైదేళ్ళు నిండేదాకా మహరాణి ఉద్యోగం. అమ్మానాన్నా, అవ్వా తాతా అంతా సేవ చేస్తారట.



అల్లరి చేసినా ముద్దులే ముద్దులు. ఆ ఉద్యోగం పోగానే బళ్ళో వేస్తారు. విద్యార్థి ఉద్యోగంలో అల్లరి చేయక పోయినా గుద్దులే. ఇది చదువు, అది చదవకు, హోం వర్కు, పాసు, ఫేయిలు అని సాధిస్తారు. అది పోగానే పెళ్ళికూతురు ఉద్యోగమట. ఆ సినిమాకెళ్ళకు, వాడికేసి చూడకు, పైట సరి చేస్కో అని గదమాయిస్తారు. ఓ పక్కన మీలాంటి రౌడీలు ఈల వేస్తారు. కన్ను కొట్టి నవ్వి కల్లోకొచ్చి అల్లరి పెడతారు. పెళ్ళి కూతురుద్యోగం పోగానే కొత్త పెళ్ళాం ఉద్యోగం."

వెన్నెల సోనల్లాంటి భార్య ఓదార్పుకు పక పక నవ్వాడు బాలాజీ. "అమ్మో... నా కొత్త పెళ్ళాం. కోమలం.. కుసుమ కోమలం." అన్నాడు.

"అంటూ రాజకుమారి దగ్గర సేవకుడిలా సేవిస్తాడు.పెళ్ళాం ఉద్యోగం లోంచి తల్లి ఉద్యోగం పుట్టుకొస్తుంది. వంటా, వార్పూ పతిసేవా, పిల్లలూ, పోషణా, బట్టలూ... ఇస్త్రీ...." కొనసాగించింది.

"సరె సరె.... ఇంతకీ పాయింటు ఏంటని?" అడిగాడు కొంచెం అసహనంగా.

"అదే.... ఒక్కో ఉద్యోగం కొన్నాళ్ళకు పోయి కొత్త ఉద్యోగాలు వస్తూండడమే సరదా. అదే మజా, థ్రిల్. అంచేత మనం పాత ఉద్యోగం పోయిందని దిగులు పడే బదులు కొత్త ఉద్యోగం వస్తోందని సరదాపడుతూ హుషారుగా ఉండాలి" నవ్వింది ఝాన్సీ.

భార్యను కౌగలించుకున్నాడు బాలాజీ. పానకంలో పుడకలా పిల్లవాడు నిద్రలేచి 'అమ్మా' అని కేక పెట్టాడు.

* * *

మర్నాడు ఉదయం ఝాన్సీ పిల్లలకు టిఫిన్ పెడుతుండగా బాలాజీ ఎక్కడికో బయల్దేరాడు.

"ఇంత పొద్దున్నే ఎక్కడి కండీ." అడిగింది ఝాన్సీ.

బాలాజీకి రోషం పొడుచుకొచ్చింది. మళ్ళీ మామూలు 'మగాడ' య్యాడు.



"ఊ... అడిగావూ! స్టుపిడ్ క్వొశ్చెన్... నేనెక్కడికెళ్తే నీకెందుకు?" అన్నాడు కోపంగా.

"అది కాదండీ... టిఫిన్ కూడా తినకుండా..."

"టిఫిన్ చెయ్యడం వరకే నీ పని. తినడం మానడం, ఇప్పుడు, ఎప్పుడూ నీకనవసరం. నేనెక్కడికెళ్తే నీకెందుకు చెప్పు? మొగాడికి కోటి పన్లుంటాయ్" అన్నాడు.

"నేనందుకనడం లేదండీ" చిన్నబుచ్చుకుంది ఝాన్సీ.

"నువ్వెందుకన్నావని నేను అడగలేదు. నిన్నొక ఉద్యోగం ఊడింది. తెలుసుకదా. ఇంకోటి వెతుక్కోవాలి కదా. పని లేకుండా కూర్చుని తినడానికి నీ బాబు నా బాబు తవ్వి



పాతల్లెయ్యలేదు కదా? పేపర్ల నిండా పుట్టలు పుట్టలుగా ఉద్యోగాలున్నాయి. ఇందులో నాకు కావలసింది, నచ్చింది సెలెక్టు చేసు కొస్తాను. దట్సాల్.... ఎన్నింటి కొస్తారూ అని మళ్ళీ నస ప్రారంభించకు...బై చిల్డ్రన్...."అంటూ పిల్లలకు టాటా చెప్పి వెళ్ళిపోయాడు బాలాజీ.

* * *

అదో ఆఫీసు.



'శోభా'యమానంగా కూర్చుని ఎవరితోనో ఫోన్లో మాట్లాడుతున్నది మేడమ్ "ఊ...అలాగే...ఓకే" అంటూ సుదీర్ఘంగా ఆమె మాట్లాడు తుంటే అసహనం గా ఉన్నది బాలాజీకి. 'అనువుగాని చోట

అధికులమనరా' దన్నారు కాబట్టి ముళ్ళ మీద కూర్చున్నట్లు కూర్చున్నాడు.



ఆమె అలా పది నిముషాలు మాట్లాడిన తరువాత బాలాజీ వంక చూసింది. "సారీ మిస్టర్ బాలాజీ. సాధ్యం కాదు." సర్టిఫికెట్లు తిరిగిస్తూ అన్నది.

నిర్ఘాంతపోయాడు బాలాజీ. ''మేడమ్... నన్ను మీరేమీ అడక్కుండానే... నా అప్లికేషన్ పరిశీలించకుండానే...'' అన్నాడు.

నవ్వింది మేడమ్. "అప్లికేషన్ పరిశీలించాను. పరిశోధన అవసరం లేదని తేలింది. నేను మిమ్మల్ని ప్రశ్నలడగ లేదన్నారు అడిగితే.... ఇంతకు ముందు ఎక్కడ పనిచేశారు అని అడగాలి. ఫలానా బ్యాంకులో అని చెప్తారు. అవునా?'' అన్నది.

బాలాజీ ముఖంలో రంగులు మారుతున్నాయి.



''అక్కడ ఎందుకు మానేశారు అని అడుగుతాను" సూటిగా చూసింది మేడమ్.

బాలాజీ ఏదో చెప్పబోతుండగా వారించిందామె. ''మీరు చెప్పబోయి మానేసింది నాకు తెలుసు అవునా...మీ కన్నాముందే మీ మీద నిందో నిజమో చేరిపోయింది.

"మిస్టర్ బాలాజీ... మంచి కన్నా చెడు వేగంగా ప్రయాణిస్తుంది నీళ్ళ మీద నూనెలా! అయామ్ సారీ మిస్టర్ బాలాజీ..."

మేడమ్ వంక ధైర్యంగా చూడలేకపోతున్నాడు. సర్టిఫికెట్లు తీసుకుని వెళ్ళబోయాడు. మళ్ళీ మేడమ్ గొంతు కొరడా దెబ్బలా వినిపించింది.



''చూడండి. అడక్కపోయినా ఒక సలహా. మీ మీద పడ్డ నింద నిజం కాదని ఋజువయ్యే వరకు ఉద్యోగాలకి ప్రయత్నించకండి. ఎవరూ ఇవ్వరు. ఉద్యోగం కావాలంటే మరొక దేశానికో, కనీసం మరొక రాష్ట్రానికో వెళ్ళండి. మీ మీద నింద నిజం కాదేమో అని నేననుకుంటున్నాను. ఐ విష్ యూ ఆల్ ది బెస్ట్." తన పనిలో మునిగిపోయింది మేడమ్.

బాలాజీ ముఖం పూర్తి నలుపు సంతరించుకుంది.

* * *

పేపర్లలో పుట్టలు పుట్టలుగా ఉద్యోగాలున్నా వాటి కోసం గుట్టలు గుట్టలుగా ఎగబడే వారు చాలా మంది ఉన్నారని, చీమ దూరడానికి కూడా ఆ పుట్టలో స్థానం లేదని త్వరలోనే అర్థమైంది బాలాజీకి. ఎన్ని ఉద్యోగాలకు ప్రయత్నించినా ఫలితం శూన్యమని తెలిసింది.



ఉద్యోగం పోవడం తేలికే కానీ రావడం అంత సులభం కాదని అనుభవంలో అవగాహనైంది. అయినా చింత చచ్చినా పులుపు చావలేదని, తాను మగవాడి నన్న అహం మాత్రం అణగ లేదు. చెప్పు కింద తేలులా పడుండే పెళ్ళాం దొరికిన ప్రతి మగ వాడూ ఇంతేనేమో?

హాలులో తూగుటుయ్యాల మీద కూర్చుని భార్యను ఒరకంట గమనిస్తూ భగవద్గీత పుస్తకాన్ని చదువుతున్నట్లు నటిస్తున్నాడు బాలాజీ "ఓం పరబ్రహ్మణేయ నమః శ్రీమద్భగవద్గీత... టీకా తాత్పర్య సహితము... నవోదయ పబ్లిషర్స్.. విజయవాడ, గుంటూరు.." అంటూ ఓ కంటితో కూరలు తరుగుతున్న ఝాన్సీని చూస్తున్నాడు.



భగవద్గీతను పట్టుకున్న భర్తను ఆశ్చర్యంగా చూస్తూ" అదంతా వైరాగ్యమే?'' అన్నది. తను ఉద్యోగం చేస్తున్నప్పుడు సాగించిన సాగుడు ఇప్పుడు కూడా సాగుతుందో లేదో పరీక్షిద్దామనుకున్నాడో ఏమో ... చేతికందు బాటులో ఉన్నా సరే 'ఫాన్' అన్నాడు సరిజెయ్యమన్నట్లు. ఝాన్సీ లేచి వచ్చి ఫాను సరిగా పెట్టింది. మళ్ళీ చదవ సాగాడు బాలాజీ. "కర్నూలు, కరీంనగరు మరియు మాస్కో.. వెల పజ్జెనిమిది అణాలు.. కాపీ రైట్స్ రిజర్వుడు.." అంటున్నాడు.

చాలాసేపట్నుంచి భర్తకో విషయం చెప్పాలని సమయం కోసం చూస్తున్నది ఝాన్సీ. "అన్నపూర్ణ ఫుడ్ కార్పొరేషన్లో సేల్స్‌మెన్ ఉద్యోగాలు ఖాళీ ఉన్నాయటండీ.'' చెప్పింది.



"ఉంటే ? " భార్య వైపు చూడ కుండానే అన్నాడు బాలాజీ.

"ఆ కంపెనీ యజమానులు మన వాళ్ళేనండీ. ఆ మేనేజింగ్ డైరెక్టర్ ఇంటర్లో నా క్లాస్‌మేటు."

" సిపార్సు చేస్తానంటావు! నా బతుక్కి అదొకటే తక్కువ! ఆడదాని రికమెండేషన్! హుఁ.. " అన్నాడు బాలాజీ ఈసడింపుగా.

-(ఇంకావుంది)



## మిస్టర్ పెళ్ళాం షూటింగ్ జ్ఞాపకాలు

'మిస్టర్ పెళ్ళాం' హీరోయిన్ ఆమని ఒరోజు షూటింగు పూర్తి చేసుకుని మర్నాడు పుదయం మదరాసు(చెన్నై) వెళ్ళిపోవలసి వుంది. అంచేత ఆమె అందరికన్నా ముందే రెడీగా లొకేషన్‌కు చేరుకుంది.

''షాట్ రెడీకాగానే పిలుస్తాను'' అంటూ నేను లోపలకు వెళ్ళబోయాను.



"మీరు వెళ్ళండి. నేను లోపలకి రావాలంటే నిర్మాతగారిని ఓసారి బైటకు రమ్మనండి" అంది.

ఆ సంగతి నిర్మాతకు చెప్పాను.

ఆయన వెళ్ళి తన బాధ అంతా ఆమెకు వివరించారు. అనుకున్న డబ్బు అనుకున్న సమయానికి, అనుకున్నంత రాలేదట! ఇది సినిమా నిర్మాణంలో చాలా సాధారణం- ఆమెకు నచ్చచెప్పి షూటింగు జరిపించారు. అది తెల్సిన యూనిట్ సభ్యులంతా- "ఆమని ఏమనె?" అని అడిగేవారు తమాషాగా.

"ఆ మనీ ఈ(య)మనె!" అని నేను సమాధానం చెప్పేవాడిని.

-కె.వి.రావు, చెన్నై

అలనాటి ఆణిముత్యాల గురించి
నేటి తరానికి అనువైన శైలిలో తెలిపే

క్లాసిక్స్ రీటోల్డ్

# నవ్వుటద్దాలు

- ఆచార్య తిరుమల



ఇంటి సమస్యలు ఎలా పరిష్కార మవుతాయిర దేవుడా అనీ.....

# చమత్కార వ్యవహారాలు

పద్యాల్లో హాస్యాన్ని పండించటం అంత తేలికైన పనికాదు. దానికి సరస సంభాషణా చాతుర్యం, వ్యావహారిక భాషా గతమైన చమత్కార శైలి కావాలి. వేమన్నని మహాకవిని చేసి, సాహిత్య రంగంలో సుస్థిర స్థానాన్ని కల్పించింది అతని హాస్యధోరణే. అటువంటి కవులు అరుదుగా వుంటారు. వ్యంగ్య ప్రధానమైన శతకాల్లో హాస్యం చిప్పిరిల్లుతుంది. విషయం కంటె విషయ విస్తరణలో చమత్కారం జీవనాడి అవుతుంది. వేణుగోపాల శతకంలో కలియుగ వర్ణ సంకరాన్ని కవి ఎంత చమత్కరిస్తున్నాడో చూడండి:-

తండ్రి మధ్వాచారి తనయుం
డారాధ్యుండు
తల్లి రామానుజ దాసురాలు
తాను కూచి మతంబు తమ్ముడు బౌద్ధుండు
సర్వేశ్వరు మతము షడ్రకునిది
ఆలు వైశ్యుల బిడ్డ అక్క జంగమురాలు
బావగారిది లింగబలిజ కులము
ఆడుబిడ్డ సుతారి అల్లుడు పింజారి
మరదలు కోడలు మారువాడి
కలియుగంబున వర్ణ సంకరము ప్రబలి
ఉత్త మత్వంబు లోకమూల కొత్తి గిల్లె
మదన భూపాల! మునిజన హృదయ లోల!
వేణుగోపాల! భక్త సంత్రాణ శీల!!

నానా రాజ్య సమితి లాంటి యిటువంటి యింటిని

చూసినా, తలచుకున్నా యెవరికి నవ్వురాదు చెప్పండి. ఇటువంటి యిళ్లుంటాయని నేననుకోను. ఇదంతా కవి చమత్కార భావన, విషయ విస్తరణలో కవి సాధించిన హాస్యం. ఇలాగే దేవుళ్ల మీద దండెత్తి వాళ్ళ గుట్లు రట్టు చేసిన కవులున్నారు. అది వేరే అంశం. ఆధునిక కవుల్లో కొంతమంది పద్యం ద్వారా హాస్యాన్నందించారు. యస్వీ.జోగారావు గారి చాటు కావ్యం 'అపూర్వ కాకలి' ఒక నవ్వుల గని. అందులో కొన్ని పద్యాలు పరిచయం చేస్తాను.




ఇచ్చిన ప్రశ్నలకి జవాబులు రాయటం మానేసి ఒక శిష్యరత్నం గురువుగారి నిలా నిలదీసి తన సందేహాన్ని అడుగుతున్నాడు:-

**ప్రశ్న పత్రములకు ఆదిభట్లవాడు**
**క్లాసు మీటు కైలాసము వ్రాసినట్టి**
**ఆన్సరు- "గురుజీ! తెలియక అడిగినార?**
**తెలియునన్నచో అది దగా- తెలియకన్న**
**నదియునుదగాయె, మానుండి ఆన్సరులను**
**తెలిసి కొనుట కెత్తిన యెత్తు, ధీర ధిషణ!!**

ఇంక గురువే మనగలడు, జుట్టు పీక్కోవటం తప్ప. ఇలా ఆన్సరు బుక్కుల్లో రకరకాల ఉత్తరాలు రాసే విద్యార్థులు నేటికీ కోకొల్లలుగా వున్నారు. ఉన్నారంటే ఉండరామరి, గురువులు గురువుల్లా వుంటే గదా. ఒక గురువు గారు కృతఘ్నతంటే ఏమంటున్నాడో చూడండి:-

**"అయ్యవారు! కృతఘ్నత యన్న నేమి?"** అని అడిగితే
**"ఉప కృతింబొనర్చిన వారి యొద్ద తప్ప**
**నింకెవరి యెడలను ప్రదర్శింప బడని**
**సద్గుణము సుమ్ము కాళింగ శరభ లింగ!!** అంటున్నాడు,

ఉపకారం చేసే వారి వద్ద మాత్రమే ప్రదర్శింపబడే సద్గుణంట కృతఘ్నతంటే! ఇలాగే ఓ విద్యార్థికి కైక పాత్ర మీద సందేహమొచ్చింది. కైక రామాయణంలోనే కాదు భారతంలో కూడా వుందా? అని అడిగితే ఓ గురూజీ యిలా చెప్తున్నాడు:-

**"రామ కథ కైక పాత్ర సిత్రము కదండి**
**కలద భారతమున గూడ కైక పాత్ర?"** అని విద్యార్థి అడిగితే-
**"విరటుని సుధేష్ణ కేకయ విభుని పుత్రి"**- అని విరాట మహారాజు భార్య సుధేష్ణదేవి కేకయ రాజ పుత్రి కాబట్టి కైక అని చెప్పి వూరుకో వచ్చును గదా- వూహు! సమాధానం ఇంకా ఎలా సాగదీశాడో చూస్తే నవ్వొస్తుంది:-

**ఆమె గయ్యాళి, ఈబిడ నంగనాచి**
**పుచ్చుకొనదామె, ఈవిడ పుచ్చుకొనును!!**

రామాయణ కైక గయ్యాళి, భారత కైక నంగనాచి. ఆవిడ మద్యం తాగదు. ఈవిడ తాగుతుంది. ఈ కొసమెరుపు కుర్రాడి కెందుకు చెప్పండి? గురువుగారి అలవాటు గాక! ఇలాగే ఓ విద్యార్థి సీతాఫలానికి, రామాఫలానికి తేడా ఏమిటని అడిగితే- ఆ గురువిలా సందేహ నివృత్తి చేస్తున్నాడు:-

**"మజ్జ! సీతా ఫలమ్ము రామా ఫలమ్ము**
**నొక్కజాతికే చెందినా యొక్క మాడ్కి**
**నుండ వెందుకు చెప్పుమా ఓ గురూజీ!"** అని అడిగితే-

**"కలవు సీతకు కనులు, రాములకు లేవు!!"** అని సమాధానం.

సీతాఫలంలో గింజ-గుజ్జు వుంటుంది. దాన్ని కన్ను అంటారు. రామాఫలం లో గుజ్జు తప్ప గింజవుండదు. దీన్ని అనరాగా తీసుకుని, లేడి వెంట పరుగెత్తాడని కాబోలు రాముడికి కళ్ళు లేవని చమత్కరించాడు గురువు. ఏది ఏమైనా మహాపురుషుల మీద చులకన భావం కలిగించటం, నవ్వులాటకైనా వారిని అగౌరవ పరచటం మంచిది కాదు గదా! ఇలాంటి గురువులే కాదు మిడిమిడి జ్ఞానులైన జ్యోతిష్కులు కూడా వుంటారు. శాస్త్రం కంటె వారికి డబ్బు సంపాదన ముఖ్యం. అందుకు వాళ్ల వాళ్లకు తోచిన వేవో, ఏవేవో చెప్తూ అడిగేవారి బలహీనత మీద ఆడుకుంటూ వుంటారు. అలాంటి ఓ తప్పుడు జ్యోతిష్కుని మీద ఒకాయనకు వొళ్లు మండిపోయి ఏమంటున్నాడో చూడండి:-

**"తిప్ప లింగము గొప్ప జ్యోతిష్కుడండి**
**ఎప్పుడైన జాతకము చూపించుకొనిర?"**
**-"కొంటి, నా బొంద చెప్పె, ముత్తాత చచ్చె**
**ననియు జెప్పె, మాయావిడ యిప్పటికిని**
**ముండ మోయలేదని చెప్పె, మోసగాడు!"**

ఇలాంటి జ్యోతిష్కులు లేకపోలేదు. ఇళ్లముందు బోర్డులు బ్రహ్మాండమైన బిరుదాలతో తగిలించుకుని ప్రచారాలు చేయించుకుంటూ బతికేస్తూ వుంటారు. నిజానికి ఎవరి ఆంతర్యం ఎవరికి తెలుస్తుంది? ఎవరి జీవితాల కెవరు బాధ్యులు? వంకాయ కూర చేసుకుంటే దోసకాయ పచ్చడి కంచంలోకి వస్తుందా? "యద్భావం తద్భవతి", భావాన్ని బట్టి భావం ఉంటుంది. ఏ ఆలోచనా ఫలం దానికుంటుంది. అది మంచి గానీ, చెడు గానీ. గతమే కాదు, వర్తమానమే కాదు, భవిష్యత్తు కూడా కార్య కారణ సంబంధం మీదనే ఆధారపడి వుంటుంది. కారణాన్ని బట్టి కార్యం



ఉంటుంది కాబట్టి, మన మిలా ఎందుకున్నామో, ఆ కారణాన్ని వెతుక్కోవలసినది మనమే. ఆ పని ఒకరి కొకరు సాయపడి చేసేది కాదు. "గహనా కర్మణో గతిః" కర్మగతులు గహనమైన వన్నాడు గీతాచార్యుడు. అయితే, ఆ కారణాన్వేషణకు శాస్త్రం ఉపయోగిస్తుంది. అదొక ఆయుధం. దాన్ని ఉపయోగించుకునే శక్తి మళ్లీ మానవ మేధస్సు మీదనే ఆధారపడి వుంది విపరీతార్థాలకి విపరీత ఫలితాలే వస్తాయి.

అలాంటి విపరీత ఫలితమే పై పద్య భావం. 'అపూర్వ కాకలి' ఇలాగే వుంటుంది. కొంతమంది కవులు భావాలతో ఆడుకుంటారు. కొంతమంది కవులు పదాలతో ఆడుకుంటారు. కొంతమంది కవులు అక్షరాలతో కూడా ఆడుకుంటారు. తిరుపతి కవుల్లో ఒకరైన వెంకటశాస్త్రిగారు మహాచమత్కారి. ఆయన పద్యం చూడండి:-

**ఇతర దేశమ్ములను జనియించు కంటె**
**నాంధ్ర దేశాన జనియించు టార్య హితము**
**"వశి! వశి!" యటంచు పిలుతురు వారు భార్య**
**నదియు "శివ! శివ"యై తుదకఘము లడఁచు!!**




భార్యని పేరుతో కాకుండా యెంతో ప్రేమతో "వశీ! వశీ! వసేవ్!" అని పిలవటం తెలుగువారి అలవాటు. అది మగాడి దురహంకారంగా తప్పు పడతారు గానీ, అందులో ఓ పుణ్య సంప్రదాయం వుంది. 'మ-రా' 'మ రా' అంటుంటే 'రామ రామ' అయినట్టుగా 'వశి-వశి' అంటుంటే అది 'శివ - శివ' అయి పాపాలు పోగొడుతుంది. కాబట్టి, ఎక్కడో పుట్టేదాని కంటె ఆంధ్రదేశంలో పుట్టటమే మంచిదని శాస్త్రిగారి సలహా.

భావాలతో ఆడుకోవటమంటే కొన్ని చమత్కార పద్యాలు మనవి చేస్తాను.

**సురలను సురలే మ్రింగిరి**
**పర గంగా బ్రహ్మవచ్చి భానుని మ్రింగెన్**
**అరయుగ నప్పరి చెంతను**
**శిరహీనుని శివుడు మ్రింగె చిత్రము గాదే!!**

దేవతల్ని దేవతలు, బ్రహ్మ సూర్యుని, కబంధుని శివుడు తినేశారని పద్య భావం. కానీ ఆంతర్య చమత్కార మది కాదు. సుర అంటే చేప. బ్రహ్మ (అజ) అంటే మేక. భానువృక్షం జిల్లేడు, శిరసులేనిది పీత, శివా అంటే నక్క. ఇప్పుడు చూడండి: చేపల్ని చేపలు, జిల్లేడు చెట్లని మేకలు కలుగులో పీతల్ని నక్కలు తిన్నాయని చెప్పదల్చుకున్న విషయం. దానికింత పురాణ పాత్రల రంగు పూశాడు కవిగారు.

మరో కవిగారు ఆడదాని కౌగిట్లో ఎంత కరిగిపోయాడో గానీ ఆ అనుభూతి నెంత చమత్కారంగా వర్ణిస్తున్నాడో చూడండి:-

**ఆ కాంతామణి కౌగిలి**
**కాకాశం బొణికె తార లట్లట్లాడెన్**
**జోకైన గిరులు కదలెను**
**భీకరమగు తమము చంద్ర బింబము గప్పెన్!!**

కవులు ఆడదాని నడుముని ఆకాశంతో, గోళ్లని తారలతో, స్తనాల్ని గిరులతో, జుట్టుని భయంకరమైన తమము (చీకటి)తో, ముఖాన్ని చంద్రబింబంతో పోలుస్తారు. ఇప్పుడీ పద్యాన్ని మళ్ళీ చదివి, ఆ కాంతామణి పట్టు ఎంత గట్టిగా వుందో అర్థం చేసుకోండి.

ఒక కన్యామణిని వర్ణింప దలచుకుని మరోకవి గారు కన్యారాశి నుండి బయలుదేరి ఎలా భావించాడో చూడండి:-

**కన్యకు నారు కుచంబులు**
**కన్యకు మరి నేడు కండ్లు గణుతింపంగా**
**కన్యకు నాలుగు బొమలును**
**కన్యకు పండ్రెండు నడుము గలదు శుభాంగీ!!**

కన్యారాశి నుండి ఆరో రాశి కుంభం, ఏడో రాశి మీనం, నాలుగోరాశి ధనుస్సు, పన్నెండో రాశి సింహం. కాబట్టి కుచ కుంభాలతో మీన నేత్రాలతో ధనుస్సు లాంటి కనుబొమలతో, ఆ కన్య సింహేంద్ర మధ్యమంగా వుందని తాత్పర్యం.

పాము నోటికి చిక్కిన కప్పను చూసి పీత నవ్విందని ఒక కవి గారెంత చమత్కారంగా చెప్తున్నాడో చూడండి:-

**కర చరణంబులు కలిగియు**
**కరచరణ విహీను చేత కడు దుర్బలుడై**
**జలచరుడు పట్టు బడెనని**
**శిరహీనుడు చూచి నవ్వె చిత్రము గాదే!!**

కర చరణాలున్న జలచరుడు కప్ప, అవి లేనివాడు పాము, శిరహీనుడు పీత. ఇటువంటి వింతలు మానవుల్లో కూడా జరుగుతాయి. కాకపోతే పరిస్థితుల్ని బట్టి జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి.

అపూర్వ కాకలి లా ఇలపావులూరి సుబ్బారావు గారి 'నవ్వుల పువ్వులు' ఖండ కావ్యం కూడా ఒక నవ్వుల గని. అందులో ఆయన రాసిన అద్భుతమైన పేరడీ పద్యాల్లో ఒక పద్యం మనవి చేస్తాను. పోతన భాగవతం లోని సుప్రసిద్ధ "మందార మకరంద



మాధుర్యమున దేలు మధుపంబు బోవునే మదనములకు" పద్యానికి సుబ్బారావుగారి పేరడీ పద్యం చూడండి:-

**సినిమాలె లోకమై జీవించు విద్యార్థి**
**పాఠాలు నేర్వగా బడికి జనునె?**
**క్రిక్కెట్టు నెల్లప్పు క్రేజుతో తిలకించు**
**బాలుండు చూచునే బడి ముఖంబు?**
**విద్యార్థినుల బట్టి వేధించు యువకుండు**
**చిత్తమ్ము నిల్పునే పాఠ్తములను?**
**గురువుల నవమాన పరచెడు శిష్యుండు**
**వినయంబు చూపునే పెద్దలందు?**
**బారు బీరుల కలవాటు పడినవాడు**
**పాలు తేనెలు గ్రోలునే కూలికైన?**
**వ్రేళ్ల నడుమన సిగరెట్టు పెట్టువాడు**
**కలము పట్టంగ నేర్చునే కలలనైన?!!**

మనకి పేరడీ సాహిత్యం చాలావుంది. పేరడీల్లో హాస్యమే కాదు వైవిధ్యం కూడా చాలా కనిపిస్తుంది.

కవులు పదాలతో ఆటలాడుకోవటాన్ని గూర్చి చాలా చెప్పవచ్చు. నిజానికి, మాటల జగ్లరీ రానివాడు కవిగా రాణించలేడు. 'మధుసేవ'లో కాళ్లకూరి నారాయణ రావుగారు ఒక త్రాగుబోతు దినచర్యని




వర్ణిస్తూ, ఆంగ్ల పదాలతో ఎలా ఆటాడుకున్నారో ఈ క్రింది పద్యం ద్వారా చెప్పి యీ వ్యాసం ముగిస్తాను:

**మార్నింగు కాగానె మంచము లీవింగు**
**మొగము వాషింగు చక్కగ సిటింగు**
**కార్కు రిమూవింగు గ్లాసులు ఫిల్లింగు**
**గబ గబ డ్రింకింగు గ్రంబులింగు**
**భార్యతో ఫైటింగు బైటకు మార్చింగు**
**క్లబ్బుకు రీచింగు గాంబులింగు**
**విత్తము లూజింగు చిత్తము రేవింగు**
**వెంటనే డ్రింకింగు వేవరింగు**
**మరల మరల రిపీటింగు మట్టరింగు**
**దారి పొడవున డాన్సింగు ధండరింగు**
**సారె సారెకు రోలింగు స్లంబరింగు**
**బసకు రీచింగు జేబులు ప్లండరింగు!!**

పద్యాల్లో మెరిసే వ్యావహారిక భాషా, భావ చమత్కారాలకి కవుల చమత్కార వ్యవహారమే కారణమవుతుంది. అలాగే, సందర్భాన్ని బట్టి మాటకి హాస్యపు వన్నె ఏర్పడుతుంది. అన్నీ సమపాళంలో కుదిరినప్పుడే హాస్యం రుచిగా ఉంటుంది. ఆ రుచిని ఏ రసజ్ఞుడు చూడకుండా ఉండగలడు.

# నవ్వులసందడి









"వ్యంగ్య చిత్ర బాణ మెపుడు
వ్యర్థం కాదంటా
నవ్వుతూనె చురకేయును
నసాళానికంటా"

ఒంట్లో బాగాలేదని ఆఫీసుకి శలవు పెట్టి ఇంట్లో శుభ్రంగా ప్లేట్ల కొద్దీ టిపిన్ కొట్టేస్తూ, కప్పుల కొద్దీ కాఫీ లాగిస్తూ, క్రికెట్ మ్యాచ్ చూస్తున్నపుడు, మీ ఆఫీసరుగారు మీ ఇంటి కొచ్చాడనుకోండి. అప్పుడు 'సీన్' ఎలా వుంటుంది? వూహించుకోండి. లేకపోతే ఈ సంకలనంలో 'సత్యమూర్తి' గారి కార్టూన్ చూడండి.



'భగవాన్' గారివి ఈ పుస్తకంలో ఎనిమిది కార్టూన్లు వున్నాయి. వాటిలో 'బొమ్మ పడితే అమ్మను నువు తీసుకెళ్లు. బొరుసు పడితే నేను' అన్న కార్టూన్ చెప్పకోదగింది. ఈ కార్టూన్ లో దండలు వేసిన ఫొటోలో కనిపంచే కీర్తిశేషుడి మొహంలో 'ఎక్స్‌ప్రెషన్' గమనించదగింది.



'అబ్సర్డిటీ' గూడా ఒక్కోసారి హాస్యాన్ని సృష్టిస్తుందని చెప్పడానికి 'కడుపులో గ్యాస్ ఎక్కువైనట్టుంది' లాంటి కార్టూన్లు ఉదాహరణ.




'సరసి' గారివి ఈ సంకలనంలో ఆరు కార్టూన్‌లు వున్నాయి. అన్నీ బాగున్నాయి. రైలు కంపార్ట్‌మెంట్‌లో బెర్తు వాస్తు ప్రకారం లేదని మార్చుకోవడం వాస్తు పిచ్చి మీద మంచి సైటర్.




రాగతి పండరి గారి రెండు కార్టూన్లలో, 'డాడీ మమ్మీ మూడ్ మార్చడానికి ప్రయత్నిస్తున్నార్లే' అన్న కార్టూన్ బెటర్.



-నిశాపతి



టీచర్ : నేటి బాలలే రేపటి పౌరులు..... ఇలాంటిదే నువ్వొకటి చెప్పు మమత!
మమత : నేటి బాలికలే రేపటి బాలింతలు!



"కడుపు నొప్పికి తట్టుకోలేకపోతున్నాను డాక్టర్"....
"ఇదిగో ఈ రెండు మాత్రలు వేసుకుని గ్లాసెడు నీళ్ళు తాగండి"
"భలేవారే డాక్టర్ మీరు.... ఈ రెండు టాబ్లెట్లు పట్టే ఖాళీయే వుంటే మరో లడ్డూ తినేవాణ్ణే కదా!"



భార్య : మీ ఆఫీస్‌లోని స్టెనోతో సినిమాకి వెళ్ళారట, నిజమేనా?
భర్త : నిజమే.... కాంతం, ఇప్పుడొస్తున్న సినిమాలు భార్యా పిల్లలతో కలిసి చూసేవా చెప్పు!?

దేవుడికి దణ్ణం పెట్టు బాబూ...!
తెలుగులోనా, ఇంగ్లీష్‌లోనా మమ్మీ?





"ఇవిగో నా పాత చీరలు కట్టుకో..."
"వద్దమ్మగారు! ఇవి కట్టుకుంటే మీరనుకొని అయ్యగారు నా దగ్గరకు రారండి".



"జీవహింస మహాపాపం, ఈ విషయం మీరందరూ గుర్తించాలి."
"మేమూ జీవులమేనని మీరెప్పుడు గుర్తిస్తారు సార్....?"

టీచర్ : నీ పేరేమిటి?
అమ్మాయి: రోజీ.
టీచర్ : అలాగేనా టీచర్‌తో మాట్లాడేది, 'మేడమ్' అనాలి. ఇప్పుడు చెప్పు.... నీ పేరేమిటి?
అమ్మాయి : మేడమ్ రోజీ!





మాస్టారు : ఒరేయ్! రామూ, మూడవ ఎక్కం చెప్పరా!
రాము : నిన్ననే కద్సార్ చెప్పాను, అప్పుడే మర్చిపోతే ఎలాసార్?



"ఒరేయ్! జీవితంలో ఎన్నటికీ పెళ్లి చేసుకోకురా! బాధలు పెళ్ళయిన నాటినుంచే పెరుగుతాయి"
"అలాగే నాన్నా! కానీ మీ అమూల్యమైన సలహా మన తరతరాలకూ చేర్చే బాధ్యత నాపైన ఉంది కదా! కనుక ముందుగా నా కొడుకుకు ఈ సలహానే మీ కానుకగా ఇవ్వనివ్వండి"

ఈ జోకులను పంపినవారు :
ఎల్.శ్రీనివాసరెడ్డి, లట్టుపల్లి,
కొంగరకలాన్.



పెళ్లికూతురు తండ్రి : సరే ఆఖరిమాట! ఇంకో అర్రూపాయలు కలుపుకొని లక్షా అరవై అర్రూపాయలకు ఒప్పుకుంటారా?

పెళ్లికొడుకు తల్లి : ఈ కూరగాయల వాళ్లతో సంబంధం వద్దని ముందే చెప్తే విన్నారు కాదు. పదండి.... పదండి!



టీచర్ : శిబి చక్రవర్తి, బలి చక్రవర్తి, కర్ణుడు చరిత్రలో వీరంతా ఎవరో తెలుసా?

రాణి : తెలుసు మేడమ్! వాళ్ళు మగవాళ్ళు.



“నువ్వు ప్రక్క ప్రయాణీకుడి జేబులో చేయి ఎందుకు పెట్టావు?” అడిగాడు జడ్జీగారు. “బాగా చలివేస్తుంటే తట్టుకోలేక పెట్టానయ్యా” చెప్పాడు గజదొంగ.

**ఈ జోకులను పంపినవారు : ఎల్.శ్రీనివాసరెడ్డి, లట్టుపల్లి, కొంగరకలాన్.**



ఓ ధనవంతుడు తాను కట్టించుకున్న విలాసవంతమైన బంగళాను తన స్నేహితులకి చూపిస్తున్నాడు. ఆ బంగళాలో మూడు స్విమ్మింగ్ పూల్స్ ఉన్నాయి. మొదటి పూల్‌ని చూపిస్తూ “ఈ స్విమ్మింగ్ పూల్‌లో వేడి నీళ్లుంటాయి. ఈ రెండవది చన్నీళ్ల పూల్.”

“మరి దీని సంగతి?” అంటూ అడిగారు స్నేహితులు నీరులేని మూడవ స్విమ్మింగ్ పూల్‌ని చూపిస్తూ.

ధనవంతుడు : ఇది ఈత రాని వారికోసం.



పిచ్చాస్పత్రి దగ్గర ఓ కారు ఆగిపోయింది. టైర్ పంక్చరైంది. డ్రైవర్ ఆ టైరుని తీస్తుంటే నట్లు, బోల్టులు జారి ప్రక్కనే వున్న సైడు కాలువలో పడిపోయాయి. ఇదంతా ఆస్పత్రి కిటికిలోంచి ఒక పేషంటు చూస్తున్నాడు. ఆ డ్రైవర్ నిరాశను గమనించి “చూస్తావేం..... మిగిలిన 3 చక్రాల్లోంచి ఒకొక్క నట్టు తీసి తగిలించు. పని అయిపోతుంది” అన్నాడు. అది విని ఆ డ్రైవర్ అలాగే చేశాడు. కారు రెడీ అయింది. కారులోపల కూర్చున్న యజమాని సంతోషించి “పిచ్చివాడివైనా మంచి సలహా ఇచ్చావే?” అన్నాడు.

పిచ్చివాడు : నేను పిచ్చివాణ్ణే కాని మీ ఇద్దరిలాగ తెలివి తక్కువ దద్దమ్మని కాదు... ఆఁ !” అన్నాడు.

వయోజన విద్యాలయ కేంద్రంలో రాసుకుంటున్న ఒక వృద్ధుడుతో

మిత్రుడు : ఏం వ్రాస్తున్నావు?

వృద్ధుడు : మా తమ్ముడికి ఉత్తరం

మిత్రుడు : నీకు వ్రాయడం వచ్చేసిందా?

వృద్ధుడు : నాకు వ్రాయడం రాకపోతే ఏం వాడికి చదవడం మాత్రం వచ్చి చచ్చిందా?





భార్యకోసం ప్రేమగా ఒక చీర తెచ్చి “ఇది హమ్ ఆప్‌కే హై కౌన్ లో మాధురీ దీక్షిత్ కట్టిన చీరే” అన్నాడో భర్త కాలరెగరేసుకుంటూ “ఛీ, ఛీ ఎవరో కట్టి విడిచిన చీర నేనెందుకు కడతాను” అందా ఇల్లాలు ముక్కు చీదుకుంటూ.

ఇద్దరన్నదమ్ములు ఆరుబైట పడుకుని దుప్పటి కప్పుకున్నారు. మధ్య రాత్రి ఓ దొంగవచ్చి దుప్పటి లాక్కుపోయాడు. ఇద్దరికీ మెలుకువ వచ్చింది మొదటివాడు 'దొంగ దొంగ' అని అరిచాడు. వెంటనే రెండవ వాడు మొదటి వాడి నోరునొక్కి “వాడు మళ్లీ దిండు కోసం వస్తాడు కదా! అప్పుడు పట్టుకుందాం. ఈలోగా అరవకు.... పారిపోతాడు.” అన్నాడు.



**ఈ జోకులను పంపినవారు: జి.బి.లక్ష్మి, హైదరాబాద్.**

# హేమంత 'గీతం'

## అన్ని ఋతువుల్లోనూ ఆస్వాదనీయం



'భగవంతుడు గనక పాడితే, హేమంత్ కుమార్ స్వరంలో పాడతాడు' అన్నారు ప్రఖ్యాత హిందీ, బెంగాలీ సంగీత దర్శకుడు సలీల్ చౌధురి.

హేమంత్‌కుమార్ ముఖర్జీ, హేమంత్‌దా, హేమంత్‌కుమార్ - (1920-1989) ఎలా పిలిచినా అతను బెంగాలీయులకు ఎంత ప్రియతముడో, హిందీ శ్రోతలకూ అంతే ఆప్తుడు. 1920 జూన్ 16న వారణాసిలో జన్మించిన హేమంత్‌కు బాల్యం నుంచే పాడే పిచ్చి వుండేది. ఎంత చిన్న పంక్షనైనా, పాడే అవకాశం వస్తే అతను వదులుకోలేదు. తన పాట విని ఎంతగానో ప్రశంసించిన వాళ్ళు, సంగీత సభల్లో తనను వేదిక పైకి ఆహ్వానిస్తారేమోనని ఎదురుచూసేవాడు కాని 'కె.ఎల్.సైగల్, పంకజ్ మల్లిక్ పాల్గొనే సభల్లో నన్ను పట్టించుకునే వాళ్ళెవ్వరు?' అని తన ఆత్మకథ 'అనందధార' లో అతనే సర్దిచెప్పు కున్నాడు.

కానీ హేమంత్‌కు గుర్తింపు రావడానికి ఎక్కువ కాలం పట్టలేదు. రేడియో పాటల ద్వారా, సలీల్‌చౌధురి తో కలిసి బెంగాలీలో వాడవాడలా మార్మో గించిన అద్భుత మైన గీతాల ద్వారా అతను హిందీ సినీ ప్రపంచాన్ని ఆకర్షించాడు. 1944లో 'ఇరాదా' సినిమా కోసం తన మొదటి హిందీ పాటను రికార్డు చేసాడు. 1952 నుంచి అటు గాయకుడిగా, ఇటు సంగీత దర్శకుడిగా హిందీ చలన చిత్ర రంగంలో తనదైన ముద్ర వేసాడు. అసంఖ్యాకంగా అభిమానులను సంపాదించు కున్నాడు.

బెంగాలీయులందరి లాగానే హేమంత్ కూడా రబీంద్ర సంగీత్‌తో సంగీత ప్రపంచంలోకి అడుగుపెట్టాడు. అయితే బెంగాలీ సినిమాల్లో వారి అగ్రనటుడు ఉత్తమ కుమార్‌కు ప్లేబాక్ గాయకుడిగా స్థిరపడ్డం అతని జీవితంలో గొప్ప మలుపు. భారత శ్రోతల అదృష్టవశాత్తు హేమంత్ బెంగాల్‌కు పరిమితమై పోలేదు. హిందీ చలన చిత్ర రంగంలోని దాదాపు ప్రతి ప్రముఖ సంగీత దర్శకుడు హేమంత్ స్వరంలోని విలక్షణతను గుర్తించారు. ఆయన స్వరంలో తమ బాణీలు ఎంత ఎత్తుకు ఎదుగుతాయో, ఎన్ని లోతులు తడుముతాయో గ్రహించారు. అందుకే హిందీ రంగం ఆయన్ని మనసారా ఆహ్వానించింది.

**హేమంత్ కంఠస్వరం గాంభీర్యానికి పెట్టింది పేరు. కానీ అదేం చిత్రమో 'చిలిపి దేవానంద్‌కూ, అమాయక బిశ్వజిత్‌కు, వ్యధాభరిత గురుదత్‌కు కూడా అద్భుతంగా అమరేది.**

ముఖ్యంగా దేవానంద్‌కు, ఎస్.డి.బర్మన్ సంగీత దర్శకత్వంలో హేమంత్ పాడిన పాటలు ఆణిముత్యాలు 'హై అప్‌నా దిల్‌తొ ఆవారా' (సోల్వాసాల్-1958), 'చుప్‌హై ధర్తీ - ఛుప్ హై చాంద్ సితారే', 'తేరీ దునియామే జీనేసే' (ఘర్‌నెంబర్ చవ్వాలీస్ - 1955), 'యాద్ ఆగయీ వో నషీలీ నిగాహే' (మంజిల్ -1960), సలీల్ చౌదరి కోసం 'గంగా ఆయే కహాసే' (కాబూలీ వాలా- 1961)

అలా..

అలా.. ఎన్.డి. సంగీతంలోనే 'ప్యాసా' (1957) లో అన్ని పాటల్లోనూ రఫీ జేజేలు కొట్టించుకుంటే, ఒకే ఒక 'జానే వో కైసే లోగ్ థే'తో హేమంత్ మన హృదయాలను ద్రవింపచేసాడు.

ఆనాటి ప్రముఖ సంగీత దర్శకులందరూ హేమంత్ కంఠస్వరంతో తమ బాణీలకు మెరుగులు దిద్దుకున్నవారే. సి.రామచంద్ర కోసం 'జిందగీ ప్యార్‌కీ దో చార్ ఘడీ హోతీహై' (అనార్కలీ - 1953), శంకర్ జై కిషన్ కోసం 'రులాకర్ చల్‌దియే' (బాద్‌షా - 1954), నౌషాద్ కోసం 'ఇన్‌సాఫ్ కీ డగర్‌పే' (గంగాజమునా - 1961), కళ్యాణ్ జీ ఆనంద్ జీ కోసం 'తుమ్హే యాద్ హోగా' (సత్తాబజార్ - 1959) కిశోర్ కుమార్ కోసం 'కహీ దూర్ చలాజాయే' (దూర్ గగన్‌కీ ఛావోమే - 1964) వంటి ఎన్నో హిట్ పాటలనందించాడు.

కానీ బహుశా హేమంత్ అందరికంటె అద్భుతంగా తన సంగీత దర్శకత్వంలోనే పాడాడేమో. స్వయంగా అసామాన్య ప్రతిభా వంతుడైన సంగీత దర్శకుడు కావడం వల్ల హేమంత్, ఇతరుల కంటె కూడా తన సామర్థ్యాన్ని తాను కొలవగలిగాడు. అందుకే స్వంత బాణీల్లో అల్లరి, చిలిపి పాటలు (ఇతర సంగీత దర్శకులు సాధారణంగా తనకు ఇవ్వనవి) కూడా పాడాడు. 'జరా నజ్‌రోంసే కెహదోజీ' (బీస్‌సాల్ బాద్ - 1962), 'రాహబనీఖుద్ మంజిల్' (కొహరా - 1964), లతా మంగేష్కర్‌తో కలిసి 'ఎక్‌బార్ జరా ఫిర్ కెహదో - ముఝే శర్‌మాకే తుమ్ దీవానా' (బిన్‌బాదల్ బర్సాత్ - 1963) ఇలాంటి పాటలే.

**కైఫీ ఆజ్మీ ఒకసారి అన్నారు 'హేమంత్ మంచి గాయకుడో, ఇంకా మంచి సంగీత దర్శకుడో, అంతకంటె మంచి మనిషో తేల్చుకోలేకుండా ఉన్నాను' అని.**

అలా ఈ మూడూ అతనిలో పోటీ పడుతూంటాయి. హిందీలో అతని సంగీత దర్శకత్వం 1952లో 'ఆనంద్‌మఠ్'తో ప్రారంభ మైంది. అందులో 'జయిజగదేశహరే', 'వందే మాతరం' విని కళ్ళు చెమర్చని వాళ్ళుండరు. నాటినుంచీ అతను సంగీత దర్శకుడిగా ఒక విశిష్ట స్థానాన్ని ఆక్రమించాడు. **హేమంత్‌కు ఏకైక ఫిలింఫేర్ అవార్డు తెచ్చిపెట్టిన 'నాగిన్'(1954)లో మొదటిసారి స్వరపరిచిన 'సర్ప'స్వరం చాలా ప్రసిద్ధి పొందింది. ఆ తర్వాత సంగీత దర్శకులందరికీ 'పాము' పాటంటే, ఇదే బాణీ మార్గదర్శకమైంది.**

హేమంత్ పాడిన పాటల్లో గాని, స్వరపరిచిన పాటల్లో గాని ఒక్క నాసిరకం పాటా లేదంటే అతిశయోక్తి కాదు. 'జాగృతి'(1954), 'కొహరా'(1964), 'బీస్‌సాల్‌బాద్'(1962), 'బిన్‌బాదల్ బర్సాత్' (1963) 'సాహబ్-బీబీ జీర్ గులామ్'(1985), 'శర్త్'(1954) 'అనుపమ' (1966), 'ఏక్ హీ రాస్తా'(1956), 'రాహగీర్' (1969), 'మిస్ మేరీ'(1957), 'దో దిల్'(1965),

'ఖామోషీ' (1985), 'బహూ'(1955), 'చంపాకలీ' (1957) ఈ సినిమాల్లో ఒక్కొక్క పాటా తలుచుకుంటే, అతనెంత వైవిధ్య భరితమైన సంగీతం అందించాడో, లతా, రఫీ, తలత్, గీతా, ఆశా, కిశోర్‌లకు కూడా ఎన్ని మంచి గీతాలను అందించాడో స్పష్టం.

తన స్వరకల్పనలో హేమంత్ పాడిన 'యా దిల్ కీ సునో దునియా వాలో' (అనుపమ-1966) 'యే నయిన్ డరే డరే' (కొహరా - 1964), 'జిందగీ కిత్‌నీ ఖూబ్‌సూరత్‌హై' (బిన్ బాదల్ బర్సాత్ - 1963) 'తుమ్...పుకార్‌లో' (ఖామోషీ - 1985), 'ఓ జిందగీకే దేనేవాలే' (నాగిన్ - 1954), 'జనమ్‌సే బంజారాహో బంధూ (రాహగీర్ - 1969) అతని టాప్ 15లో తప్పక వస్తాయి.

**అంతకంటే విశేషం - తాను పాడగలిగి వుండి కూడా ఇతర గాయకులకు తన సంగీత దర్శకత్వం లో గొప్ప పాటలు ఇవ్వడం.** 'మిస్‌మేరీ'(1957)లో అన్ని పాటలూ రఫీవే. 'దో దిల్'(1965) లో 'తేరా హుస్న్ రహే మేరా ఇశ్క్ రహే' రఫీ అత్యద్భుతంగా పాడిన పాటల్లో ఒకటి. అంతకంటె గొప్ప పాట జాగృతి(1954)లో రఫీ పాడిన 'హమ్ లాయే హై తూఫాన్ 'సే కిశ్తీ నికాల్‌కే' అలాగే ఖామోషీ (1985)లో కిశోర్ చేత 'వో శామ్ కుఛ్ అజీబ్ థీ' పాడించడం 'బహూ'(1955) సినిమాలో మంచి సోలో, యుగళ గీతాలు రెండూ తలత్ చేత పాడించడం. ఇలాంటి ఔదార్యం చాలా అరుదుగా చూస్తాం (ఆ కిందటి తరం వారిలో పంకజ్ మల్లిక్, తాను గొప్ప గాయకుడై వుండి కూడా సైగల్‌కు అజరామరమైన గీతాలివ్వడం గుర్తొస్తుంది)

యుగళ గీతాల్లో హేమంత్ స్టయిలే వేరు. లతా మార్దవానికీ, హేమంత్ గాంభీర్యానికి చక్కని జోడీ. ఎక్కువ యుగళగీతాలు లతాతోనే పాడినా, తన సంగీత దర్శకత్వంలో కూడా లతాకే ఎక్కువ పాటలిచ్చినా, గీతా, ఆశా, సుమన్ కళ్యాణ్‌పూర్ లతో కూడా అతను పాడాడు. 'దేఖో చాంద్ ఛుప్‌కే కర్‌తాహై క్యా ఇశారా' లతాతో - శర్త్ (1954) సినిమాలో, 'చాంద్‌నీ రాత్ ప్యార్ కీ బాతే' (లతా - జాల్), 'ఆన్ మిలో శామ్ సావ్‌రే' (గీతాదత్ - దేవదాస్), 'ఛుపాలో యూఁ దిల్ మే ప్యార్ మేరా' (లతా-మమత) 'లెహరోంసే లెహర్' (నూతన్‌తో - చిత్రం) హేమంత్ పాడిన టాప్ యుగళ గీతాల్లో కొన్ని మాత్రమే.

లతా పాడిన గొప్ప పాటల్లో కొన్ని హేమంత్ స్వరపరిచినవే. 'నాగిన్'లోని అన్ని పాటలూ (మన్‌డోలే... ఇత్యాది) 'అనుపమ'లో 'కుఛ్ దిల్‌నే కహా', 'చంపాకలి'లో (ఛుప్‌గయా కోయీ రే), ఖామోషీలో 'హమ్‌నే దేఖీ హై ఇన్ ఆంఖోంకీ', 'కహీ దీప్ జలే కహీ దిల్', 'ఝూమ్ ఝూమ్ ఢల్‌తీ రాత్' (కొహరా -1964) మొ॥ లతకు ఇన్ని మేలైన గీతా లిచ్చిన హేమంత్ 'సాహబ్ బీవి ఔర్ గులామ్' (1962) లో గీతాదత్, ఆశాల చేత అద్భుతంగా పాడించి, ఎలాంటి వస్తువుకూ, ఎలాంటి సన్నివేశానికీ, ఎలాంటి పాత్రకైనా తను అసాధారణంగా స్వర కల్పన చేయగలడని నిరూపించుకున్నాడు. ఇందులో గీతాదత్ పాడిన 'నజావోసయ్యా' 'పియాఐసో జియామే', ఆశా పాడిన 'భవ్‌రా బడా నాదాన్‌హై' - ఆ గాయనుల అగ్రశ్రేణి పాటల కిందకే వస్తాయి.

సంగీత దర్శకుడిగా హేమంత్ గొప్పదనం - వస్తువుకు, పాత్రలకూ తగినట్లుగా, సాహిత్యానికి సంపూర్ణ న్యాయం చేస్తూ స్వరరచన చేయడంలోనే ఉంది. అందుకే గాయకుడిగానైనా అతనికి కొన్ని పరిమితులున్నాయేమో గాని, సంగీత దర్శకుడిగా అతను తన గొప్ప వైవిధ్యాన్ని, అసామాన్య ప్రతిభనూ పదే పదే నిరూపించుకున్నాడు.

లతా మంగేష్కర్ హేమంత్ గురించి వ్యాఖ్యానిస్తూ, అతని స్వరం ఆలయంలో కూర్చుని భజనలు ఆలపిస్తున్న సాధువు స్వరంలా ఉంటుందని అన్నారు. పరిపక్వత చెందిన ఆ సాధుత్వమే, అతన్ని క్రమేపీ చలనచిత్ర రంగంలో తెర వెనక్కి వెళ్ళేలా చేసింది. చివరి రోజుల్లో అతని మనఃస్థితి 'యా దిల్‌కీ సునో దునియా వాలో' పాట భావాన్ని స్ఫురించేలా ఉండేదని మౌసుమీ ఛటర్జీ అన్నారు. అదే నిజమైతే, అది శ్రోతల దురదృష్టం. అతని 'రిచ్‌నెస్'ను ఉపయోగించుకోలేకపోయిన 80 దశకపు సంగీత దర్శకులు, నిర్మాతల దురదృష్టం.

- మృణాళిని



# హేమంత్‌కుమార్ హిట్స్

చిత్రం: గంగా జమునా    గానం: హేమంత్ కుమార్ & కోరస్
సంగీతం : నౌషాద్    రచన: షకీల్ బదయూని

అ: ఇన్‌సాఫ్ కీ డగర్ పే
బచ్చోఁ దిఖావో చల్‌కే
యే దేశ్ హై తుమ్హారా :
నేతా తుమ్హీహో కల్ కే    ॥కో-ఇన్‌సాఫ్॥
అ: దునియాకే రంజ్ సెహనా
ఔర్ కుఛ్ న ముఁహ్ సే కెహనా    ॥కో: దునియాకే॥
అ: సచ్చాయియోంకే బల్ పే
ఆగేకో బఢతే రెహనా    ॥కో: సచ్చాయియోంకే॥
అ: రఖ్‌దోగే ఏక్ దిన్ తుమ్
సంసార్ కో బదల్ కే    ॥కో: రఖ్‌దోగే॥
అ: అప్‌నే హో యా పరాయే
సబ్ కేలియే హో న్యాయ్    ॥కో: అప్‌నే హో ॥
అ: దేఖో కదమ్ తుమ్హారా
హర్‌గిజ్ న డగ్‌మగాయే    ॥కో: దేఖో కదమ్॥
అ: రస్తే బడే కఠిన్ హై
చల్‌నా సమ్ హల్ సమ్‌భల్ కే    ॥కో: రస్తే బడే ॥
అ: ఇన్‌సానియత్ కే సర్ పే
ఇజ్జత్ కా తాజ్ రఖ్‌నా    ॥కో: ఇన్‌సానియత్॥
అ: తన్‌మన్ కీ భేంట్ దేకర్
భారత్‌కీ లాజ్ రఖ్‌నా    ॥కో: తన్‌మన్ ॥
అ: జీవన్ నయా మిలేగా
అంతిమ్ చితామే జల్‌కే    ॥కో: జీవన్ నయా ॥

చిత్రం:- బీస్ సాల్ బాద్(1962)    రచన: షకీల్ బదయూనీ
గానం:- హేమంత్ కుమార్    సంగీతం:- హేమంత్‌కుమార్

బేకరార్ కర్‌కే హమేఁ యూ న జాయియే
ఆప్‌కో హమారీ కసమ్ లౌట్ ఆయియే ॥2॥
దేఖియే వో కలీ కలీ బదలియాఁ
జుల్ఫ్ కి ఘటా చురా న లే కహీఁ
చోరీ చోరీ ఆకే శోక్ బిజలియాఁ
ఆప్‌కీ అదా చురా న లే కహీఁ
యూఁ కదమ్ అకేలే న ఆగే బఢాయియే    ॥ఆప్‌కో॥
దేఖియే గులాబ్ కి వో డాలియాఁ
బఢ్‌కే చూమ్ లే న ఆప్‌కే కదమ్    ॥2॥
ఖోయే ఖోయే భవరే భీ హై బాగ్ మేఁ
కోయీ ఆప్‌కో బనా న లే సనమ్
బహకీ బహకీ నజరోఁ సే ఖుద్ కో బచాయియే    ॥ఆప్‌కో॥
జిందగీ కే రాస్తే అజీబ్ హై
ఇన్‌మేఁ ఇస్ తరహ్ చలా న కీజియే
ఖైర్ హై ఇసీ మేఁ ఆప్‌కీ హుజూర్
అపనా కోయీ సాథీ ఢూండ్ లీజియే
సున్‌కే దిల్ కీ బాత్ నా ముస్కురాయియే    ॥ఆప్‌కో ॥

చిత్రం: బీస్ సాల్ బాద్    రచన: షకీల్ బదయూనీ
సంగీతం : హేమంత్‌కుమార్    గానం: హేమంత్ కుమార్

జరా నజరోం సే కహ్ దో జీ నిశానా ఛూట్ న జాయే
జరా నజరోఁ సే కహ్ దో జీ
మజా జబ్ హై తుమ్హారీ హర్ అదా కాతిల్ హి కహలాయే ॥జరా॥
కాతిల్ తుమ్హే పుకారూఁ కే జాన్ -ఏ-వఫా కహూఁ
జమానా హై తుమ్హారా
జమానా హై తుమ్హారా చాహే జిస్‌కి జిందగీ లేలో
అగర్ మేరా కహా మానే తో ఐసే ఖేల్ న ఖేలో
తుమ్హారీ ఇస్ షరారత్ సే న జానే కిస్ కి మౌత్ ఆయే ॥జరా॥
హాయ్, కిత్‌నీ మాసూమ్ లగ్ రహి హో తుమ్
తుమ్‌కో జాలిమ్ కహే వో ఝూఠా హై
యే భోలాపన్ తుమ్హారా
(యే భోలాపన్ తుమ్హారా యే షరారత్ ఔర్ యే శోఖీ
జరూరత్ క్యా తుమ్హేఁ తల్వార్ కి తీరోఁ కి ఖంజార్ కీ) ॥2॥
సజర్ భర్ కే జిసే తుమ్ దేఖ్ లో వో ఖుద్ హీ మర్ జాయే॥జరా॥
హమ్ పే క్యూఁ ఇస్ కదర్ బిగ్‌డతీ హో
ఛేడ్‌నేవాలే తుమ్‌కో ఔర్ భీ హై
బహారోం పర్ కరో గుస్సా ఉల్‌ఝ్‌తీ హై జో ఆంఖోం సే
హవాఓం పర్ కరో గుస్సా జో టకరాతీ హై జుల్ఫోం సే
కహీ ఐసా న హో కోయీ తుమ్హారా దిల్ భీ లే జాయే ॥జరా॥

చిత్రం:- ఖామోషి    రచన: గుల్జార్
గానం:- హేమంత్‌కుమార్    సంగీతం:- హేమంత్‌కుమార్

తుమ్ పుకార్ లో తుమ్హారా ఇంతజార్ హై తుమ్ పుకార్ లో
ఖ్వాబ్ చున్ రహీ హై రాత్ బేకరార్ హై
తుమ్హారా ఇంతజార్ హై తుమ్ పుకార్ లో
హోంఠ్ పే లియే హుయే దిల్‌కీ బాత్ హమ్
జాగ్‌తే రహేంగే ఔర్ కిత్‌నీ రాత్ హమ్
ముక్తసర్‌సీ బాత్ హై తుమ్ సే ప్యార్ హై
తుమ్హారా ఇంతజార్ హై తుమ్ పుకార్ లో
దిల్ బహల్ తో జాయేగా ఇస్ ఖయాల్ సే
హాల్ మిల్‌గయా తుమ్హారా అప్‌నే హల్ సే
రాత్ యే కరార్‌కీ బేకరార్ హై
తుమ్హారా ఇంతజార్ హై తుమ్ పుకార్ లో

చిత్రం:- షర్త్    రచన: ఎస్.హెచ్.బిహారి    సంగీతం:- హేమంత్‌కుమార్    గానం:- హేమంత్ కుమార్

న యే చాంద్ హోగా - న తారే రహేంగే
మగర్ హమ్ హమేషా తుమ్హారే రహేంగే ॥నయే॥
బిఛడ్‌కర్ చలేజాయే తుమ్ సె కహీఁ
తొ ఏ నా సమఝ్‌నా మొహబ్బత్ నహీ
తుమ్హారే లియే హమ్, తుమ్హారే రహేంగే    ॥నయే॥
జమానా అగర్ కుఛ్ కహేభీతో క్యా
మగర్ తుమ్ న కెహనా హమే బేవఫా
జహాఁ భీ రహే హమ్ తుమ్హారే రహేంగె ॥నయే॥
యె హోగా సితమ్ హమ్‌నే పెహ్‌లే నజానా
బనాభీ నథా జల్ గయా ఆషియానా
కహో అబ్ మొహబత్ కే మారే రహేంగే
నయే చాంద్ హోగా - న తారే రహేంగే
మగర్ హమ్ హమేషా తుమ్హారే రహేంగే

# హేమంత్‌కుమార్ ఫిల్మోగ్రఫీ

| నెం. | చిత్రం పేరు | సం॥ | దర్శకుడు | నటీనటులు | హిట్,సూపర్‌హిట్/ఫ్లాప్ |
|---|---|---|---|---|---|
| 1 | ఆనంద్ మఠ్ | 1952 | హేమన్‌గుప్త | ప్రదీప్‌కుమార్, గీతాబాలి | హిట్ |
| 2 | డాకుకి లడ్కీ | 1954 | హరిష్ ప్రొడక్షన్స్ | షేక్ ముక్తార్, గీతాబాలి | బిలో ఏవరేజ్ |
| 3 | ఫెర్రి | 1954 | ఆర్.శర్మ | దేవానంద్ - గీతాబాలి | హిట్ |
| 4 | జాగృతి | 1954 | సత్యవ్‌బోస్ | అభి భట్టాచార్య - ప్రణోతి ఘోష్ | హిట్ |
| 5 | నాగిన్ | 1954 | నంద్‌లాల్ జస్వంత్‌లాల్ | ప్రదీప్‌కుమార్ - వైజయంతి మాల | సూపర్‌హిట్ |
| 6 | సామ్రాట్ | 1954 | నజామ్ నక్వి | అజిత్, రెహానా, సప్రు | ఫ్లాప్ |
| 7 | షర్త్ | 1954 | మిత్ర | దీపక్, శ్యామా, శశికళ | బిలో ఏవరేజ్ |
| 8 | బహు | 1955 | శక్తి శామంత | కరన్ దివాన్, ఉషాకిరన్, ప్రాణ్ | బిలో ఏవరేజ్ |
| 9 | బందిష్ | 1955 | సత్యన్‌బోస్ | అశోక్ కుమార్ - మీనాకుమారి | ఏవరేజ్ |
| 10 | భగవత్ మహిమ | 1955 | విఠల్‌దాసు పంచోటియ | ఎస్.ఎల్.పురి, సుందర్, మదన్‌పురి | ఫ్లాప్ |
| 11 | దునియా గోల్‌హై | 1955 | ఓం ప్రకాష్ | కరన్ దివాన్, అనితాగుహ | ఫ్లాప్ |
| 12 | లగన్ | 1955 | ఒ.పి.దత్త | సజ్జన్ - నళని జయవంత్, షమ్మి | ఫ్లాప్ |
| 13 | అంజాన్ | 1956 | యమ్.సాదిక్ | ప్రదీప్ కుమార్ - వైజయంతిమాల | బిలో ఏవరేజ్ |
| 14 | అరబ్ కా సౌదాగర్ | 1956 | యస్.డి.నారంగ్ | ప్రదీప్ కుమార్ - శశికళ | బిలో ఏవరేజ్ |
| 15 | బంధన్ | 1956 | హేమ్ చందర్ | ప్రదీప్ కుమార్ - మీనాకుమారి | బిలో ఏవరేజ్ |
| 16 | దుర్గేష్ నందిని | 1956 | బి.మిత్ర | ప్రదీప్ కుమార్ - బీనారాయ్ | ఏవరేజ్ |
| 17 | ఏక్ హి రాస్తా | 1956 | బి.ఆర్.చోప్డా | సునీల్‌దత్ - మీనాకుమారి | సూపర్ హిట్ |
| 18 | హమారావతన్ | 1956 | జయంత్ దేశాయ్ | బినారాయ్, ప్రేమ్‌నాద్ | ఫ్లాప్ |
| 19 | ఇన్‌స్పెక్టర్ | 1956 | శక్తి శామంత | అశోక్ కుమార్ - గీతాబాలి | ఏవరేజ్ |
| 20 | లాల్ తిన్ | 1956 | హరిష్ | మోతిలాల్ - గీతాబాలి | ఫ్లాప్ |
| 21 | తాజ్ | 1956 | నంద్‌లాల్ జస్వంత్‌లాల్ | ప్రదీప్ కుమార్ - వైజయంతి మాల | హిట్ |
| 22 | బందీ | 1957 | శత్యన్ బోస్ | అశోక్ కుమార్ - బీనారాయ్ | బిలో ఏవరేజ్ |
| 23 | చంపాకలి | 1957 | నంద్‌లాల్ జస్వంత్‌లాల్ | భరత్ భూషణ్ - సుచిత్రాసేన్ | బిలో ఏవరేజ్ |
| 24 | ఏక్‌ఝులక్ | 1957 | కాళిదాస్ | ప్రదీప్‌కుమార్ - వైజయంతిమాల, రాజేంద్ర కుమార్ | ఏవరేజ్ |
| 25 | ఫేషన్ | 1957 | లేఖ్‌రాజ్ భక్రి | ప్రదీప్‌కుమార్ - మాలాసిన్హా | బిలో ఏవరేజ్ |
| 26 | హిల్ స్టేషన్ | 1957 | శక్తి శామంత | బీనారాయ్ - ప్రదీప్‌కుమార్ | బిలో ఏవరేజ్ |
| 27 | కిత్నా బదల్ గయా ఇన్సాన్ | 1957 | ఐ.యస్.జోహార్ | అజిత్ - నళని జయంత్, ఐ.యస్.జోహార్ | ఫ్లాప్ |
| 28 | మిస్‌మేరీ | 1957 | ప్రసాద్ | కిషోర్ కుమార్ - మీనాకుమారి | హిట్ |
| 29 | పాయల్ | 1957 | జోసఫ్ తలత్ | సునీల్‌దత్ - పద్మిని. రాగిణి | బిలో ఏవరేజ్ |
| 30 | యహు ది కి లడ్కి | 1957 | ఎస్.డి.నారంగ్ | మధుబాల, ప్రదీప్‌కుమార్ | ఫ్లాప్ |
| 31 | పోలీస్ | 1958 | కాళిదాస్ | ప్రదీప్‌కుమార్ - మధుబాల | బిలో ఏవరేజ్ |
| 32 | సహారా | 1958 | లేఖ్ రాజ్ భక్రి | యమ్.రంజన్ - మీనాకుమారి | బిలో ఏవరేజ్ |
| 33 | చాంద్ | 1959 | లేఖ్ రాజ్ భక్రి | మనోజ్ కుమార్- మీనా కుమారి, బల్ రాజ్ సహాని | బిలో ఏవరేజ్ |
| 34 | హంభి ఇన్సాన్ హై | 1959 | ఆర్.మజుందార్ | అభి భట్టాచార్య, అనిల్‌కుమార్, లతాసిన్హా | బిలో ఏవరేజ్ |
| 35 | దునియా జుక్తీహై | 1960 | హెూమీ వాడియా | సునీల్‌దత్ - శ్యామా, కుంకుం | బిలో ఏవరేజ్ |
| 36 | గర్ల్‌ఫ్రెండ్ | 1960 | సత్యన్ బోస్ | కిషోర్ కుమార్ - వహీదారెహమన్ | బిలో ఏవరేజ్ |
| 37 | బీస్ సాల్ బాద్ | 1962 | బిరేన్ నాగ్ | బిశ్వజీత్ - వహీదా, మన్ మోహన్ క్రిష్ణ | సూపర్ హిట్ |
| 38 | మాబేటా | 1962 | లేఖ్ రాజ్ భక్రి | మన్‌జ్ కుమార్ - అమిత | బిలో ఏవరేజ్ |
| 39 | షహ్ బీబీ ఔర్‌గులామ్ | 1962 | అబ్రార్ అళ్వి | గురుదత్, మీనాకుమారి- వహీదా | సూపర్ హిట్ |
| 40 | బిన్ బాదల్ బర్సాత్ | 1963 | జ్యోతి స్వరూప్ | బిశ్వజీత్ - ఆశాపరేఖ్, నిమ్మి | ఏవరేజ్ |
| 41 | కొహ్రా | 1964 | బిరేన్ నాగ్ | బిశ్వజీత్ - వహీదా రెహ్‌మాన్ | సూపర్‌హిట్ |
| 42 | దోదిల్ | 1965 | హృషికేష్‌ముఖర్జీ | బిశ్వజీత్ - రాజశ్రీ | ఏవరేజ్ |
| 43 | ఫరార్ | 1965 | పినాకి ముఖర్జీ | అనిల్ చటర్జీ, షబనమ్ | బిలో ఏవరేజ్ |
| 44 | అనుపమ | 1966 | హృషికేష్‌ముఖర్జీ | ధర్మేంద్ర - షర్మిలా | హిట్ |
| 45 | బీవీ ఔర్ మకాన్ | 1966 | హృషికేష్‌ముఖర్జీ | బిశ్వజీత్ - కల్పనా, మెహమూద్ | ఏవరేజ్ |
| 46 | సన్నాట | 1966 | యమ్.సబ్బెన్‌వత్ | తనూజ - అనిల్ ఛటర్జీ | బిలో ఏవరేజ్ |
| 47 | మజిలిదీదీ | 1967 | హృషికేష్‌ముఖర్జీ | ధర్మేంద్ర - మీనాకుమారి | హిట్ |
| 48 | దోదిన్ దార్ | 1968 | బిమల్‌రాయ్ | కిషోర్(డిరోల్) ,తనూజ | హిట్ |
| 49 | ఖామోషి | 1969 | అసిత్‌శేన్ | రాజేష్‌ఖన్నా - వహీదా | సూపర్ హిట్ |
| 50 | రహ్‌గిర్ | 1969 | తరున్ మజుందార్ | బిశ్వజీత్ - సంధ్యారాయ్ | బిలో ఏవరేజ్ |
| 51 | బీస్ సాల్ పెహలె | 1972 | ప్రోబీర్ కుమార్ | రితిష్ కుమార్, అనుపమ, పరీదా జలాల్ | ఫ్లాప్ |
| 52 | దోలడ్కే దోనో కడ్కే | 1979 | బాసు ఛటర్జీ | అమోల్ పలేకర్ - మౌసమి ఛటర్జీ | ఫ్లాప్ |
| 53 | లవ్‌ఇన్ కెనడా | 1979 | ఎస్.రామనాధన్ | జితేంద్ర, వినోద్ మెహ్రా, మౌసమి ఛటర్జీ | బిలో ఏవరేజ్ |

సంకలనం: పి.వి.రమణ, చింతలపూడి



# బాపు విశ్వరూపం 20

**ఈ సారి బాపుగారు ఉపాధ్యాయుడిగా దర్శనమిస్తున్నారు. బొమ్మలు ఎలా గీయాలో ఓ బాలల పత్రికకై రాసిన సోదాహరణ సచిత్ర వ్యాసమిది. పిల్లల స్థాయికి దిగి వచ్చి రాసిన వ్యాసం కాబట్టి వ్యాఖ్యానాలక్కరలేదు.**

బొమ్మల గురించి నాలుగు ముక్కలు రాయమన్నారు. బొమ్మలు ఎలా వెయ్యాలో చెప్పగలిగిన స్తోమత లేదు - గానీ ఎలా వేసేవాణ్ణో చెప్తాను. కాస్తో కూస్తో సూచనలు ఇవ్వగలిగితే - అది కేవలం భగవంతుడి దయ - భగవత్సమానులైన గురువుల వాత్సల్యం - కటాక్షమూనూ.

ముఖ్యాతిముఖ్యమైనది - కనిపించినదల్లా గీసెయ్యాలి. మా గురువులు శ్రీ గోపులు - వేస్తూనే వుండు. ఆపద్దు - దానంతట అదే వచ్చేస్తుంది - అనేవారు. ఇంకో గురువు గారు - శ్రీ వాసు (నాకు వందలు వేలాది గురువులున్నారు) - రోజూ కనిపించినదల్లా గీసేస్తూ వుండు. పొద్దున్నే దినపత్రిక చూస్తావు కదా - దాంట్లో ఫోటోలుంటాయి కదా - అవి చూసి గీసెయ్డం మొదలెట్టు. లైట్ అండ్ షేడ్ ఎలా వుంటుందో తెలుస్తుంది అనేవారు. ఆ ఫోటో లెవరిదైనా ఫరవాలేదు. వార్తా పత్రికల్లో సాధారణంగా రాజకీయాల వాళ్ల ఫోటోలుంటాయి. (వీళ్లు మన కార్టూనిస్టుల కన్నా గొప్ప ఆస్సెగాళ్లు) అయినా సరే గీసెయ్యాలి - అలాగే మీకు నచ్చిన బొమ్మ - ఏ ఆర్టిస్టు గీసినదయినా సరే - చూసి గీసెయ్యాలి - మా గురువులు చెప్పినట్టు అలాగే నచ్చినవన్నీ గీసేస్తూ వుంటా -

పుస్తకాల్లో ముందూ చివరా ఎండ్ పేపర్స్ వుంటాయి కదా - వాటి మీద గీసేసేవాణ్ణి. తదుపరి - చిత్తు కాగితాలు బుక్కుగా కుట్టుకుని కూడా వుంచుకునేవాణ్ణి. బీచికెళ్లినపుడూ, ప్రయాణాల్లోనూ, సెలవుల్లో మా నాన్నగారు మా పల్లెటూరికి తీసెకెళ్లినప్పుడూ - కనిపించినదల్లా - కూచుని కబుర్లు చెప్పుకునే వాళ్లనీ - బస్సులోని వాళ్లనీ - బయట వాళ్లనీ - రైలు బెర్తుల మీద పడుకున్న వాళ్లనీ - కాలక్షేపం బఠాణీలమ్మే వాడినీ - ఏడుస్తున్న పిల్లల్నీ - మా వూళ్లో వీధుల్నీ - పెంకుటిళ్లూ - చెరువు గట్టూ - నీళ్లు తెచ్చుకునే ఇల్లాళ్లూ - ఏది చూస్తే అది గీసేసే వాణ్ణి - ఆ ఇల్లాళ్ల కాళ్ల పారాణీ - పట్టాలూ కడియాలూ - లోలాకులూ - పెద్ద బొట్టూ జడ గంటలూ లక్ష్మీదేవి బొమ్మకి అలంకరించేసే వాడిని. మీరు కూడా - 'ఇహ కోర్సు అయిపోయింది హమ్మయ్య' అనుకోకుండా గీస్తోనే వుండాలి.

ఒక స్కెచ్ బుక్ అయిపోగానే ఏం చెయ్యాలంటే మరో పుస్తకం కుట్టుకుని మరలా మొదలెట్టాలి. ఈ రెండూ అయిపోయినపుడు మాత్రం మూడో పుస్తకం రెడీ చేసుకుని బొమ్మలు గీయాలి. సైకిల్ తొక్కుతున్న వాళ్లూ - ఆవులూ - బజార్లో మనుషులూ - కొట్లూ - మీ మేష్టారు కోప్పడ్డప్పుడు ఆయన మొహం - లాల్చీ - పంచకట్టూ - మీ అమ్మ పేరంటానికి వచ్చిన ముత్తయిదువలూ - మీ నాన్నారితో పేకాడ్డానికొచ్చే వాళ్లూ - చక్కటి మీ అక్కయ్య, ఇంచక్కటి స్నేహితురాళ్లూ (ఇక్కడ కొంచెం వళ్లు దగ్గర పెట్టుకుని వుండాలి) - ఇలా గీస్తూనే వుండాలి. మీ మాట వినే తమ్ముడూ - చెల్లాయి - అమ్మమ్మ లాంటి వాళ్లని కదలకుండా కూచోమని గీయాలి. వాళ్లు వీల్లేదంటే పెరట్లో మొక్కలూ - చెట్లూ - ఆకులూ - కాకులూ; వానొస్తే లోపలకొచ్చి గదిలో బల్ల, కుర్చీ - అలమారులో పుస్తకాలు - వంకీనున్న చొక్కాలూ, గోడమీది ఫోటోలూ - ఆఖరికి ఏమీ లేకపోతే మీరు బొమ్మలేస్తూ కాయితం పట్టుకున్న ఎడం చెయ్యి వేళ్లూ గీసెయ్యాలి - ట్రేసింగ్ చెయ్యద్దు - కంటితో చూసి వేసెయ్యడమే!

ఇంకో గురువుగారు శ్రీ ఎస్.ఎన్.చామకూర్ - పెన్సిలు ముక్కు సూది మొనలా కాకుండా ఫ్లాట్‌గా వడ్రంగి దగ్గరుండే ఉలి లాగా చెక్కుకుని దానితో అటూ ఇటూ తిప్పకుండా వరసగా వంపు గీతలు గీయమనేవారు.



కంటిక్కనిపించినది గీయడం లైఫ్ స్కెచింగ్ అంటారు. మొదట్లో బొమ్మలు సరిగ్గా కుదరక నిరుత్సాహం కలగచ్చు. కానీ మానకూడదు. ఇంకో గురువుగారు శ్రీ నామిని సుబ్రహ్మణ్యం నాయుడు ఏమి రాశారంటే - 'నువ్వు పడుకోవాలనుకుంటే అమాంతం వెల్లకిలా పడవు కదా! నించున్న వాడివి - ముందు కూచుని తరువాత కదా నడుం వాల్చ గలవు!' అంచేత వేస్తూనే వుండాలి. అడ్డదారి లేదు.



పేపర్లలోనూ పత్రికల్లోనూ వచ్చే కొన్ని కొన్ని ఫోటోలూ బొమ్మలూ కత్తిరించుకుని ఒక ఆల్బం లాటిది తయారు చేసుకోవాలి - రెఫరెన్సు కోపమన్నమాట - జిరాఫీ - సింహం - చార్‌మినారు బొమ్మ - అమెరికా లిబర్టీ విగ్రహం. ఇలాటివి వెంటనే రిఫర్ చేసుకోడానికి వీలుగా ఏబీసీడి - లేదా అ ఆ క ఖాల వారీగా అంటించుకోవాలి. అలాగే మీకు నచ్చిన ఆర్టిస్టుల బొమ్మలు - 'బాల'పత్రిక టైంలో పూజ్యులు కీ॥శే॥ న్యాపతి రాఘవరావుగారిని అడిగి కీ॥శే॥ శ్రీ వడ్డాది పాపయ్య గారు వేసిన ముఖ చిత్రాల ఒరిజినల్స్ తెచ్చుకుని ఆల్బంలో వుంచుకునేవాడిని. ఇపుడు ఏ బొమ్మ వేసినా పూజ్యులు శ్రీ పిలకా నరసింహమూర్తి గారి బొమ్మ ఒకటి తీసి కళ్లకద్దుకుని గానీ బొమ్మ మొదలెట్టను. బుర్రలో కూడా ఒక ఆల్బం

వుండాలి. ఎందరో మహానుభావులు వేసిన బొమ్మలు బుర్రలో అంటించుకుని వుండాలి.

ఓ సన్నివేశానికి బొమ్మ వెయ్యాలనుకోండి. ఆ బొమ్మ స్వరూపాన్ని ముందు బుర్రలో ఊహించుకోవాలి - కుర్చీలో అబ్బాయి - చదువుకుంటూ అమ్మాయి. అబ్బాయి సొంతిల్లే కనుక ఎలా కూచుంటాడు? నిటాగ్గా ఫోటోకి కూచున్నట్టు కాదు కద! పుస్తకం చదువుకుంటున్న అమ్మడు చాప మీద పడుకోవచ్చు. మీ అక్కయ్యని పోజిమ్మనండి - వీల్లేదు సినిమా కెడుతున్నా నందనుకోండి - మీ ఫ్రెండుని ఆ పోజులో పడుకోమని పోజు గీసుకుని దానికి పరికిణీ, జడా, ఓణీ, అందెలూ, గాజులూ తొడిగెయ్యండి. తరవాత మీ స్కెచ్‌బుక్‌లో మీరెప్పుడో వేసుకున్న గది గానీ - రెఫరెన్స్ ఆల్బంలో ఇంటీరియర్స్ ఆర్టికిల్‌లో చూసిన గది ఫోటోగానీ చూసి -



బల్ల - దాని మీద టీవీ - అలమార లోన చిన్న అద్దం - బరిణెలు - బుద్ధుడి బొమ్మ - పుస్తకాలూ - గోడమీద దండ వేసిన తాతగారి ఫోటో - నాన్నారి కాలేజి గ్రూపు ఫోటో- అక్కా బావల పెళ్లి ఫోటో - వేసెయ్యండి.

కనిపించిన పుస్తకాలు - దేశవాళీ - విదేశీ పత్రికలన్నీ తిరగేస్తూ వుండాలి - వారానికోసారైనా పుస్తకాల షాపుకెళ్లాలి. ఇంకో గురువు గారు శ్రీ బుజ్జాయి - తను షాపులో తిరిగినపు డెదేనా మంచి పుస్తకం కనిపిస్తే నాకు చెప్పనేనా చెప్పేవాడు లేదా కొనేసి తెచ్చిచ్చేవాడు. మీ వూళ్లో లైబ్రరీలుంటే - అమెరికన్ - బ్రిటిష్ కాన్సులేట్ వారి లైబ్రరీ వుంటే మహబాగు - వారానికోసారి వెళ్లాలి.

ఇలా అనేక మహానుభావుల బొమ్మలతో బాటు నిజజీవితంలోని మనుషుల్నీ పరిసరాల్నీ బుర్రలో నోట్ చేసి పెట్టుకోవాలి. మన బుర్ర పుష్పక విమానం లాంటిది - ఎన్నో నోట్ చేసుకున్నా ఇంకా చోటు మిగులుతూనే వుంటుంది.



గురువుగారు శ్రీగోపులు - వీధి కనిపించే కిటికీ పక్క కూచుని బొమ్మలు గీసేవారు. ఇటు మన తోటి సరదాగా నవ్విస్తూ మాట్లాడుతున్నా దృష్టంతా వీధుల్లో నడిచిపోయే మనుషుల ముఖాలూ వేషాలూ గమనిస్తూనే వుండేది. అందువల్లనే ఆయన బొమ్మలు కాగితం మించి బయటకొచ్చి మన్ని పలకరిస్తాయి.

ముందు గీతలు ఎక్కువ గీస్తున్నా రానురాను ఎన్ని తక్కువ గీతల్లో వేయగలమో - ఆ పద్ధతి అలవాటు చేసుకోవాలి - అనేకమంది ఆర్టిస్టులు అనేక పద్ధతులు చూసి వేస్తూంటే అవన్నీ కలిపి మీదంటూ మీకో ప్రత్యేక శైలి ఏర్పడుతుంది.

బొమ్మ వేశారంటే సాదాగా వుండకూడదు. అంటే నించున్న మనిషిని వేశారంటే ఇలా వుండకూడదు. ఎదో తమాషా ఏంగిల్ వుండాలి - దీన్నే "డైనమిజం' అంటారు.

ఇంకో గురువుగారు శ్రీ గోపి - ఆయన బొమ్మలెప్పుడూ చైతన్యంతో తొణికిసలాడుతూ వుంటాయి. ఆయన ఇమాజినేషన్ కూడా అంత డైనమిక్‌గా వుంటుంది. గిజిగాడు అనే పక్షి వుంది. దాని గూడు మిగతా వాటిలా వుండదు. అదొక ఇంజనీరింగ్ ఫీట్. వగడ్బందీగా - కొమ్మకు వేలాడుతూ - అంతస్తులూ - కిందా పైగా గదులు కలిగి వుండేట్లు అల్లుతుంది - ఇంజనీర్ల కన్వెన్షన్ సావనీరు పుస్తకం ముఖచిత్రానికి శ్రీ గోపి - గిజిగాడి గూడు బొమ్మవేసి వూరుకున్నారు. భగవంతుని సృష్టికి ఇంజనీర్లు ప్రతిసృష్టి చేస్తారు అన్నది - అదీ ఇమాజినేషన్ అంటే.

అందువలన ప్రతీదీ గమనిస్తూ వుండండీ - అన్నీ చదవండి - అడిగి తెలుసుకోండి - బొమ్మలు గీయడం ఆపరాదు. స్కెచ్ బుక్‌లో గీయడానికి అంతం అంటూ లేదు- గీస్తూనే వుండాలి. ఏదోరోజు తలుపు చప్పుడవుతుంది. తలుపు తీసి 'ఎవరూ' అని అడగండి. 'బొమ్మని' అంటుంది. తనంతట తానే వచ్చిందన్నమాట. ఇపుడేం చెయ్యాలంటే - మీరు ఓ పుస్తకం తయారు చేసుకుని లైఫ్ స్కెచింగ్ చెయ్యాలి. ■




| నెం. | పాట | చిత్రం పేరు | సం॥ | సంగీత దర్శకుడు | రచన | గానం |
|---|---|---|---|---|---|---|
| 1217 | గెలుపుల రాణిని కాదురా | రామరాజ్యం | 1973 | ఘంటసాల | కొసరాజు | ఎల్.ఆర్.ఈశ్వరి |
| 1218 | కన్నె బేబి ఓ గులాబీ | రామరాజ్యం | 1973 | ఘంటసాల | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు, వసంత |
| 1219 | నరికెద ముక్కలు ముక్కలుగా (వెర్స్) | రామరాజ్యం | 1973 | ఘంటసాల | వి. భద్రం | మాధవపెద్ది |
| 1220 | రావయ్యా నల్లనయ్య | రామరాజ్యం | 1973 | ఘంటసాల | దాశరథి | సుశీల |
| 1221 | ఏమండి లేత బుగ్గల లాయర్‌గారు | రామరాజ్యం | 1973 | ఘంటసాల | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు, సుశీల |
| 1222 | ఇదే రామరాజ్యము | రామరాజ్యం | 1973 | ఘంటసాల | ఆత్రేయ | ఘంటసాల, గ్రూప్ |
| 1223 | మామిడి కొమ్మ మళ్ళీ మళ్ళీ | రాము | 1968 | ఆర్.గోవర్ధన్ | దాశరథి | సుశీల |
| 1224 | మంటలు రేపే నెల రాజా | రాము | 1968 | ఆర్.గోవర్ధన్ | దాశరథి | ఘంటసాల |
| 1225 | పచ్చని చెట్టు ఒకటి | రాము | 1968 | ఆర్.గోవర్ధన్ | ఆరుద్ర | ఘంటసాల, సుశీల |
| 1226 | రారా కృష్ణయ్యా | రాము | 1968 | ఆర్.గోవర్ధన్ | దాశరథి | ఘంటసాల |
| 1227 | తర లీలావతార వెడలే | రాము | 1968 | ఆర్.గోవర్ధన్ | కొసరాజు | ఎల్.ఆర్.ఈశ్వరి, మాధవపెద్ది, పిఠాపురం, తిలకం |
| 1228 | అనురాగాలే పాడెను కనులు | రాణి చెన్నమ్మ | 1961 | టి.జి.లింగప్ప | రాంచంద్ | పి.బి.శ్రీనివాస్, ఎస్.జానకి |
| 1229 | చెన్న మల్లికార్జున అవని నేడు | రాణి చెన్నమ్మ | 1961 | టి.జి.లింగప్ప | రాంచంద్ | ఎస్.జానకి |
| 1230 | దేవుడు దేవుడన ఎవరు | రాణి చెన్నమ్మ | 1961 | టి.జి.లింగప్ప | రాంచంద్ | పి.బి.శ్రీనివాస్, జె.వి.రాఘవులు, రుద్రప్ప |
| 1231 | కలుష హృదయములిచ్చు | రాణి చెన్నమ్మ | 1961 | టి.జి.లింగప్ప | రాంచంద్ | సుశీల |
| 1232 | కనుల చెలి సోలినది | రాణి చెన్నమ్మ | 1961 | టి.జి.లింగప్ప | రాంచంద్ | సుశీల |
| 1233 | కిత్తురు చిన్నమ్మ ముద్దుల పుత్రుడు | రాణి చెన్నమ్మ | 1961 | టి.జి.లింగప్ప | రాంచంద్ | ఎస్.జానకి, జె.వి.రాఘవులు |
| 1234 | క్షేమ సాగరా లోక పాలన | రాణి చెన్నమ్మ | 1961 | టి.జి.లింగప్ప | రాంచంద్ | పి.బి.శ్రీనివాస్ |
| 1235 | మహారాజ యోగమిటు పరితపమా | రాణి చెన్నమ్మ | 1961 | టి.జి.లింగప్ప | రాంచంద్ | పి.బి.శ్రీనివాస్ |
| 1236 | మాతృదేవతను కానగ తలచి | రాణి చెన్నమ్మ | 1961 | టి.జి.లింగప్ప | రాంచంద్ | పి.బి.శ్రీనివాస్ |
| 1237 | మేడికి పువ్వు లేదే కదలికి కోనలేదే | రాణి చెన్నమ్మ | 1961 | టి.జి.లింగప్ప | రాంచంద్ | ఎస్.జానకి, ఎ.పి.కోమల |
| 1238 | పువ్వులా నడిచే నవ్వుల రాణి | రాణి చెన్నమ్మ | 1961 | టి.జి.లింగప్ప | రాంచంద్ | ఎస్.జానకి అండ్ పార్టీ |
| 1239 | ఇది చిన్నారి కన్నయ్య మనసైన మాట | రాణి చెన్నమ్మ | 1961 | టి.జి.లింగప్ప | రాంచంద్ | ఎస్.జానకి |
| 1240 | చందురునిదే అందమని | రైతే రాజు | 1971 | టి.వి.రాజు | సి.నారాయణరెడ్డి | సుశీల |
| 1241 | చూశావా చిలకా | రైతే రాజు | 1971 | టి.వి.రాజు | సి.నారాయణరెడ్డి | ఘంటసాల, సుశీల |
| 1243 | గెలిచిందెవరో ఓడిందెవరో | రైతే రాజు | 1971 | టి.వి.రాజు | దాశరథి | ఘంటసాల |
| 1244 | ఓ అందాల రాజా రసికులలో నీ సరి | రైతే రాజు | 1971 | టి.వి.రాజు | జి.కృష్ణమూర్తి | సుశీల |
| 1245 | పైపై మెరుగుల కోసం | రైతే రాజు | 1971 | టి.వి.రాజు | సి.నారాయణరెడ్డి | ఎల్.ఆర్.ఈశ్వరి |
| 1246 | చింత చెట్టు చిగురులంటి | రైతే రాజు | 1971 | టి.వి.రాజు | దాశరథి | ఎల్.ఆర్.ఈశ్వరి |
| 1247 | తోటలో పువ్వుల బాటలో | రైతే రాజు | 1971 | టి.వి.రాజు | సి.నారాయణరెడ్డి | సుశీల, కోరస్ |
| 1248 | హలో డార్లింగ్ మాటాడవా | శభాష్ రాముడు | 1959 | ఘంటసాల | సదాశివబ్రహ్మం | పిఠాపురం, జమునారాణి |
| 1249 | జయమ్ము నిశ్చయమ్మురా | శభాష్ రాముడు | 1959 | ఘంటసాల | కొసరాజు | ఘంటసాల |
| 1250 | కల కల విరిసి జగాలే పులకించెనే | శభాష్ రాముడు | 1959 | ఘంటసాల | శ్రీశ్రీ | ఘంటసాల, సుశీల |
| 1251 | అమ్మ కడుపు చల్లగా | సాక్షి | 1967 | కె.వి.మహదేవన్ | ఆరుద్ర | సుశీల |
| 1252 | అటు ఎన్నెల ఇటు ఎన్నెల | సాక్షి | 1967 | కె.వి.మహదేవన్ | ఆరుద్ర | సుశీల |
| 1253 | దయలేదా నీకు దయరాదా | సాక్షి | 1967 | కె.వి.మహదేవన్ | ఆరుద్ర | పి.బి.శ్రీనివాస్, బృందం |
| 1254 | పదిమంది కోసం నిలబడ్డ నీకు | సాక్షి | 1967 | కె.వి.మహదేవన్ | ఆరుద్ర | కె.బి.కె.మోహనరాజు |
| 1255 | సిలిపోడా సిన్నోడా | సాక్షి | 1967 | కె.వి.మహదేవన్ | దాశరథి | ఘంటసాల, సుశీల |
| 1256 | అమ్మా శకుంతల ఎందుకు శోకం | శకుంతల | 1966 | ఘంటసాల | శ్రీశ్రీ | పి.లీల |
| 1257 | అమ్మా శరణమ్మా | శకుంతల | 1966 | ఘంటసాల | సముద్రాల | సుశీల |
| 1258 | గురుకులముల వినయంతో కొలువుమా | శకుంతల | 1966 | ఘంటసాల | సముద్రాల | ఘంటసాల, బృందం |
| 1259 | కనరా ముని శేఖరా | శకుంతల | 1966 | ఘంటసాల | సముద్రాల | సుశీల |
| 1260 | మధుర మధుర సుమసీమ | శకుంతల | 1966 | ఘంటసాల | ఆరుద్ర | సుశీల, బృందం |
| 1261 | మదిలో మౌనముగా కదిలే | శకుంతల | 1966 | ఘంటసాల | సి.నారాయణరెడ్డి | ఘంటసాల |
| 1262 | నీవూ నేనూ కలిసిన నాడే | శకుంతల | 1966 | ఘంటసాల | సి.నారాయణరెడ్డి | ఘంటసాల, సుశీల |
| 1263 | పాత కాలం నాటి బ్రహ్మదేవుడా | శకుంతల | 1966 | ఘంటసాల | కొసరాజు | ఎం.సత్యం, పిఠాపురం, జె.వి.రాఘవులు |
| 1264 | సరసన నీవుంటే జాబిలి నాకేలా | శకుంతల | 1966 | ఘంటసాల | సి.నారాయణరెడ్డి | ఘంటసాల, సుశీల |
| 1265 | సెంగాయి కట్టిన సిన్నది | శకుంతల | 1966 | ఘంటసాల | కొసరాజు | ఘంటసాల |
| 1266 | నీ కంటి పాపనై | శకుంతల | 1966 | ఘంటసాల | దాశరథి | సుశీల |
| 1267 | నిర్దయ నీ మనంబేమో నేనెరుగను (వెర్స్) | శకుంతల | 1966 | ఘంటసాల | సముద్రాల | సుశీల |
| 1268 | అనాఘ్రాతం పుష్పం | శకుంతల | 1966 | ఘంటసాల | కాళిదాసు | ఘంటసాల |
| 1269 | చెలియ నీ మేను తపియింప | శకుంతల | 1966 | ఘంటసాల | సముద్రాల | ఘంటసాల |
| 1270 | చల్లనివై శ్రమింబుడు (వెర్స్) | శకుంతల | 1966 | ఘంటసాల | కందుకూరి వీరేశలింగం | ఘంటసాల |
| 1271 | తరతమ భేదంబు తలపక | శకుంతల | 1966 | ఘంటసాల | సముద్రాల | ఘంటసాల |
| 1272 | నమ్మి నీ మాట తన (వెర్స్) | శకుంతల | 1966 | ఘంటసాల | సముద్రాల | ఘంటసాల |
| 1273 | చెలులారా శకుంతల సీమంతం | శకుంతల | 1966 | ఘంటసాల | సముద్రాల | లీల, వైదేహి |

సేకరణ: పున్నమరాజు శేషగిరిరావు, విశాఖపట్నం.

వచ్చే సంచికలో మరికొన్ని

# ...అలా పాలించిన మంత్రుల వంశంలో నేను పద్నాలుగో తరం వాణ్ణి...



హాస్యాన్ని సంగీతాన్ని తనలో రంగరించుకున్న
**ధర్మవరపు సుబ్రహ్మణ్యం**
'హాసం' ద్వారా అందించిన
జీవిత విశేషాల అనుభవాభిప్రాయాల ముచ్చట్లివి...

**మా** ఊరు ధర్మవరం. అనంతపురం జిల్లాలో ఒక ధర్మ వరం ఉంది. చాలామంది అదే అనుకుంటూ ఉంటారు. కానీ ఈ ధర్మవరం ప్రకాశం జిల్లాలోని అద్దంకికి 18 కి.మీ దూరంలో ఉంటుంది. కవిసార్వభౌమ శ్రీనాథుడు రాజ్య విద్యాధికారిగా అద్దంకి రావడం. అద్దంకి గురించి పద్యాలు చెప్పడం ఇవన్నీ జరిగాయి. అంత ప్రసిద్ధి చెందిన నగరం అద్దంకి.

నేను చిన్నప్పుడు హైస్కూల్లో చదువుకునే రోజుల్లో రెడ్డి రాజుల తాలుకూ శాసనం ఒకటి ఉండేది. అది రాసింది కూడా శ్రీనాథుడే అని చెప్పేవాళ్లు. ఆ శాసనం ఆలనా పాలనా లేకుండా కింద పడిఉండేది. ఏడెనిమిది అడుగుల పొడుగున్న ఆ రాయితో వేమందరం ఆడుకునేవాళ్ళం. దాని విలువ మాకేం తెలుసు... చిన్నపిల్లలం. అప్పట్లో పెద్దవాళ్లకే దాని విలువ తెలియక అలా పడేశారు.



మా ఊరు విషయానికొస్తే రెడ్డి రాజులు అద్దంకిని పరిపాలించడానికి ముందే ఈ ధర్మవరం ఉంది. తూర్పు చాళుక్యులు ఎప్పుడో క్రీ.శ 900 కు పూర్వంలోనే ఈ ఊరుని నిర్మించారు. ఇది పెద్ద జైన కేంద్రం. కొన్ని జైన దేవాలయాలు కూడా ఉండేవి. కాలక్రమేణా ఆ దేవాలయాలన్నీ రూపుమాసిపోతూ వచ్చాయి. ఈ రెడ్డిరాజులు నిర్మించిన కోట మట్టిది కావటం వల్ల కొండవీటికి షిఫ్టు అయి ఇక్కడో రాజ ప్రతినిధిని పెట్టి ఆయన కోసం ఒక కోటని ఈ ధర్మవరం దగ్గర కట్టారు. ఆయన దగ్గర మా తాతలు మంత్రులుగా ఉండేవారు.

నా నుంచి పద్నాలుగు తరాలు వెనక్కి వెళితే ధర్మవరపు రామన్న గారు అక్కడ మంత్రిగా ఉంటూ బాగా అజమాయిషీ చేసేవారు. ఆయన ఆ రోజుల్లో ఒక మర్రి చెట్టు నాటారు. దాన్ని రామన్న మర్రి అంటారు. ఇప్పటిక్కూడా ఆ చెట్టు మా ఊళ్లో ఉంది.

కాలక్రమేణా ఔరంగజేబు సైన్యాలు కొండవీటిని ఆక్రమించేశాయి. కోరుకొండ, తోడేలు తిప్ప అనే రెండు కొండలు ఉండేవి. ఈ రెండు కొండల మధ్య ఉండే పొలం అంతా మాకే ఇచ్చేశారు. ఆ కోట, ఆ కోట ప్రాకారం, అక్కడ కోనేరు ఇదంతా చాలా ఆహ్లాదంగా ఉండేది. అక్కడ మా గ్రామదేవత అంకమ్మ దేవాలయం ఉంది.

క్రమేపి వ్యవస్థ అస్తవ్యస్తమయిపోయి దొంగల బెడద ఎక్కువగా ఉండేది. అప్పుడు ఊళ్లో వాళ్లంతా తీర్మానించి- ఇది కొండ ప్రాంతం కావడంచేత దొంగలు,బందిపోట్లు వచ్చి

దోచుకుంటున్నారు కనుక కొంచెం దూరంగా మైదానంలా ఉండే ప్రదేశానికి వెళ్లి అక్కడ ఊరు కట్టారు. ఆ ఊరు కట్టినప్పుడు మా ఐదో తరం తాతగారు ధర్మవరపు మూర్తిరాజుగారు, తర్వాత ఇంకో తరం తాతగారు... (ఆయన పేరు కూడా ధర్మవరపు రామన్నే. తాతల పేర్లు మనమలకు పెట్టడం ఆచారంగా వచ్చేది ఆ రోజుల్లో)...

చింతల చెలమయ్యగారు, వంకాయల చంద్రమౌళిగారు మొదలైన గ్రామపెద్దలంతా కలిసి ఆ ఊరికి కొమ్మినేనివారి పాలెం అని పేరు పెట్టారు. అక్కడ చంద్రశేఖరస్వామి దేవాలయం ఉండేది. అది కొండవీటి రెడ్డిరాజుల కాలం నుంచి ఉండేది. ఆ దేవాలయాన్ని అట్లాగే పెకిలించుకుని తీసుకొచ్చి ఇప్పుడు మేం కొత్తగా కట్టిన ఊళ్లో పునఃప్రతిష్ఠ చేసుకుని.... దానికి నిత్య దీపారాధన, నైవేద్యం జరగడం కోసం కొంత భూమిని కేటాయించేశారు మా పెద్దలంతా కలిసి. ఇదంతా ఒక 120-130 సంవత్సరాల క్రితం మాట.

అలా మా వంశీకులు ఆ రాజుల దగ్గర మంత్రులుగా ఉంటూ వచ్చారు. అప్పటినుంచే ఈ లలిత కళలు అనేవి మా వంశంలో ఎవరో ఒకరికి... తరానికి ఎవరో ఒకరికి ఉండేవి. మా నాన్నగారు పద్యాలు బాగా పాడేవారు. నాటకాలు వేసేవారట! ఇక మా తరం వచ్చేప్పటికి నేను, మా అన్నయ్య చిన్నప్పుడు నాటకాలు వేసేవాళ్ళం. ఆయన పేరు కూడా మా తాతగారి పేరే... ధర్మవరపు సీతారామయ్య.

మొదటినుంచి చదువుమీద నాకు అంత ఇంట్రెస్ట్ ఉండేది కాదు. స్కూల్లో పాఠం చెపితే వినేవాణ్ని తప్ప ప్రత్యేకంగా దానిమీద దృష్టి పెట్టేవాణ్నికాదు. నాకు బాగా గుర్తు... టెన్త్ క్లాసు పబ్లిక్ ఎక్జామినేషన్ కొత్తగా పెట్టారు. పాసయిన 5గురిలో నేను ఒకణ్ని. వింటే గ్రహించుకునే శక్తి ఉండేది. దృష్టంతా నాటకాల మీదే ఉండేది. నేను ఏడవ తరగతిలో ఉండగా మా స్కూలు టీచర్లంతా 'దొంగ వీరడు' నాటకం వేస్తే- చిన్నపిల్లాడి క్యారెక్టర్ ఉంటే - వీడు బాగా యాక్టివ్‌గా ఉన్నాడు వీడి చేత వేయిద్దాం - అని చెప్పి నా చేత వేయించారు. అప్పట్నుంచి ఊళ్లో ప్రతి సంవత్సరం రెండేసి మూడేసి నాటకాలు ఇళ్ళల్లో డబ్బులు అడిగి తీసుకుని వేస్తూ ఉండేవాళ్లం. ఇంట్లో తిడుతున్నా కూడా నాటకాలు వేస్తే కానీ మాకు తృప్తి ఉండేదికాదన్న మాట.

నేను ఒంగోలు సి.ఎస్.ఆర్. శర్మ కాలేజీలో చదువుకున్నాను. అక్కడ నాకు ప్రజానాట్య మండలి నల్లూరి వెంకటేశ్వరావుగారితో పరిచయం అయింది. ఆయన్ని అంతా 'అన్న' అనేవారు. ఆయన కొడుకుల్లో ఒక కొడుకుగా పెరిగాను.

అక్కడే తినటం... అక్కడే ఉండడం... కాలేజీకి వెళ్తుండేవాళ్ళం తప్ప పాఠాలు వినడం అనేది ఎప్పుడూ లేదు. ఎప్పుడూ ఈ నాటకాల గొడవే.



నేను కాలేజీ కమిటికి జాయింట్ సెక్రటరీగా ఉండేవాణ్ణి. ఇసుకపల్లి మోహనరావు సెక్రటరీగా ఉండేవారు. చనిపోయిన డైరెక్టర్ టి.కృష్ణ, ప్రొడ్యూసర్ పోకూరి బాబురావు, మాదాల రంగారావుగారు, గిరిబాబుగారు, ప్రసాద్‌బాబు గారు, ఎమ్.వి.యస్ హరినాథరావుగారు, వందేమాతరం శ్రీనివాస్, మరుధూరి రాజా, డైరెక్టర్ బి.గోపాల్... వీళ్ళంతా ఆ ప్రాంతం వాళ్లే.

ఒకసారి అద్దంకిలో ఉన్న నా స్నేహితులంతా పబ్లిక్ సర్వీస్ కమీషన్ ఎగ్జామినేషన్ అప్లికేషన్ తీసుకొచ్చి వాళ్లే పూర్తిచేసి సంతకం పెట్టు పంపిద్దాం అన్నారు. హాల్ టికెట్టు రేపు ఎగ్జామ్ అంటే ఈ రోజు వచ్చింది. ఆ రాత్రే లారీ ఎక్కి గుంటూరు బయలుదేరి వెళ్లి ఎగ్జామ్ రాశాం. గమ్మత్తేమిటంటే నాతోపాటు సిన్సియర్‌గా ఎగ్జామ్ రాసినవారు ఫెయిలైతే, నేను పాస్ అయ్యాను. నేను ఎప్పుడూ చదివి పాసయిన వాణ్ణి కాదు. ఇది కూడా సరిగ్గా చదవకుండానే పాసయ్యాను.

హైదరాబాద్‌లోని రాజేంద్రనగర్‌లో ట్రయినింగ్. ఉద్యోగం రంగారెడ్డి జిల్లాలోని తాండూరులో. చదువు ఎంత శ్రద్ధగా చదివే



వాడినో ఉద్యోగం కూడా అంత శ్రద్ధగానే చేశాను. మెల్లగా రేడియోలో ప్రవేశించాను. రేడియోకి వాయిస్ ఇవ్వటం, నాటకాలు, చిన్న చిన్న నాటికలు రాయటం. అలా నా కెరియర్ స్టార్ట్ చేశాను. తర్వాత నా దృష్టంతా రచన మీదకి వెళ్ళిపోయింది. 1984-85లో మొట్టమొదట అనగనగా శోభ సీరియల్ రాశాను. (ఈ ఇంటర్వ్యూ తీసుకుంటున్న 'హాసం' ఎడిటర్ రాజాతో : అప్పుడే మీరు నాకు పరిచయం అయ్యారు)

అప్పట్లో తెలుగులో సీరియల్స్ ఏమిటి? అని అనేవాళ్ళతో ఎంత ఇబ్బంది పడ్డాం !? తర్వాత వచ్చిన సీరియల్స్ మనసు గుర్రం లేదు కళ్ళెం, బుచ్చిబాబు పార్ట్ 1, (మళ్ళీ రాజాతో మాట్లాడుతూ: బుచ్చిబాబు పార్ట్ 2 మీరు రాశారు), కుర్రాళ్ళోయ్ కుర్రాళ్ళు, పరమానందయ్య శిష్యులు, మర్యాద రామన్న.... ఇలా 1987 వ సంవత్సరం వచ్చేసరికి ఆనందోబ్రహ్మ.

అది ఆంధ్ర ప్రేక్షకుల్ని ఎంతగా ఆకట్టుకుందో అందరికి తెలిసిందే. ఆనందోబ్రహ్మ తర్వాత ప్రేక్షకులు నన్ను వాళ్లింట్లో ఒక సభ్యుడిగా చూసుకోవడం మొదలెట్టారు. ఆనందో బ్రహ్మ నా కెరియర్‌కు మంచి బ్రేక్‌ని, ఒక తృప్తిని, ప్రేక్షకుల మనసుల్లో ఓ స్థానాన్ని ఇచ్చింది.

సినిమారంగ ప్రవేశం జంధ్యాలగారి వల్ల జరిగింది. అంతకముందు నుంచే ఆయన నాకు పరిచయం. నేనంటే ప్రత్యేకమైన అభిమానంతో ఉండేవారు. నా తరహా కామిడీ అంటే ఆయనకు బాగా నచ్చేది. నా మాట విరుపుకాని, నేను డైలాగ్ చెప్పేవిధానం గానీ, నా బాడీ లాంగ్వేజి కాని ఆయనకు బాగా నచ్చేది. దాంతో ఆయన 'సినిమాలు చేయండి' అంటూండేవారు. 'సందర్భం వస్తే చేద్దాం' అంటూం డేవాడిని. వీర భద్రరావు గారు చనిపోవటంతో 'జయమ్ము నిశ్చయమ్మురా' తీసే టైంలో ఆయనకోసం తయారు చేసిన క్యారెక్టర్ ఎవరేస్తే బాగుంటుంది అని అనుకుని

జంధ్యాల గారు నన్ను మద్రాస్ రమ్మన్నారు... వెళ్ళాను. ఆదివిష్ణుగారు కూడా సుబ్రహ్మణ్యం ఈ క్యారెక్టర్ వేస్తే బాగుంటుంది అని ఒక మాట చెప్పారు. అలా ఆ క్యారెక్టర్ నేను వేయడం జరిగింది. తర్వాత జంధ్యాల గారు తీసే ప్రతి పిక్చర్‌లోనూ నాకు అవకాశం ఇచ్చి ప్రోత్సహిస్తూండేవారు.

తర్వాత చాలా సినిమాల్లో వేయటం జరిగింది. విశ్వనాథ్ గారి స్వాతికిరణం. బాపుగారి పెళ్లిపుస్తకం, మిస్టర్ పెళ్లాం, పెళ్లికొడుకు.... అల్లాగే కె.వాసుగారు, రేలంగి నరసింహారావు గారు అందరు డైరెక్టర్లు మంచి మంచి పాత్రలిచ్చారు.

తేజగారు 'నువ్వునేను' సినిమా తీయడానికి ముందే 'ఫ్యామిలీసర్కస్' తీశారు. అప్పుడే నాకు ఫోన్ చేసి "సుబ్రహ్మణ్యంగారు... మీ కామెడీ అంటే నాకు బాగా ఇష్టమండీ, మీరు 15 రోజులు చేయాలి.... ప్రయోగం లాంటిది చేస్తున్నాను. ఈ ఫ్యామిలీ సర్కస్ మీకు నటుడిగా మంచి పేరు తెచ్చిపెడుతుంది. నువ్వునేను కమర్షియల్‌గా మీకు ఎంతో ఉపయోగపడుతుంది. ఇది నిజం." అని అన్నారు. ఐయామ్ థ్యాంక్ ఫుల్ టు హిమ్. అలాగే నాకు ఆ చిత్రం కమర్షియల్‌గా ఎంతో గొప్ప పేరుని తీసుకొచ్చింది. స్టార్‌డమ్‌ని తీసుకొచ్చింది. ఆ చిత్రంలో శోభన్‌బాబు రింగ్, నేను ఉపయోగించిన 'అవునుబాబూ' మ్యానరిజమ్ - ఆడియన్స్ బాగా లైక్ చేయడం మొదలు పెట్టారు. నిర్మాతలు దర్శకులు కూడా 'ఈయనుండాలీ మన సినిమాలో.. ఉంటే బాగుంటుంది' అనుకోవటం జరిగింది.

అంతకుముందు క్లాస్ ఆడియన్స్ అంతా నన్ను లైక్ చేస్తూండేవారు. 'మీరు మాస్ దాకా వెళ్ళాలి. ఏ ఆర్టిస్టు అయినా మాస్‌ని టచ్ చేసినప్పుడే అది టోటల్‌గా కృతకృతుడయినట్లు లెక్క...' అని చాలామంది అనడం జరిగింది. అది 'నువ్వునేను'తో జరిగింది. అక్కణ్ణుంచి నేను నా స్టైల్ ఆఫ్ యాక్టింగ్‌ని మార్చుకోవడం జరిగింది.

ఎన్ని సినిమాలు చేసానని లెక్కేసుకోవడంలో నాకు ఇంట్రస్టు ఉండదు. పాత పత్రికలు చూసి 'ఓహో నేను ఈ సినిమాలో ఉన్నాను కదా' అని అనుకుంటూంటాను. నాకు తెలిసి ఓ 200 పైనే సినిమాలు చేసుంటాను. అవార్డులు చాలా వచ్చాయి. మూడు నంది అవార్డులు, వంశీ బర్కిలీ అవార్డు, రేలంగి వంశీ అవార్డు, భరతముని అవార్డు, ఫిలింగోయర్స్ అవార్డ్, ఆరాధన, అభినందన ఇలా అన్ని లీడింగ్ సంస్థల నుంచి అవార్డులు వచ్చాయి.

నాకు చిన్నప్పట్నుంచి సంగీతం మీద మోజు. లలిత కళలన్నీ ఒకదానికొకటి అల్లుకొని ఉంటాయి. నటుడైన ప్రతివారికి సంగీతం మీద మోజు ఉంటుంది. సంగీతం మీద అభిమానం ఉన్న ప్రతివారికి నటించాలన్న కోరిక ఉంటుంది. నటుడికి డ్యాన్స్ చేయాలనిపిస్తుంది. డ్యాన్స్ చేసే వాడికి యాక్ట్ చేయాలనిపిస్తుంది. యాక్ట్ చేసేవారికి పాడాలనిపిస్తుంది. ప్రతివారికి మనసులో దర్శకత్వం చేయాలనిపిస్తుంది. దర్శకులకి యాక్ట్ చేయాలనిపిస్తుంది. అలా నాకు ప్రత్యేకంగా సంగీతం మీద మోజు, నేర్చుకోవాలని కోరిక.

చిన్నప్పట్నుంచి పాడుతూండేవాణ్ని. మాది బాగా కుగ్రామం, వసతులు లేవు. ఊళ్లో మునుగోటి హనుమంతరావు అని ఉండేవారు. నాదస్వరం బాగా వాయించేవారు. ఆయన దగ్గర కృతుల దాకా నేర్చుకున్నాను. వాయిద్యం కూడా నేర్చుకోవాలనే కోరిక ఉండి ఫ్లూట్ కూడా నేర్చుకున్నాను. తర్వాత ఫకీర్‌సాబ్ అనే ఒకాయన కొన్ని మర్మాలు చెప్పేవారు. 'ఇట్లా ఉండాలి. ఈ ఫింగర్ ఇట్లా ఉంటే బాగుంటుంది' అని. ఆయన దగ్గర కొంత కాలం ఈ ప్రత్యేకతలు నేర్చుకోవడం జరిగింది. ఆ తర్వాత ఉద్యోగం పర్వం మొదలెట్టాక సంగీతానికి ఎక్కువ సమయం కేటాయించలేదు. నటన ప్రధాన వృత్తి అయిపోయిన తర్వాత ఇది ఉప వృత్తి అయిపోయింది. ఉపవృత్తికి కూడా ఇప్పుడు సమయం లేకుండా పోతోంది.



1997 ప్రాంతంలో నేను 'తోకలేని పిట్ట' సినిమాను డైరెక్టు చేసాను. ఆ సినిమాకు సంగీతం కూడా నేనే చేశాను. హైదరాబాద్ ప్రసాద్ ల్యాబరేటరీస్‌లో రికార్డింగ్ థియేటర్ కట్టినప్పుడు మొట్టమొదటి రీ-రికార్డింగ్ జరిగిన సినిమా నేను మ్యూజిక్ డైరెక్షన్ వహించినటువంటి 'తోకలేనిపిట్ట'! అందులో ఆరు పాటలున్నాయి. చాలామంది సంగీత దర్శకులు 'మీ వాయిస్ బాగుంది పాడొచ్చు కదా' అంటూంటారు. చూద్దాం ఆ సమయం వస్తే-

నాకు ఎటువంటి వ్యావకాలు లేవు. షూటింగ్‌నుంచి ఇంటికొచ్చానంటే మళ్ళీ గేటుదాటి పోవడం అనేది ఎప్పుడూ జరగలేదిప్పటివరకూ. పుస్తకాలు చదువుకోవడమో, సంగీతం వినడమో... ఎప్పుడూ టేపురికార్డర్‌లోనైనా, రేడియోలోనైనా పాట వస్తూనే వుంటుంది. హిందుస్తాని, కర్ణాటక అన్నీ వింటుంటాను. రమణిగారి ఫ్లూట్ అంటే చాలా ఇష్టం. నేను ఫ్లూట్ నేర్చుకునే కొత్తల్లో టి.ఆర్.మహాలింగం గారిని బాగా ఇష్టపడేవాడిని. ఇపుడు ఆయన రికార్డులు దొరకడం చాలా కష్టం. బాలమురళీగారంటే ప్రత్యేకమైన అభిమానం. నాదస్వరంలో షేక్ చిన్‌మౌలానా అంటే ఇష్టపడతాను.

ఏకాగ్రత లేకుండా ఏ పని చేయటం నాకు ఇష్టముండదు. ఏదో తూతూ మంత్రంగా చేయాలంటే చేయవచ్చు. ప్రస్తుతం నేనున్న పరిస్థితుల్లో మ్యూజిక్ డైరెక్షన్ చేయాలంటే ఇబ్బందేముండదు. సినిమా డైరెక్షన్ చేయాలన్నాకూడా అంతే... నాకు నిర్మాతలు ఉన్నారు. చేసే శక్తి ఉంది. కాని దాని మీద తదేకమైన ధ్యాస లేకుండా చేయడమనేది మంచి పద్ధతి కాదు. దర్శకత్వం, సంగీత దర్శకత్వం అనేది సినిమాకు రెండు కళ్ళు లాంటివి. ఆ రెండిట్లో ఏ ఒక దాన్ని చేయాలన్నా ఎంతో సమయం కేటాయించగలిగి ఉండాలి. వీలయినంత వరకూ సంగీతం మీదనే ఎక్కువ కృషి చేద్దామని నా కోరిక.

అద్దంకిలో నాకు మంచి సర్కిల్ ఉంది. కాస్త ఈ సాహితీ ఇంట్రస్టు ఉన్నవాళ్ళు ఉన్నారు. ఇప్పటిక్కూడా అక్కడ కళాసాగర్ అనే పరిషత్ నడుపుతున్నారు. ఇప్పుడు అది మంచి ప్రతిష్ఠాత్మకంగా తయారయింది.

ఎవరైనా అడిగినపుడు... అంతర్లీనంగా ఉండే ఈ రచనా వ్యామోహం అప్పుడప్పుడు... చిన్న చిన్న రచనల ద్వారా తీర్చుకుంటున్నాను తప్ప కాన్సన్‌ట్రేట్ చేసి రాసే అవకాశం ఇప్పుడు లేదు. 'హాసం'లో కూడా రాస్తాను... ఖచ్చితంగా రాస్తాను. ఒక ఏడెనిమిది సంచికల కోసం రాసిన తర్వాత చెప్తాను. ఎందుకంటే ఉన్నత వర్గాల్లో కూడా 'హాసం' అంటే మంచి అభిప్రాయం ఉంది. అటువంటి మంచి రీడర్స్ ఉన్నటువంటి 'హాసం' కు రాసేటప్పుడు మధ్యలో బ్రేక్ కాకుండా ఉండాలి. ఇంతకు ముందు... 'నేను ఒకణ్ణి రాయకుంటే నష్టమేముందిలే' అనుకునేవాణ్ని. పైగా ఇప్పుడున్న బిజీలో రాయటం కూడా పెట్టుకుంటే ఈ కాస్త ఖాళీ టైం కూడా పోతుంది అని అనుకునేవాణ్ణి. రసికత గల ప్రేక్షకుడు లేనప్పుడు చెప్పికూడా ప్రయోజనం లేదంటాడు కాళిదాసు. రసజ్ఞత గలవారు ఉన్నప్పుడు నటుడికి, గాయకుడికి ఎలా అయితే ఉంటుందో... మంచి పాఠకులు ఉన్నప్పుడు రచయితకు కూడా రాద్దామనిపిస్తుంది. హాసం చూసిన తర్వాత అదే అభిప్రాయం నాకు కలిగింది. ఒక మంచి ఫీచర్ మాత్రం నేను హాసానికి కొంత కాలం పాటు తప్పకుండా రాస్తాను.






## నటన-గానం ఆమెకు బొమ్మ - బొరుసు

# రాజేశ్వరి సచ్‌దేవ్

### రాజేశ్వరి సచ్‌దేవ్ మనసులో మాటలు

- గీతాదత్, ఆశాభోంస్లే, లతా మంగేష్కర్, వైట్నీ హౌస్టన్, షానియా ట్వైన్, మహ్మద్ రఫీ ఇష్టమైన గాయనీ గాయకులు.
- నా కోసం మంచి స్క్రిప్ట్‌తో వచ్చే ఏ దర్శకుడితో అయినా పనిచేయడానికి సిద్ధం.
- ఖల్సా దగ్గరి 5 గార్డెన్స్ ఇష్టమైన ప్రదేశం
- హనీమూన్ కోసం ఓ మంచి ప్లేస్ ఎంచుకోమంటే 'చంద్రమండలం' పేరు చెబుతా!
- డ్రీమ్ రోల్ ఏదంటే... ఇప్పుడే చెప్పడం కష్టం. నా కెరీర్ చరమాంకంలో ఈ ప్రశ్న వేస్తే... అప్పటికీ పోషించని పాత్ర ఏదో తెలుసుకుని - అప్పుడు చెబుతానీ ప్రశ్నకి సమాధానం.
- ఆర్ట్ సినిమాల్లోనే నటించడానికి నాకు అవకాశం వస్తోంది.. చేస్తున్నాను. 'మసాలా' సినిమాల్లో చేయకూడదని నేనెప్పుడూ భీష్మించుకోలేదు.
- తొలి ఆల్బమ్ సక్సెస్ అయ్యి - నా కంటూ కొందరు అభిమానులు ఏర్పడ్డాక - పాడటాన్ని సీరియస్‌గా తీసుకున్నాను. ఇప్పుడు నా మీద నాకు బాగా నమ్మకం ఏర్పడింది.

రాజేశ్వరి సచ్‌దేవ్ అనగానే ఈ రోజుల్లో క్రమం తప్పకుండా టీవీ చూసేవారికి 'కహానీ ఘర్‌ఘర్‌కీ' సీరియల్లో అంబిక పాత్రధారిణే కదా! అనిపిస్తుంది. కానీ రాజేశ్వరి సచ్‌దేవ్‌ను కేవలం నటిగా మాత్రమే గుర్తించామంటే పొరపాటు చేసినట్టే. బహుముఖ ప్రజ్ఞ అనే పదానికి సరైన నిర్వచనంగా రాజేశ్వరిని పేర్కొవచ్చు. ఎందుకంటే ఆమె నృత్యకారిణి, నటి... గాయని. అయితే ఆ నటన కేవలం బుల్లితెరకే పరిమితం కాలేదు.

ఐదేళ్ళ చిరుప్రాయంలో రాజేశ్వరి సచ్‌దేవ్ భారతనాట్యం అభ్యసించటం మొదలుపెట్టింది. ఆ తర్వాత ఇండియన్ పీపుల్స్ థియేటర్ అసోసియేషన్ ఆధ్వర్యంలో నాటకాలలో నటించటం ప్రారంభించింది. రంగస్థలం మీద ఆమె ప్రతిభను గుర్తించిన నటుడు, నిర్మాత సచిన్ తాను రూపొందిస్తున్న మరాఠీ చిత్రం 'ఆత్యా ఫురత్ ఫురోబా'లో నటించే అవకాశం కల్పించాడు. ఆ సినిమాలో ఓ ప్రధానపాత్ర పోషించడమే కాదు - ఆ యేడాది రాష్ట్ర ప్రభుత్వం నుండి ఉత్తమ నటిగా అవార్డునూ పొందింది. అలా ప్రాంతీయ భాషా చిత్రంలో నటించి గుర్తింపు పొందిన రాజేశ్వరికి శ్యామ్ బెనగల్ 'సూరజ్ కా సాత్వాఘోడా'లో ఓ పాత్రనిచ్చాడు. అదే శ్యామ్ బెనగల్ రూపొందించిన 'సర్దారీ బేగమ్' చిత్రంలో రాజేశ్వరి జాతీయస్థాయిలో ఉత్తమ సహాయ నటి అవార్డు పొందింది.

నటనకు సరిహద్దులు వుండవనే విషయంలో రాజేశ్వరిని ఉదాహరణగా తీసుకోవచ్చు. మరాఠీ, హిందీ చిత్రాల తర్వాత ఆమెకు హాలీవుడ్ చిత్రంలో నటించే అరుదైన అవకాశం లభించింది. హాలీవుడ్ స్టార్ కీనురీవ్స్ సరసన రాజేశ్వరి నటించి అంతర్జాతీయ ప్రేక్షకుల్ని మెప్పించింది.

**గాయనిగా....**

జన్మతః పంజాబీ అయిన రాజేశ్వరి సచ్‌దేవ్‌కు గానమంటే బాగా ఇష్టం. సంగీతపరంగా ఎవరి దగ్గరా శిక్షణ తీసుకోకపోయినా చిన్నతనం నుండీ పంజాబీ జానపద గీతాలను పాడుతుండేది. ఈ విషయం గురించి రాజేశ్వరి మాట్లాడుతూ "ఓ పంజాబీ అమ్మాయిగా మా ఇంట్లోనూ, చుట్టు పక్కలా ఏ శుభకార్యం జరిగినా నలుగురిలో కలిసి ఆడుతూ, పాడుతుండటం అలవాటై పోయింది. ఓసారి టీవీ షోలో నన్ను చూసిన మాగ్నా సౌండ్ వారు - ఓ పంజాబీ పాప్ ఆల్బమ్ తీసుకు రావాలనే ఆలోచనతో నన్ను కలిశారు. అలవాటైన జానపద గీతాలే కాబట్టి సరే...



అన్నాను. అయితే నా మొదటి ఆల్బమ్ 'హుల్లే హుల్లా రే'లో నేనే గొప్పగా పాడలేదని ఇప్పుడనిపిస్తుంది. ఆ ఆల్బమ్‌కు అమర్ హల్దీపూర్ సంగీతాన్ని సమకూర్చారు. భారతదేశంలోనే కాదు. పాకిస్థాన్‌లో కూడా ఆ ఆల్బమ్‌కి మంచి స్పందన వచ్చింది" అని అంది.

ఆ సక్సెస్‌ను దృష్టిలో పెట్టుకుని మాగ్నా సౌండ్ సంస్థ 2000 సంవత్సరంలో మరో పాప్ ఆల్బమ్ 'ముఖుడా పియాకా'ను రాజేశ్వరి సచ్‌దేవ్‌తో విడుదల చేసింది. ఇందులో ఎనిమిది పాటలున్నాయి. గాయనిగా రాజేశ్వరి ఎంతో పరిణితి చెందిందనడానికి ఆ ఆల్బమ్‌కి లభించిన ఆదరణే ఓ ఉదాహరణ. ఈ ఆల్బమ్‌కు కులదీప్‌సింగ్ స్వరాల్ని సమకూర్చగా, నక్షల్‌పురి రచన చేశారు. ఈమధ్య కాలంలో నటిగా రాజేశ్వరికి మంచి గుర్తింపు రావటంతో ఆమెలోని గాయని వెనకపడిందనే చెప్పాలి. వెండితెరే కాకుండా బుల్లితెరలోకీ నటిగా అడుగు పెట్టి 'మార్గరెట్' సిరిస్‌లో నటించినందుకు గాన స్క్రీన్ అవార్డ్‌ను పొందింది. నటనలో బిజీగా వున్నా గానాన్ని మర్చిపోలేదని రాజేశ్వరి సచ్‌దేవ్ చెబుతోంది. ప్రస్తుతం ఆమె తన మూడవ ఆల్బమ్‌ను సిద్ధం చేసే ప్రయత్నంలో వుంది ఈ యేడాది ఆఖర్లో అది శ్రోతల్ని అలరించే అవకాశం వుంది.

చేసిన పాత్రలు తక్కువే అయినా నటిగా ఎలాంటి గుర్తింపును పొందిందో - అలానే విడుదల చేసిన ఆల్బమ్స్ తక్కువే అయినా ఆమెకు గాయనిగానూ మంచిపేరు వచ్చింది. భవిష్యత్తులో ఈ బహుముఖ ప్రజ్ఞాశాలి మరే రంగంలోకి అడుగుపెట్టి - తనదైన ముద్రను ఏర్పరుస్తుందో వేచి చూడాలి!

**- వి.అరుణ సత్యవతి**

---

# హిందీ సినీ సంగీతంలో మలుపులూ-మజిలీలూ

## 1958

మహేంద్ర కపూర్‌కు "సోహ్ని మహివాల్" తో చక్కటి బ్రేక్ దొరికింది. ఓ రికార్డింగ్ స్టూడియోలో నౌషాద్ స్వర రచనలో మహేంద్ర పాడిన 'చాంద్ ఛుపా ఔర్ తారే డూబే' మాస్టర్ టేప్ విని యశ్ చోప్డా, బి.ఆర్.చోప్డాకు పరిచయం చేయటం జరిగింది. 'ధూల్ కా ఫూల్' లో పాటలకై మహేంద్రకపూర్‌ను ఆహ్వానించడంతో బి.ఆర్., మహేంద్ర అనుబంధం చిరకాలం కొనసాగింది.



**మహేంద్రకపూర్**

శంకర్-జైకిషన్ సంగీత దర్శకత్వంలో ఈ సంవత్సరం విడుదలైనది 'యహూది' మాత్రమే! అయితే ఈ చిత్రంలో హిట్ అయిన 'యే మేరా దీవానాపన్ హై' పాట గతంలో 'అమర్‌దీప్' చిత్రం కోసం సి.రామచంద్ర స్వరపరిచిన 'దేఖ్ హమేఁ ఆవాజ్ న దేనా' పాటను పోలి ఉందనే విమర్శలకు గురయింది. కానీ ఓ గ్రీకు ట్యూన్ ఇన్‌స్పిరేషన్‌తో ఆ రెండు పాటలూ రూపొందాయని తెలిసిన తర్వాత ఆ విమర్శలకు తెరపడింది.

'పర్వరిష్' మ్యూజికల్‌గా హిట్ కావటంతో శంకర్-జైకిషన్‌ల ముఖ్య అనుచరుడు దత్తారాం కు చక్కటి గుర్తింపు వచ్చింది. ఆ చిత్రంలో ముకేష్ గానం చేసిన 'ఆంసూ భరీ హై యే జీవన్ కి రాహేఁ', రఫీ-మన్నాదే పాడిన'మామా హో మామా', లతా-మన్నాదే ల 'మస్తీ భరా హై సమా' మంచి హిట్స్.

## 1959

రవి, ఓ.పి.నయ్యర్, మదన్‌మోహన్‌లకు కాస్త విరామాన్నిచ్చిన సంవత్సరమిది.'చిరాగ్ కహాఁ రోషనీ కహాఁ' చిత్రంలో లతా గానం చేసిన 'టిమ్ టిమ్ కర్తే తారే' పాటరవి హిట్‌గా నిలిస్తే, 'దో ఉస్తాద్' చిత్రంలో ఆశా- రఫీ గానం చేసిన 'తేరే దిల్ క మకాన్' నయ్యర్ హిట్ గా నిలిచింది.'చాచా జిందాబాద్' చిత్రం కోసం మదన్ మోహన్ స్వరరచనలో వెలువడిన 'యే హసీనో', 'బైరన్ నీంద్ న ఆయే' పాటలు మంచి హిట్స్. కెరియర్ చివరి దశలో కూడా అనిల్ బిశ్వాస్ చక్కటి హిట్స్ ఇవ్వగలిగారు. 'చార్ దిల్ చార్ రాహేఁ' చిత్రంలో ఆయన స్వరపరిచిన 'హోలీ ఖేలేఁ నందలాల్...కచ్చీ హై ఉమరియా', 'నహీఁ కియా తో కర్కే దేఖ్' పాటలు చక్కటి హిట్స్‌గా నిలిచాయి.

మహేంద్రకపూర్ కు బి.ఆర్. ఫిలిమ్స్ 'ధూల్ కా ఫూల్', శాంతారాం నిర్మించిన 'నవరంగ్' చిత్రాలతో చక్కటి బ్రేక్ వచ్చింది.

'ధూల్ కా ఫూల్'లో సాహిర్- ఎన్. దత్తా టీము లో 'తేరే ప్యార్ కా ఆస్ రా చాహ్‌తా హూఁ' (లతా- మహేంద్ర), 'ధడ్‌క్‌నే లగీ దిల్ కీ తారోం కీ దునియా' (ఆశా-మహేంద్ర), 'తూ హిందు బనేగా న ముసల్మాన్ బనేగా'(రఫీ) వంటి చక్కటి పాటలు రూపుదిద్దుకున్నాయి.



**'నవరంగ్' చిత్రంలో ఓ దృశ్యం**

'నవరంగ్' ఈనాటికీ గొప్పగా చెప్పుకునే మ్యూజికల్. సి.రామచంద్ర సంగీత దర్శకత్వంలో అన్ని పాటలూ హిట్లే. 'ఆధా హై చంద్రమా', 'తూ చుపీ హై కహాఁ', 'అరే జారే హట్ నట్ ఖట్' యే కాదు 'న రాజా రహేగా న రాణీ రహేగీ', 'శామల్ శామల్ బదన్' వంటివి కూడా పది కాలాల పాటు గుర్తుండే పాటలు.

-(వచ్చే సంచికలో మరికొంత)







**విడుదల : హెచ్.ఎం.వి.**
**వెల : రూ 55/-**

తెలుగు సినిమా తొలి నేపథ్య గాయనిగా గుర్తింపుపొందిన రావుబాల నరన్వతిది విలక్షణమైన న్వరం. భావప్రకటనలతో సుతిమెత్తగా ఆలపించడంలో ఆమె తరహాయే వేరు. సినిమాల్లో పాడతగినన్ని పాటలను బాలసరస్వతి పాడలేదన్నది వాస్తవమే అయినా, లలిత గీతాల చరిత్రలో ఆమె స్థానం పదిలం.

బాల సరస్వతి స్వర సామర్థ్యం, ఆమె పాటలు వింటూ ఉంటే కలిగే అనుభూతిని ఇప్పటి తరానికి చేరవేయాల్సిన అవసరాన్ని గుర్తించిన హెచ్.ఎం.వి. వారు గోల్డెన్ అవర్ పేరుతో ఓ క్యాసెట్‌ను అందించారు. ఇందులో పొందుపరిచిన 20 పాటలలో కొన్ని శ్రోతలకు చిరపరిచితాలే! 'గోపాలకృష్ణుడు నల్లన', 'బంగారు పాపాయి', 'తుమ్మెదా ఒకసారి' వంటి పాటలను నేటికి పదేపదే తలచుకునే శ్రోతలున్నారు.

అప్పట్లో సాలూరి రాజేశ్వరరావుతో కలిసి ఈమె పాడిన యుగళగీతాలు శ్రోతలను విపరీతంగా ఆకట్టుకునేవి. ముఖ్యంగా 'తుమ్మెదా ఒకసారి', 'కోపమేల రాధా ఆనందమే లేదా', 'రావే రావే కోకిలా', 'పొదరింటిలో నుండి' వంటి భావగీతాలను ఆ కోవలోకి చేర్చుకోవచ్చు.

మునురేసిందంటే, కలకలలాడుచు, తలుపుతీయునంతలోనే, సృష్టిలో తీయనిది, తుమ్మెదా ఒకసారి, కృష్ణా-నీమురళి, మేలుకోరా తెలుగువాడా, కోపమేల రాధ, ఆంధ్ర వనిత, ఆ తోటలోనొకటే, రావా మరచినావా, సలామోయి సలీమా, రావే రావే కోకిలా, ప్రేమా ఏల కలిగెను నాలో, బంగారు పాపాయి, పొదరింటిలో నుండి, ఆలయమున వినబడు నదిగో, నడపవ పడవ, పరగున రారా, గోపాల కృష్ణుడు నల్లన పాటలను ఈ క్యాసెట్‌లో పొందుపరిచారు. బాలసరస్వతి పై రాజేశ్వరరావు ప్రభావం ఎంతగా వుందో 'తుమ్మెదా' అనే పదాన్ని బాలసరస్వతి పలికే తీరులో తెలుస్తుంది.

అలాగే చక్కటి భావగీతాలను రాయడంలో రాజేశ్వరరావు గారి తండ్రిగారు సన్యాసిరావుగారు ఎంతటి లబ్ధ ప్రతిష్టులో ఇందులోని పాటలు ఋజువు చేస్తాయి. అన్నదమ్ములైన రాజేశ్వరరావు, హనుమంతరావులతో పాటు సి.ఆర్.సుబ్బరామన్, పెండ్యాల, కె.వి.మహదేవన్‌లు స్వరపరిచిన పాటలు కూడా ఇందులో వున్నాయి. ఈ అరుదైన గీతాలున్న క్యాసెట్‌ను కొని దాచుకోదగ్గదని అంగీకరించక తప్పదు.

**1**

రచన: తైదల బాపు
గానం : కుమార్ సాను & కోరస్

ప: మేరా దిల్ తుజ్‌కో దియా
గుండెల్లో నువ్వే ప్రియా
మేరా దిల్ తుజ్‌కో దియా
గుండెల్లో నువ్వే ప్రియా
ఎదలో చూడే ఇలా
ఎపుడూ నీదే లయా
ఎదలో చూడే ఇలా
ఎపుడూ నీదే లయా
మేరా దిల్ తుజ్‌కో దియా
గుండెల్లో నువ్వే ప్రియా
చ: అడుగు తీసి అడుగేయబోతే
ఆ అడుగే అడిగిందీ
నీ వైపే పదమందీ
పెదవి విప్పి మాటాడబోతే
నీ పేరే పలికిందీ
నువ్వే నేనంటుందీ
ఎటు చూసినా ఏం చేసినా
నీ రూపు రేఖలే కనిపించెనే
ఏ సవ్వడీ వినిపించినా
నువ్వు పిలిచినట్టుగా అనిపించెనే ॥మేరా॥
చ: ఇన్నినాళ్ళుగా మూగబోయి ఉందే
నా మనసిపుడే తెగ తొందర పడిపోతుందే
ఎంత చెప్పినా ఆగనంటూ
మాటే విననంటోందే
తన బాటే తనదంటోందే
ఏమైందనీ నేనడిగితే
తన పెదవి ముడిని అపుడిప్పిందిలే
నీ కోసమే ఈ పరుగని
చెవిలోన చిన్నగా చెప్పిందిలే ॥మేరా॥

**2**

రచన: సిరివెన్నెల సీతారామ శాస్త్రి
గానం : టీనా కమల్

ప: పండువెన్నెల్లో ఈ వేణుగానం
నీదేనా ప్రియనేస్తం అంటోంది నా ప్రాణం ॥పండు॥
ఎన్నెన్నో జ్ఞాపకాల తేనె జలపాతం
నీ పేరే పాడుతున్న మౌన సంగీతం
ఎద నీ రాక కోసం పలికే స్వాగతం ॥పండు॥
చ: ఎగిరే గోరింకా ఇటు రావా నా వంక
నువ్వు ఎందాకా పోతావో నేను చూస్తాగా
చాల్లే ఎంత సేపింకా
దిగుతావే చక్కా అలిసాకా నీ రెక్క
నా గుండెల్లో నీ గూడు పోల్చుకున్నాక
వెనుకకు వచ్చే గురుతులు మరిచే తికమక పడనీక
ఇటు ఇటు అంటూ నిను నడిపించే పిలుపును నేనేగా
రప్పించు కోనా నిను నా దాకా ॥పండు॥
చ: కన్నె సీతమ్మకీ పెళ్ళీడు వచ్చిందనీ
కబురు వెళ్ళిందిగా ఏడేడు లోకాలకి
అసలు ఆ జానకి తన కొరకె పుట్టిందని
తెలిసి ఉంటుందిగా కల్యాణ రామయ్యకి
వేధించే దూరమంతా కరిగేలా
విరహాల విల్లు ఇట్టే విరిగేలా
విడిపోని బంధమేదో కలిపేలా
మెడలోన వాలనుంది వరమాల
ప్రాయం పొంగే పాల కడలి అలలా ॥పండు॥







**3**

రచన: చైతన్యప్రసాద్
గానం : సునీత, ఉష, సంజీవిని, ఘంటాడికృష్ణ, ఘటికాచలం, వరికుప్పల యాదగిరి & కోరస్

ప: రివ్వున ఎగిరే గువ్వా నీ పరుగులు ఎక్కడికమ్మా ॥2॥
మంచున తడిసిన పువ్వా ఈ నవ్వులు ఎవ్వరివమ్మా
నీ రాజు ఎవ్వరంటా ఈ రోజే చెప్పమంటా
నీ రాజు ఎవ్వరంటా ఈ రోజే చెప్పమంటా
చ: అల్లరి పిల్లకు నేడు వెయ్యాలిక మెళ్ళో తాడు
ముడివేసే సిరిగల మొనగాడు ఎవరేవాడు
అ: చక్కని రాముడు వీడు నీ వరసకు మొగుడౌతాడు
ఆ: ఇల్లాలిని వదిలిన ఆ ఘనుడా ఈ పిరికోడు
ఆ కృష్ణుడి అంశన వీడే నీ కొరకే ఇలా పుట్టాడే
గోపికలే వస్తే అటే పరిగెడతాడే
అ: ఓ గడసరి పిల్లా నీ కడుపున కొడుకై పుడతానే
ఆ: కూతురుగా పుట్టు నీ పేరే పెడతాలే
అ: గొడవెందుకు బావతో వెళతావా
ఆ: పదబావా పాలకోవా ॥రివ్వున॥
ఆ: చిటపట చినుకులు రాలీ అవి చివరకు ఎటు చేరాలీ
సెలయేరులు పారే దారుల్లో కొలువుండాలీ
నిండుగ నదులే ఉరికే అది చేరునదీ ఏ దరికీ
కలకాలం కడలిని చేరంగా పరిగెడతాయీ
అట్టాగే నాతో నీవు నీతో నేను ఉండాలీ
బతుకంతా ఒకటై ఇలా జత కావాలీ
మన బొమ్మలపెళ్ళి నువ్వే తాళిని మెళ్ళో కడతావా
మరు జన్మకు కూడా ఇలా తోడుంటావా
ఓ బావా ఒట్టే పెడుతున్నా
నే కూడా ఒట్టేస్తున్నా
రివ్వున ఎగిరే గువ్వా నీ పరుగులు ఎక్కడికమ్మా
మంచున తడిసిన పువ్వా ఈ నవ్వులు ఎవ్వరివమ్మా
నా రాజు నువ్వేనంటా ఈ రోజే తెలిసిందంటా ॥2॥

**4**

రచన: తైదలబాపు
గానం : సందీప్ భౌమిక్, సునీత, నిష్మా & కోరస్

అ: అందాల భామలూ క్యాట్‌వాక్ చేపలూ
ఆడతారా మాతో సైయ్యాటలూ
ఆ: మీరంతా కోతులూ మీతోనా ఆటలూ
వద్దంటే వినరే మా మాటలూ ॥అందాల॥
అ: ఎందుకలా ఊరికనే నిందిస్తారే
మాతో పోటీ అంటే భయమేమోలే
ఆ: అబ్బబ్బో మీకంత సీనులేదులే
మీ కంటే సీనియర్లని చూసినాములే
అ: ఐతే లేదు ఎందుకంట చప్పున వచ్చేయ్యరే ॥అందాల॥
అ: గోడమీది బొమ్మ గొలుసులున్న బొమ్మ
ముట్టుకుంటే మొట్టికాయ వేస్తదమ్మా
దాని పేరు ఏంటో నువ్వు చెప్పవమ్మా
ఆ: ఇంత సిల్లి క్వశ్చన్ అది కాదు మాకు కష్టమ్ ॥2॥
దాని పేరు తేలు అని అంటారంట
ఒళ్ళంతా గొలుసులుగా ఉంటుందంట
అ: మామ కాని మామ మరి ఎవ్వరే
ఆ: నింగిలోని నిండు చందమామ లే
అ: కాయ కాని కాయ మరి ఏమిటే
ఆ: కాయ కాని కాయ నీ తలకాయలే ॥అందాల॥
ఆ: హలో హలో సారు జరదేఖో ఒకమారు
ఆ దాచేసిన పెళ్ళి బట్టలిచ్చుకోండి
ఇక మా ముందు మీ ఆటలు చెల్లవండి
అ: ముద్దు ముద్దుగుమ్మ మురిపాల పూలరెమ్మ ॥2॥
ముందు మేము అడిగింది ఇచ్చుకోమ్మా
ఆ తర్వాతే ఆ బట్టలు పుచ్చుకోమ్మా
ఆ: అంత హెడ్డు వెయిటు మీకు ఎందుకూ
ఇవ్వకుండా మారాములెందుకూ
అ: ఎంతైన మగపెళ్ళి వారమే
మరి మర్యాదలు మాకెన్నో చెయ్యాలిలే ॥అందాల॥

రచన: చైతన్య ప్రసాద్
గానం: రాజేష్, నిత్య సంతోషిణి

**5**

సాకీ: ఏ దూర తీరాలలో ఉందో నా చెలీ
ఏనాడు నా కంటికి కనిపిస్తుందో మరీ
అ: ఎక్కడ నిన్ను వెతకాలి ఎవరిని నేను అడగాలి ॥2॥
రావే నా చెలియా
ఆ: వెన్నెల కురిసే జాబిల్లి నా ఎద ఊసే చెప్పాలి తనతో ఈ వేళ
అ: హృదయమనే ఈ కోవెలలో తన రూపే ప్రతిమై ఉందనీ
ఆ: ఆమనినై ఎల కోయిలలా నే తనకై చూస్తున్నానని
అ: నువ్వైనా కబురందించాలి చల్లని చిరుగాలి
ఆ: ఎన్నడూ తరగని ప్రేమకు నువ్వు ఊపిరి పోయాలి॥ఎక్కడ॥
అ: పువ్వు నవ్వితే తన నవ్వే అనుకొని చూస్తున్నా
అటుగా పరుగులు తీస్తున్నా
మువ్వ మోగితే ఆ అలికిడి తనదే అనుకున్నా
పొరబడి ఎదురే చూస్తున్నా
రెక్కలు తొడిగిన గువ్వను నేనై దిక్కులు అన్నీ వెదికాను
దివిలో తారలు నా కన్నులుగా భువినంతా గాలించాను
ఆశే నేనై శ్వాసే తానై నిలిచా తనకోసం
నాలో చెదరని ప్రేమకు సాక్ష్యం నేలా ఆకాశం ॥వెన్నెల॥
ఆ: చిన్ని గుండెలో కలిగింది కమ్మని తుళ్ళింత
ఏదో తెలియని పులకింత
పిలిచినంతలో మనసంతా తీయని గిలిగింత
నాలో ఏమిటి ఈ వింత
వేకువ పొద్దున మందారాన్నై వాకిట ఎదురే చూస్తున్నా
పాపిట దిద్దిన సిందూరానికి పరమార్థంలా మిగిలున్నా
జగములు ఏలే జానకి రాముని సగమే నేనమ్మా
జతగా తానే కలిసేవరకూ బతికే శిలనమ్మా ॥ఎక్కడ॥

రచన: భైదలబాపు
గానం: ఉదిత్ నారాయణ్, టీనాకమల్

**6**

అ: నిన్ను ఎంత చూసినా చూసినట్టు ఉండదు
ఎంత మాటలాడినా ఆడినట్టు ఉండదు ॥నిన్ను॥
ఇంకా ఏదో కావాలని అనిపిస్తుందే
నీ వైపే నా మనసు లాగేస్తుందే ॥ఇంకా॥
బోలో బోలో భామా
ఇది ఏమి మాయో ప్రేమా ॥2॥ ॥నిన్ను॥
అ: ప్రేమన్న మాటేమో రెండు ముక్కలే
నీతోని చెబుదమంటే ఎన్ని తిప్పలే
ఆ: అడుగేస్తనంటూ ముందుకడుగేస్తడే
తీరా నే ఎదురు పడితే తడబడతాడే
అ: పచ్చిమిరపకాయ తిన్న బహు తీపిగుందిలే
మరి మందు తాగకున్నా మత్తెక్కుతున్నదే
ఆ: నాకు కూడ బాబు అట్టాగే ఉందిలే
మరి నువ్వు పక్కనుంటే గమ్మత్తుగుందిలే
అ: హలో పిల్లా సుభానల్లా నీకు ఇవ్వాలా
ఇలా నిన్నే చూసి నా మనసే పడిపోయే వెల్లకిల్లా
బోలో బోలో భామా
ఇది ఏమి మాయో ప్రేమా ॥నిన్ను॥
ఆ: పొద్దున్న లేవంగ ముద్దంటడే
వద్దన్న వినకుండ ఎగబడతాడే
అ: కొత్తగా ఈ లోకం బహు కొత్తగున్నదే
మొత్తంగ మాయేదో అవుతున్నదే
ఆ: హయ్యో చంటి పిల్లడల్లే మారాము చేస్తడే
మరి చిలిపి చేష్టల్లో ఆ చిన్ని కృష్ణుడే
అ: ఇక నిన్ను చూడకుండ ఆ పొద్దు గడవదే
తీరా నిన్ను చూసాక నా మనసు నిలవదే
ఆ: వద్దని అన్నా వద్దకు వచ్చి కలబడతాడే
వాడే సందె చూసి చప్పున వచ్చి గిలిగింతలు పెట్టేస్తాడే
అయ్యో అయ్యో రామా
ఇది ఏమి మాయో ప్రేమా ॥2॥ ॥నిన్ను॥

రచన: సిరివెన్నెల సీతారామశాస్త్రి
గానం: ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం

**7**

డియర్ ఫ్రెండ్స్
ఇప్పుడు నేను పాడబోయే పాట
ఓ అందమైన ప్రేమ కథ
రెండు గువ్వలు... చిలక, గోరింక
రెండు రవ్వలు... తార, నెలవంక
కలలు కన్నాయి... కథలు చెప్పకున్నాయి
ఆకాశం సాక్షిగా... భూదేవి సాక్షిగా
పసివయసులో
బొమ్మల పెళ్లి చేసుకున్నాయి
కడవరకూ నిలవాలని
బాసల వీలునామా రాసుకున్నాయి
ఇంతలో కాలం కన్నెర్ర చేసింది
ఆ జంటను విడదీసింది
ఇక ఒకే వెతుకులాట
ఇప్పుడు అదే నా ఈ పాట...
ప: రివ్వున ఎగిరే గువ్వా నీ పరుగులు ఎక్కడికమ్మా ॥2॥
నా పెదవుల చిరునవ్వా నిన్ను ఎక్కడ వెతికేదమ్మా
తిరిగొచ్చే దారే మరిచావా ఇకనైనా గూటికి రావా ॥2॥
చ: వీచే గాలుల వెంట నా వెచ్చని ఊపిరినంత
పంపించానే అది ఏచోటా నిను తాకనె లేదా
పూచే పువ్వుల నిండా మన తియ్యని జ్ఞాపకమంతా
నిలిపుంచానే నువ్వు ఏ పూటా చూడనె లేదా
నీ జాడను చూపించంటూ ఉబికే నా ఈ కన్నీరు
ఏనాడు ఇలపై పడి ఇంకి పోలేదూ
నడిరాతిరి ఆకాశంలో నక్షత్రాలను చూడూ
అవి నీకై వెలిగే నా చూపుల దీపాలూ
ఆ దారిని తూరుపువై రావా
నా గుండెకు ఓదారుపు (తేవా) ॥రివ్వున॥
చ: కిన్నెరసాని నడకా నీకెందుకె అంతటి అలకా
నన్నొదిలేస్తావా కడదాకా తోడై రాక
బతుకే బరువైపోగా మిగిలున్నా ఒంటరి శిలగా
మన బాసలు ఊసులు అన్నీ కరిగాయా ఆ కలగా...
ఎన్నెన్నో జన్మలదాకా ముడిచేసిన మన అనుబంధం...
తెగిపోయిందంటే నమ్మదుగా నా ప్రాణం
ఆయువుతో ఉన్నది అంటే ఇంకా ఈ నా దేహం
క్షేమంగా ఉన్నట్టే తన కూడా నా స్నేహం
ఎడబాటే వారధిగా చేస్తా
త్వరలోనే నీ జతగా వస్తా. ॥రివ్వున॥

రచన: భైదలబాపు
గానం: శంకర్‌మహదేవన్, సురేఖామూర్తి

**8**

అ:: ఈఫిల్ టవరయినా
ఈఫిల్ టవరయినా
మన చార్మినార్‌తో సాటిరాదురా
వాషింగ్‌టన్ అయినా
మన వాగుల ముందు దిగదుడుపేరా ॥ఈఫిల్॥
సుబ్బలక్ష్మి ముందు మడోన్నా వేస్టు
పాప్ బీట్ కన్నా మెలోడి టేస్టు ॥సుబ్బ॥
అచ్చమైన ఆవకాయే మనకు నచ్చునురా ॥2॥ ॥ఈఫిల్॥
అ: క్రికెట్‌లో వీరుల్లా ఎవరికి వారే అనుకున్నా
ఉరుమల్లే ఉరుమేటి సచిన్‌తో సరితూగేనా
ఆ: ఈ మైఖేల్ జాక్సన్ తెగ ఊపే స్టెప్పుల కన్నా
మెరుపై మెలితిరిగే చిరునగవే మిన్నా ॥ఆ మైఖేల్॥
అ: గంగి గోవుపాలు గరిటెడు చాలు కడివెడు ఎందుకురా
గుండె నిబ్బరంతో సాధించేందుకు ఒక్కడు చాలునురా
నోరు తెరిచి పలకరాని భాషలెన్నున్నా
స్వచ్ఛమైన తేటతెనుగే అన్నిటా మిన్నా ॥ఈఫిల్॥
అ: ఐ.ఎస్.ఐ. ని తరిమేసేయ్ పొలిమేరల్లోకి రాకుండా
హిందుస్తాన్ హమారాహై అని ఒట్టేయ్యాలి ప్రతి ఇంటా
ఆ: మువ్వెన్నల జెండా అది ఎగరాలి ఎదనిండా
చేసేద్దాం శత్రువుకు ఇక నిదరే రాకుండా ॥మువ్వెన్నెల॥
అ: కుప్పిగంతులేసే ముషారఫ్‌ని రఫ్ ఆడించేద్దాం
మన అటల్ బిహారి వాజ్‌పేయికి చేయూత అందిద్దాం
హద్దుమీరి చెయ్యిజారే సాంప్రదాయాల్లో
కమ్మనైనా కల్చరంటే ఇండియాదే రోయ్ ॥ఈఫిల్॥


SRB
యస్.ఆర్.బి. ఆర్ట్ ప్రొడక్షన్స్
పాటల పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు
'రాజా'
పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.
తారాగణం
రోహిత్, గజాల
రేఖ, ప్రేమ
కైకాల సత్యనారాయణ,
నారాయణరావు
ఆహుతిప్రసాద్, ఆలీ
ఎం.ఎస్.నారాయణ
ఎల్.బి.శ్రీరామ్, నవీన్
రాధాకృష్ణ, సుధ, దీప
చలపతిరావు, అపూర్వ
రేవతి, సుచిత్ర
సాంకేతిక నిపుణులు
స్క్రిప్ట్ పర్యవేక్షణ
మరుదూరి రాజా
మాటలు
ఎర్రగుంట్ల
పాటలు
సీతారామశాస్త్రి
చైతన్యప్రసాద్
తైదలబాపు
ఎడిటింగ్
కె.వి.కృష్ణారెడ్డి
కెమెరా
కె.ప్రసాద్
డ్యాన్స్
సుచిత్ర
ప్రదీప్ ఆంటోని
కృష్ణారెడ్డి,
శ్రీధర్‌రెడ్డి
రాకేష్
ప్రేమలత
ఆర్ట్
సత్య శ్రీనివాస్
స్టిల్స్
రవి
ప్రాజెక్ట్ ఇన్‌ఛార్జి
నూకరాజు & నాగులు
పబ్లిసిటి
సురేష్ అంజన్
పి.ఆర్.ఓ.
'ట్రేడ్ గైడ్' వెంకటేశ్వరరావు
కో డైరెక్టర్
మగ్గినేని రమేష్
నిర్మాత
ఎస్.రమేష్‌బాబు
కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం
'అంజి' శ్రీను
యస్.రమేష్‌బాబు
'అంజి' శ్రీను
ఘంటాడి కృష్ణ
'సిరివెన్నెల' సీతారామశాస్త్రి
చైతన్య ప్రసాద్
తైదల బాపు
జానకి Weds శ్రీరామ్
dts
అందరూ ఆహ్వానితులే...
యస్.రమేష్‌బాబు
ఘంటాడికృష్ణ
'అంజి' శ్రీను

సెప్టెంబరు 17 హస్రత్ జైపురి వర్ధంతి సందర్భంగా...

## 'ఎహసాన్ తెరా హోగా ముఝ్ పర్'

చిత్రం : జంగ్లీ
రచన : హస్రత్ జైపురి
సంగీతం : శంకర్ - జైకిషన్
గానం : మహమ్మద్ రఫీ, లతా మంగేష్కర్
అభినయం : షమ్మీ కపూర్, సైరాబాను





# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం






ఎహసాన్ తెరా హోగా ముఝ్ పర్
దిల్ చాహతా హై వో కెహనే దో
ముఝే తుమ్‌సే ముహబ్బత్ హోగయీ హై
ముఝే పల్‌కోఁ కీ ఛాఁవ్ మే రెహనే దో ॥ఎహసాన్॥
తుమ్‌నే ముఝ్‌కో హఁస్‌నా సిఖాయా (2)
రోనే కహోగే రోలేంగే అబ్
ఆఁసూ కా హమారే గమ్ న కరో
యే బెహతే హైఁ తో బెహనే దో ॥ముఝే తుమ్‌సే॥
చాహే బనాదో చాహే మిటాదో (2)
మర్ భీ గయే తో దేంగే దువాయేఁ
ఉడ్ ఉడ్‌కే కహేగీ ఖాక్ సనమ్
యే దర్ద్ - ఎ - ముహబ్బత్ సహనే దో ॥ముఝే తుమ్‌సే॥

'నేను పోయిన తర్వాత కూడా నా పాటలను గుర్తుపెట్టుకుంటారు' అని చెప్పిన దమ్మున్న రచయిత హస్రత్ జైపురి. నిజమే మరి! మరపురాని పాటలెన్నో వ్రాశారు ఆయన. ఆయన తన యుక్తవయసులో తను ప్రేమించిన అమ్మాయికి వ్రాసుకున్న ప్రేమలేఖ ఆ అమ్మాయికి ఇవ్వలేకపోయినా ఆ లేఖ తర్వాత రాజ్‌కపూర్ తీసిన 'సంగమ్'లో పాటగా మారి నేటికీ ప్రేమికుల నోళ్లలో నానుతోంది. ప్రేమలేఖ రూపంలోని ఆ కవితే 'యే మేరా ప్రేమ్‌పత్ర పఢ్‌కర్'. శంకర్ - జైకిషన్ నుండి జతిన్ - లలిత్ వరకు ఆయన ఎందరో సంగీతదర్శకులతో పనిచేశారు. పెద్ద బడ్జెట్ చిత్రాలు, చిన్న బడ్జెట్ చిత్రాలు అనే తేడా చూపకుండా అన్ని చిత్రాలకూ చక్కని పాటలు వ్రాసేవారు. ఆయనకు రెండు ఫిలింఫేర్ అవార్డులే కాకుండా సాహిత్యంలో ఆయన చేసిన కృషికి గాను వరల్డ్ యునివర్సిటీ రౌండ్-టేబుల్ నుంచి డాక్టరేట్, ఉర్దూ కాన్ఫరెన్స్ నుంచి జోష్ మహిలాబాదీ అవార్డు కూడా లభించాయి. 'మేరే హుజూర్' చిత్రానికి ఆయన వ్రాసిన 'ఝునక్ ఝునక్ తోరీ బాజే పాయలియా' పాటకు డా॥అంబేద్కర్ అవార్డు కూడా వచ్చింది.

హస్రత్ జైపురి అసలు పేరు ఇక్బాల్ హుసేన్. జైపూర్‌లో జన్మించిన ఆయన తన తాతయ్య ఫిదా హుసేన్ వద్ద ఉర్దూ, పర్షియన్ భాషలు నేర్చుకున్నారు. ఉర్దూలోనే కాక హిందీలోనూ, బ్రిజ్ భాషలాంటి మాండలికాల్లోనూ పాటలు వ్రాశారు. "హిందీ,ఉర్దూ విడదీయలేని సోదరీమణుల వంటివారు" అనేవారు ఆయన. కవితలు కూడా ఆయన రెండు భాషల్లోనూ వ్రాశారు.

రాజ్‌కపూర్, శంకర్-జైకిషన్ హస్రత్ అనుబంధం 1971 వరకు నిరాటంకంగా సాగింది. జైకిషన్ మరణం తర్వాత 'మేరా నామ్ జోకర్', 'కల్ ఆజ్ ఔర్ కల్' చిత్రాల పరాజయాల తర్వాత రాజ్‌కపూర్ తన మ్యూజిక్ టీమ్‌ని మార్చేశారు. హస్రత్ మాటల్లోనే చెప్పాలంటే "ఆనంద్‌బక్షీ, లక్ష్మీకాంత్ - ప్యారేలాల్‌ల గొప్ప టీమ్‌ని రాజ్‌కపూర్ ఎంచుకోవటం ఆనందం కలిగించింది". అంతటి గొప్ప మనసు హస్రత్‌ది. తర్వాత 'రామ్ తేరీ గంగా మైలీ'లో 'సున్ సాహిబా సున్' పాటను రాజ్‌కపూర్ హస్రత్ చేతే వ్రాయించారు. 'హెన్నా' చిత్రంలో కూడా పాటలు ఆయనే రాయాల్సి ఉన్నా రాజ్‌కపూర్ మరణం తర్వాత అది కార్యరూపం దాల్చలేదు. అలా రాజ్‌కపూర్‌తో హస్రత్ అనుబంధం చివరిదాకా కొనసాగింది.

రాజ్‌కపూర్ చిత్రాల తర్వాత షమ్మీకపూర్ చిత్రాలలో హస్రత్ పాటలు ఎంతో ప్రజాదరణ పొందాయి. షమ్మీకపూర్ ఇమేజ్‌కి తగినట్టు అల్లరి పాటలే కాకుండా గంభీరమైన పాటలు కూడా వ్రాశారు. 'జంగ్లీ'లోని 'ఎహసాన్ తెరా హోగా ముఝ్ పర్' ఈ కోవకు చెందినదే. ఈ చిత్రంలో హీరో తల్లి పెంపకంలో జీవితమంటే సీరియస్‌గా గడపాల్సినదని భావించే యువకుడిగా పెరుగుతాడు. ఒకసారి కాశ్మీర్ వెళ్ళినపుడు అతనికి హీరోయిన్ పరిచయమవుతుంది. ఆమె జీవితాన్ని సరదాగా నవ్వుతూ గడపాలని భావించే యువతి. ఆమె సహవాసంలో అతను కూడా నవ్వటం నేర్చుకుంటాడు. ఇద్దరూ ప్రేమించుకుంటారు. కానీ వారి పెళ్ళికి అతని తల్లి ఒప్పుకోదు. చివరికి ధనం కన్నా గుణం గొప్పదని తెలుసుకొని వారి పెళ్ళి జరిపిస్తుంది.

హీరో తల్లి హీరోయిన్‌ని అవమానించినపుడు హీరో ఆమెను సముదాయించే సందర్భంలో వచ్చేపాట 'ఎహసాన్ తెరా హోగా ముఝ్ పర్'. ఆమె అంటే తనకు ఎంత ప్రేమో ఈ పాట ద్వారా చెబుతాడు. 'నీ జీవితంలో నాకు స్థానం ఇస్తే నాకెంతో ఉపకారం చేసినదానివవుతావు' అనే భావం అతని ప్రేమ గాఢతని తెలియజేస్తుంది.

ఎహసాన్ అంటే ఉపకారం. ముహబ్బత్ అంటే ప్రేమ. పలక్ అంటే కనురెప్పలు. ఛావ్ అంటే నీడ.

'నాకో ఉపకారం చెయ్యి
మదిలో మాట చెప్పనీ
నేను నిన్నే వలచాను
నీ కనురెప్పల మాటున ఉండనీ'

'నేను నిన్నే ప్రేమించాను. నాకు తోడుగా ఉండు' అని కోరుతున్నాడు. 'కనురెప్పల మాటున ఉండనీ' అనే మాటలో 'ఎప్పుడూ నీ ఎదురుగా ఉండనీ' అనే భావం దాగి ఉంది. 'నాకు తోడుగా ఉంటే నాకెంతో ఉపకారం' అని అంటే ప్రేయసి మనసు కరగకుండా ఉంటుందా?

'హసనా' అంటే నవ్వటం. రోనా అంటే ఏడ్వటం. ఆసూ అంటే కన్నీళ్ళు.

'నాకు నువ్వు నేర్పింది నువ్వు
ఏడ్వమంటే ఏడుస్తాను
నా కన్నీళ్ళు చూసి దిగులొందకు
వీటినిలా ఆగకుండా కారనీ'

అతనికి జీవితంలోని మాధుర్యాన్ని రుచి చూపించింది ఆమె. ఆమె కోసం ఎన్ని బాధలైనా సహించటానికి అతను సిద్ధంగా ఉన్నాడు. తన బాధ చూసి దిగులుపడవద్దని ఆమెకు చెబుతున్నాడు. ఆమె తోడు లేకపోతే అతనికి కన్నీళ్ళే గతి.

మిటానా అంటే రూపుమాపటం. దువా అంటే ప్రార్థన. ఖాక్ అంటే మట్టి, బూడిద. దర్ద్ అంటే వేదన.

'తీర్చిదిద్దినా సరే నువ్వు రూపుమాపినా సరే
మట్టిలో కలిసినా నీ సుఖమే కోరుతా
ఆ మట్టి ఎగిసి చాటేది ఒకటే
ఈ ప్రేమలోని వేదన ఒపనీ'

తనను తీర్చిదిద్దినా, అధోగతి పాలు చేసినా ఆమె చేతిలోనే ఉందని అంటున్నాడు. తాను మట్టిలో కలిసిపోయినా ఆమె సుఖాన్నే కోరుకుంటానని అంటున్నాడు. ఆ మట్టి కూడా ఆమెను ప్రేమిస్తూనే ఉంటుంది కానీ ఆమెను మరచిపోదు. ప్రేమ కలిగించే తీయని బాధ చనిపోయినా సరే భరిస్తూనే ఉంటానంటున్నాడు. ఆ బాధ ముందు ఏ సుఖమైనా దిగదుడుపే. అతని ప్రేమ తీవ్రతను ఇక్కడ అద్భుతంగా చెప్పారు హస్రత్.



ఈ పాట మొత్తం లతా గళంలో రికార్డులలో దొరుకుతుంది. కానీ చిత్రంలో పల్లవి, రెండవ చరణం మాత్రమే హీరోయిన్‌పై చిత్రీకరించారు. పాతల ఔచిత్యానికి భంగం కలగకుండా ఎంత జాగ్రత్త తీసుకునేవారో దీన్ని బట్టి తెలుస్తుంది. మొదటి చరణం హీరోకి మాత్రమే నప్పుతుంది కదా!

హీరో తల్లి హీరోయిన్‌ని పెళ్ళి చేసుకుంటే తాను చనిపోతానని బెదిరించటంతో సందిగ్ధంలో పడిన హీరో ఊహలో వస్తుందీ రెండవ వెర్షన్. హీరో హీరోయిన్లుగా షమ్మీకపూర్, సైరాబానూ నటించారు.

సైరాబానూకి ఇదే తొలి చిత్రం. షమ్మీకపూర్ ఇమేజ్‌ని పదింతలు పెంచింది ఈ చిత్రం. 'యాహూ! చాహే కోయీ ముఝే జంగ్లీ కహే', 'మేరే యార్ షబ్బాఖైర్', 'అయ్యయ్యా కరూఁ మైఁక్యా సూకూ సూకూ' పాటలతో సూపర్‌హిట్ సంగీతాన్ని అందించారు శంకర్ - జైకిషన్. 'ఎహసాన్ తెరా హోగా ముఝ్ పర్' రఫీ క్లాసిక్స్‌లో ఒకటిగా నిలిచిపోయింది.

**- పి.వి.సత్యనారాయణ రాజు**





# కొమ్మ కొమ్మకో సన్నాయి...

(గత సంచిక తరువాయి)

సంగీతం ఎందరికో జీవనం, స్వరమేష్ నాయుడికది జీవితం,
ఎందరికో అది భుక్తి, రక్తి
రమేష్‌కి అది అనురక్తి, ఆశించిన ముక్తి,
వేగం పుంజుకుంటున్న నాడూ
మెలోడీని పోగొట్టుకుంటున్న నాడూ
భుక్తి కోసం స్థాయిని, హాయిని తాకట్టుపెట్టి
సినీ విపణిలో గిరాకీని ఆయన ఏనాడూ పెంచుకోలేదు.
తనకు కావాలని వచ్చిన వారికే సంగీత మిచ్చాడు గానీ,
తను కావాలని వెళ్లినవాడు కాదు.
నవర జానపదాలు సంకర హీనపదాలు ఏవో కొన్ని పోగు
చేసుకుని డబ్బు చేసుకుందామని వచ్చి, బాణీల దోపిడీలకు
పాల్పడే సంస్కృతికి చలనచిత్ర సరస్వతి తలవంచవలసిన
నేటి దుస్థితిలో విను చీకటిలో వినువీధి వాకిటిలో
రమేష్ నాయుడు అనే ధ్రువ నక్షత్రాన్ని చూపించడానికే
ఈ ఉత్తర కుమార ప్రజ్ఞలు -



## హాయిరెమ్మల కోయిల
## వేయిజన్మల వెన్నెల
## స్వరమేశ్వరుడి గానవాహిని అల!

నిర్దిష్టమైన 'కమిట్‌మెంట్' లేనినాడు నిజాయితీగా చిత్రం తీయలేనట్లే సందర్భ శుద్ధి లేని సన్నివేశానికి తగిన స్వరకల్పన కూడా అసాధ్యమే అవుతుంది. రమేష్‌నాయుడు గారికి తొంభైశాతం చిత్తశుద్ధి గల దర్శక నిర్మాతలే దొరికారు. అందువల్లనే ఆయన గీతాలు కలకాలం నిలిచిపోయాయి. అయినా తప్పనిసరిగా కొన్ని కృత్రిమ సన్నివేశాలకు చేయవలసి వచ్చినా ఆయన లాలిత్యాన్ని విడవకుండానే పాట పాటగా నిలవడానికే కృషి చేశారు. 'ఎంతటి అల్లరి వాడమ్మా ఉన్నది దోచెను ఓయమ్మా' అనే పాట దీనికి ప్రబలతార్కాణం. 'రెండుజెళ్లసీత' (జంధ్యాల) చిత్రంలో 'లేడివేట ఇది లేడీవేట వేడివేడిగా వెంటాడు' 'కొబ్బరినీళ్ల జలకాలాడి' 'రెండుజెళ్ల సీతాసీతా తీపి గుండెకోత' ఈ మూడు పాటలు రమేష్ చేసిన తీరును 'క్లాసికల్ కుర్రతనపు సంగీతం' అనవచ్చు. వేడి పాటల సాహిత్యాన్ని కూడా జోలపాడే సరసాల సరిగమలతో లాలించడం ఆయన చేతి చలువ, ఆయన రీతి విలువ. అదే చిత్రంలో ప్రేమని వ్యాఖ్యానిస్తూ రాసిన 'మందారంలో ఘుమఘుమలై' అన్న పాటలో

'ఒక ప్రేమ అమృతశిల్పం
ఒక ప్రేమ బుద్ధుడి రూపం
ఒక ప్రేమ రామచరిత్రం
ఒక ప్రేమ గాంధీతత్వం
అమ్మను కూడా మరిపించేదీ
బ్రహ్మను సైతం కనిపెంచేదీ

ప్రేమ ప్రేమ ప్రేమ' అనే అక్షరాలు సామవేదగానంలా చేసిన ధన్యుడు శ్రీ రమేష్‌నాయుడు -

'ఆనందభైరవి' చిత్రంలో ఎన్ని వైవిధ్యం గల సంగీత బాణీలను ఆయన వినిపించారో ప్రేక్షక శ్రోతలు మరువలేరు. ముఖ్యంగా 'ఆనందభైరవి' రాగంలో ఆయన చేసిన యుగళగీతం.

'పిలిచిన మురళికి వలచిన మువ్వకి
ఎదలో ప్రేమసరాగం

అది ఆనందభైరవి రాగం' అన్న పల్లవితో ఎంత మధురంగా, ప్రతిభావంతంగా ఆయన స్వరపరిచాడో తెలియనివారు లేరు. సినీ సంగీత రంగంలో తలపండిన సంగీత దర్శకుడు శ్రీచక్రధరరావు (కృష్ణ-చక్ర) వంటివారు ఆనందభైరవిలో నాయుడు గారు చేసిన స్వరకల్పనకు జోహార్లు అర్పించారు. అలాగే

'చైత్రము కుసుమాంజలి
పంచమ స్వరమున ప్రౌఢకోకిలలు

పలికే మరందాల అమృతవర్షిణి' గీతాన్ని ఆయన 'అమృతవర్షిణి' రాగంలోనే శాస్త్రీయంగా, మధురాతి మధురంగా స్వరపరిచారు. అమృతాన్ని వర్షింపజేసే హృదయ సంస్కారం, నాద హృదయ సంపర్కం నాయుడు గారి సంగీతానికి ఆధారం. దానిని పరిరక్షించుకునే విషయంలో ఆయన ఏనాడూ రాజీ పడలేదు.

'ఆనందభైరవి' పాటల కంపోజింగు విశాఖ సముద్ర తీరంలో ప్రశాంతంగా జరిగింది. మైసూర్ లలితమహల్‌లో జరిగినా విశాఖ సముద్ర తీరపు తారామహల్‌లో జరిగినా ధవళేశ్వరం పి.డబ్ల్యు.డి. బంగళాలో గోదావరీ తీరాన లేదా నందికొండలో కృష్ణా సాగర తీరాన జరిగినా రమేశ్వరుడి స్వర లహరిక నిర్నిద్ర మధుర రసతరంగిణిగానే సాగిపోయింది గానీ, హద్దులు దాటి హాయిని విడిచిపోలేదు. కావేరీ తీరపు కొబ్బరి తోటల్లో అసుర సంధ్యా కాంతులు వైరాగ్య వర్ణాలతో కషాయదీధితులు చిందేవేళ 'సారమతి' వంటి రాగాలు త్యాగబ్రహ్మ నోట వెలువడినట్లు రమేష్‌నాయుడు గారి మానస సరోవర స్వరహంసికలు చేసిన అవ్యక్త మధుర కలకలారావాలు చిరంత నానందనిధులై శ్రోతల హృదయాలలో నిలిచిపోయాయి.

నవలగా రాయదగిన జీవితం రమేష్‌నాయుడి గారిది. కల్పనాకథకన్న చిత్రమైనది జీవితం అని ఆంగ్లంలో సామెత వుంది. బొంబాయి, కలకత్తా, మద్రాసు నగరాలలో సాగిన ఆయన సంగీత యాత్రలో ఆయన తిరగని మలుపు లేదు. చేరని మజిలీ లేదు. సంగీత సాగరపు ఎల్లలు తాకుతూనే సినీ రంగానికి కావలసిన సింధుశాఖలనే ఆయన ఆశ్రయించారనీ, పరిమిత నౌకావిహారం మాత్రమే చేశారనీ చెప్పవచ్చు.

సి.రామచంద్ర స్వరకల్పనలో బీనారాయ్ ప్రదీప్‌లు నటించిన 'అనార్కలీ' లాగా అంతటి ఉదాత్త సంగీతభరిత చిత్రం ఈ చిత్రం. 1950 దశకంలో వచ్చిన ఆ ఫిలిమిస్తాన్ చిత్రం మద్రాసు పారగన్ టాకీస్‌లో కొన్ని నెలలు ఆడింది. రోజూ కొన్నాళ్లు రెండవ ఆటకు వెళ్లి కళ్లు మూసుకుని ఆ సంగీతం వినేవాడను. ఆ చిత్రం అలా ఎన్నిసార్లు చూశానో!

అంజలీపిక్చర్స్ వారు నిర్మించిన 'సువర్ణసుందరి' తరువాత మళ్లీ అదే పేరుతో బీరం మస్తాన్‌రావు దర్శకత్వంలో వచ్చిన చిత్రం రెండవ 'సువర్ణసుందరి' సవర్ణ సంగీత స్వరమంజరి.

శాంతారాం 'నవరంగ్' చిత్రాన్ని ఆధారం చేసుకుని తెలుగులో మంచి అభిరుచి గల దర్శక నిర్మాతలు కొన్ని పరిమితులకు లోబడి తీసిన చిత్రమది. దానికి వారు రమేష్‌నాయుడు గారిని సంగీత దర్శకులుగా ఎన్నుకోవడం వారి విజ్ఞతకు నిదర్శనం. ఆ చిత్రంలో పాటలన్నీ నేనే రాశాను.

తిరుపతిలో స్వామివారి శ్రీచరణ సన్నిధిని భీమాస్ హోటల్‌లో వారం రోజుల పాటు కంపోజింగు జరిగింది. పాటలన్నీ నాదసుధా బిందువులే. శ్రవణ మాధుర్య సింధువులే. విన్నవారికి ఆత్మబంధువులే - అంతటి ఆప్యాయమైనదా సంగీత రసధార. అంత ఆత్మీయమైనదా స్వరకల్పనా శిల్పచాతురి!

'గొబ్బిళ్లమ్మా గొబ్బిళ్లో' అనే జానపద ధోరణి గీతాన్ని మోహనరాగంలో డోలలూగించిన నాయుడు గారి రసహృదయానికి కృతజ్ఞులమై వుండడం కన్న మావంటివారు చేయగలిగింది ఏముంటుంది. అక్షరం అక్షరంగా నిలిచిపోగల సంగీతాభిషేకమది. అనుభూతి సంధానమది. 'సువర్ణసుందరి' చిత్రంలో ప్రతిపాట అమృత మధురమే. మాధురీశిఖరమే!

'ఇది నా జీవితాలాపన
ప్రియదేవతాన్వేషణ
ఏమైనదో ఎటదాగున్నదో
ఎన్నాళ్లు ఈవేదన'

భీంప్లాస్ అంతర్నిహితంగా సాగే ఈ రాగ రసాక్రందన అద్భుతం. సన్నివేశబలం దానికి తగ్గట్టు జరిగిన స్వరకల్పన ఆ రెంటి అనుసంధానాన్ని సాధించడంలో పుట్టుకొచ్చిన హృదయ పూర్వకమైన ఆర్తి, ఈ పాటలో కనిపిస్తాయి., కల్తీలేని భర్తీ ఒడుపులు అక్కరలేని స్వరకల్పన అది. అనుభవం వేరు పదం వేరు స్వరం వేరు కాని అనుభూతిలో లోతులకు వేరూనిన అమలమైన రసదర్శన శక్తికి రూపమే ఆ స్వరకల్పన.

'సువర్ణసుందరి' చిత్రం తీయడంలో కూడా అటువంటి నిష్ఠ, తపస్సు వుండి వుంటే ఇతర హంగులు కూడా అదే స్థాయిలో వుండివుంటే ఆ చిత్రం సువర్ణాక్షర సుందరిగా సినీ చరిత్రలో నిలిచిపోయేది. నిజానికి ఉన్న వనరులకు సరిపడా దర్శక నిర్మాతలు ఆ చిత్రాన్ని తీశారని చెప్పక తప్పదు.

'ఊహవో ఊపిరివో
నా జీవన రసమాధురివో
వివర్ణమైన ఆశలముంగిట
సువర్ణసుందరివో'

ఈ గీతాన్ని తనకు గురుతుల్యుడైన రామచంద్ర చితాల్కర్ పద్ధతిలో నాయుడు గారు ట్యూన్ చేసినట్లు అనిపిస్తుంది. 'నవరంగ్' హిందీ చిత్రంలో చితాల్కర్ 'తూ మేరీ మై తేరీ' అనే గీతాన్ని ఇదే సందర్భానికి ఇలాగే ట్యూన్ చేసినట్లు చిత్రం చూసిన వారికి తెలిసే విషయం.

ఇక ఆరు ఋతువుల శృంగార గీతం ఆ చిత్రానికే ఆయువుపట్టు, రాగమాలికగా ఆ పాటను మలచటంలో రమేష్‌నాయుడు గారు నేర్పును మించిన దార్శనికతను ప్రదర్శించారు.

సినిమా అనే మాధ్యమాన్ని ప్రేక్షకులు ప్రయోక్తలు అన్న పద్ధతిలో చూడడం, అది వ్యాపారమనే క్రియాశీలక వాస్తవాన్ని గమనించడం అందరిలాగా నాయుడు గారికీ తెలుసు. అయినా కల్తీలేని కళా వస్తువు

అట్టి వ్యాపార దృష్టికి బాహ్యమైనదని ఆయన భావించలేదు. అందుచేతనే ఆయన అటు మధువునూ ఇటు మంచి నీళ్ళనూ కూడా పంచిపెట్టారు. ఎంత మధురమైనా మధువు దాహం తీర్చలేదు కదా! మధువు లేకుండా మనిషి జీవించగలడు గాని మంచి నీళ్లు తాగకుండా వుండగలడా? అటువంటి వాస్తవికతా దృక్పథం కళాస్రష్టలకు ఎంతో అవసరం. మహదేవన్, రమేష్‌నాయుడు వంటి వారు ఈ దృక్పథాన్ని అమలు చేసి చూపించారు. నాయుడు గారు సంగీతం యిచ్చిన ఏ చిత్రంలోనైనా ఇది ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.

'సింధుభైరవి' రాగంలోని రంగుల సప్తకాన్ని ఆవిష్కరించిన మహనీయులలో బడేఘులాం అలీఖాన్, శంకర్-జైకిషన్, ఘంటసాల, మహదేవన్, రమేష్‌నాయుడు నా పరిమిత, అతి పరిమిత దృష్టికి గోచరించిన ప్రముఖులు. 'దిల్‌కాఖిలోనా హాయ్‌టూట్‌గయా' అనే శంకర్-జైకిషన్‌ల పాట వల్ల పొందిన ప్రేరణ అనదగిన విధంగా 'మేఘసందేశం' చిత్రంలోని 'నిన్నటి దాకా శిలనైనా నీ పదము సోకి నే గౌతమినైనా' పాటకు ఆయన రూపుదిద్దారనిపిస్తుంది.

'సువర్ణసుందరి' చిత్రంలో 'సంసార సుఖయాత్రలో అందించు శృంగార మధుపాత్రనే' అన్న పాట రాగమాలికగా తీర్చిదిద్దినా పల్లవి మాత్రం సింధుభైరవిలో ఎంతో మనోహరంగా ట్యూన్ చేశారు.

రమేష్‌నాయుడు సంగీత దర్శకుడుగానే కాక మనిషిగా మనస్వీగా ఎంతో ఉదాత్తమైన సంస్కారం కలిగినవాడు. చాలా అరుదైన మంచిమిత్రుడు, మితభాషి, హితవాది. ప్రపంచమనే పద్మవ్యూహంలో చిక్కి చీకాకుపడీ చితికిన నరపుత్రుడు, అయితే ఆయన స్వరపుత్రుడు కావడంతో మధుర జీవితం గడపగలిగాడు. మధురిమలను వెదజల్లుతూ సుధాలాపనగా జీవిత కాలాన్ని పాటగా పండించుకున్నాడు.

ఆ పాటల తోటలోని కోయిలలెన్నో ఆయన సరిగమల హాయిలో తేలిపోయి అవ్యక్తమధురాలాపాలు చేసేవి. గాయనీమణి ఆశాభోంస్లేకు రమేష్‌నాయుడంటే అమితమైన అభిమానం. ఆమె ఎప్పుడూ ఆయనను రమేష్ దాదా అని ప్రేమగా పిలిచేది. ఇక రావుబాలసరస్వతీదేవి ఆయనను 'తమ్ముడూ' అని సంబోధించేవారు. జేసుదాసు 'I am fortunate to sing for such a great Mastro' అని కీర్తించారు. 'ఇంత సంప్రదాయబద్ధంగా స్వరకల్పన చేసి పాడినందుకు ఆత్మతృప్తి కలిగించారు నాయుడుగారు' అన్నారు శ్రీ బాలమురళీకృష్ణ 'మేఘసందేశం' చిత్రంలో పాడినవాడు.

రమేష్ నాయుడు భావకవి. ఆయన స్వరాలలో కవిత్వం రాసినవాడు. సువర్ణసుందరి, మేఘసందేశం, శివరంజని, ముద్దమందారం చిత్రాలు ఆయన రాసిన వెలుగునీడల, రంగురంగుల రాగకావ్యాలు మృదుత్వం ఆయనలో జీవం. లాలిత్యం ఆయన ప్రాణం. ఆయన సుకుమారుడు, కంఠస్వరం అంతకన్న సుకుమారం. పట్టరాని కోపమొచ్చినా అదీ అతిసున్నితమైన వారీస్థాయి శ్రుతినే పలికేది.

జీవితంలో ఎన్నో డక్కామొక్కీలు తిన్నవాడు. తన అనుభవం ఆయనకు కొద్ది మంది స్నేహితులను సంపాదించి పెట్టింది. నేను ఆర్జించుకున్న ఆప్తమిత్రుడు ఆయన. ఆయన భౌతికంగా దూరమయ్యాక నేను ఆయనకు రాసిన పదవ పాటలోని ఈ చరణం ఆయనకు గుర్తుగా మిగిలిపోయింది.

'ఏటిపాప శాపమ్మ ఎగిసి ....... సూసింది
ఏడినావోడంటే ఏటిలోన మునిగింది
శాపమునిగినా కాడ శతకోటి సున్నాలు
శాపమైన గుండెలోన సెప్పలేని సుడిగుండాలు
ఏరెల్లిపోతున్నా నీరుండిపోయింది
నీటిమీద రాత రాసి నావెల్లిపోయింది'

-వేటూరి సుందరరామ్మూర్తి

# బాణీ ముత్యాలు


అత్రేయ

మాటలలో చిక్కుపడి మనసు నలిగి పోతుంది
మనసు లేని మాటలనే మనం నమ్ముతున్నది
పలుకలేని ప్రతి గుండె బాధతో నిండినది
ఒలికే ప్రతి కన్నీటి చుక్క వెచ్చగా వుంటుంది

చిత్రం : భార్యాబిడ్డలు
పాట : బ్రతుకు పూలబాట కాదు


సముద్రాల

రహదారి వెంట మొక్కనాటి పెంచరా
కలవాడు లేనివాడు నిన్ను తలచురా
భువిని తరతరాల నీదు పేరు నిలచురా
పనిచేయు వాడె ఫలమునారగించురా

చిత్రం : తెనాలి రామకృష్ణ
పాటపల్లవి : చేసేది ఏమిటో చేసెయ్యి సూటిగా


సిరివెన్నెల సీతారామశాస్త్రి

మార్కుల కోసం ఏడవలేదురా ఎదిగిన ఏ సైంటిస్టూ
గుర్తు పట్టరా ఏ రంగంలో ఉందో నీ ఇంట్రెస్టూ
నీకూ్కడా వుండే వుంటుంది ఏదో ఒక టాలెంటు
నీకు నువ్వు బాసవ్వాలంటే దాన్ని బయటపెట్టు
రేసు హార్స్‌వై లైఫ్ గెలిచే పరుగు మొదలుపెట్టు

చిత్రం : మనసిస్తేచూడు
పాట పల్లవి : బోడీ చదువులు వేస్ట్
నీ బుర్రంతా భోంచేస్తూ


సి.నారాయణరెడ్డి

కన్నతల్లి మనసు దీపకళికరా
తాను కరిగిపోయి పాలవెల్గులొలుకురా

చిత్రం : నిర్దోషి
పాట పల్లవి : చిన్నారి కృష్ణయ్య రారా


చంద్రబోస్

ప్రతి దినం ప్రభాతమై పదాలు తెచ్చే సూర్యుడు
ప్రకాశమే తగ్గించునా నా వల్ల కాదంటూ
ప్రతీక్షణం హుషారుగా శ్రమించి సాగే వాగులు
ప్రయాణమే సాగించునా మాకింక సెలవంటూ
ఉల్లాసంగా ఉత్సాహంగా బ్రతుకే సాగనీ
అంతేలేని సంతోషాలు ఒళ్లోవాలనీ

చిత్రం : చూడాలనివుంది
పాట పల్లవి : ఓ మరియా ఓ మరియా

సేకరణ : కె.కిశోర్‌బాబు, నాగర్ కర్నూలు

సేకరణ బి. బాలసుబ్రమ్మణ్యం, హైదరాబాద్

# ఎలుక వచ్చె ఇల్లు భద్రం



ఇలపావులూరి మురళీమోహనరావు

## 14

### హెచ్చరిక

విరగబడి నవ్వితే గుండె చిక్కబట్టి ఊపిరాడక అవస్థపడేవారు కామెడీ యాక్ట్ 2003 ప్రకారం ఈ సీరియల్‌చదవడం నిషేధం. ఒకవేళ మీ పొట్టచెక్కలైతే పత్రిక నుంచి ఎలాంటి పరిహారం రాదు. ఈ హెచ్చరిక ఈ సీరియల్ పూర్తయ్యేంత వరకు అమలులో ఉంటుంది.



### జరిగినకథ

వెంకట్రావు, సుందరిల ఇంట్లో ఓ ఎలుక చేరి నానా రభసా చేస్తూంటుంది. దాన్ని చంపడానికి పెట్టిన మందును వాళ్ల పాప రుచిచూడడంతో ఉత్తుత్తి పరీక్షల పేరిట డాక్టర్లు వేలాది రూపాయలు ఖర్చుపెట్టిస్తారు. ఎలుకలబోను పెడితే దాన్ని ఎలుక కొరికేస్తుంది. మేనేజరు ఇంటినుండి పిల్లిని తెస్తారు. అది ఎలుకను పట్టకుండా పడినిద్రపోతూ ఉంటే వెంకట్రావు మండిపడతాడు. తిండిపెట్టక మాడుస్తాడు. మర్నాడు చీలికలు పేలికలై కనిపించింది ఎలుక. అప్పటినుండి పిల్లి కనబడడం మానేస్తుంది. కంగారుపడుతూండగానే కొన్నాళ్లకు ఆరుకూనలతో సహా అటకమీద ప్రత్యక్షమవుతుంది. పిల్లి కూనలలో ఒకటి చనిపోవటంతో పక్కింటి అండాళ్ళమ్మ సలహాతో ప్రాయశ్చిత్తం చేయించాలని పురోహితుడు శాస్త్రిని కలుస్తాడు. శాస్త్రి వెంకట్రావు ఇంటికి వస్తాడు.



(ఇక చదవండి)

"చెప్పండి. సందేహాలను నివృత్తి చెయ్యడం మా వృత్తి ధర్మం. పురహితం కోరేవారిగా అది మా కర్తవ్యం." నవ్వారు శాస్త్రిగారు.

"పిల్లిని మహా నీచ జంతువంటారు గదా! పిల్లి ఎదురొస్తే చెడ్డ శకున మంటారు. పెళ్ళికి వెళ్తూ పిల్లిని చంకనబెట్టుక పోయినట్లు అంటారు. దొంగతనానికి వచ్చిన వాడిని పిల్లిలా వచ్చాడంటారు. పిల్లిని గురించి ఇంత హీనంగా మాట్లాడతారు. అటువంటి పిల్లిని చంపితే.... అహ.... చస్తే పాపం ఏంటి?" అన్నాడు వెంకట్రావు.

శాస్త్రిగారు మరో పట్టు నషాళాని కంటేలా పీల్చారు.

"వెంకట్రావు గారూ. నరుడి నాలికకు నరం లేదంటారు. పామును విషజంతువని చంపుతారు. మళ్ళీ అదే పామును నాగదేవత అని పూజిస్తారు. సాలెపురుగును చూసి మనిషి జడుసుకుంటాడు. శ్రీకాళహస్తి వెళ్ళి ఆ సాలెపురుగుకు దణ్ణం పెడతాడు. సమయానుకూలంగా మాటలు మారుస్తాడు. కనుకనే మనిషిని గుంటనక్కతో పోలుస్తారు. ఈ సకల చరాచర సృష్టిలో ఇంట్లో తిరిగే ప్రాణుల్లో అత్యంత అందమైన ప్రశస్థమైన జంతువు పిల్లి మాత్రమే అని అఖుభుక్కు పురాణంలో వ్యాఘ్రూస మహర్షి విడాలక మహారాజుకు చెప్పినట్లు పటిష్టమైన సాక్ష్యాలున్నాయి. అట్టి పిల్లిని చంపుట కోటి బ్రాహ్మల హత్యలతో సమానమని చెప్పారు." వివరించారు.

"ఇందాక లక్ష అన్నారు..." ఆశ్చర్యంగా అన్నది సుందరి.

"అమ్మాయీ... పుణ్యఫలం దినదినానికీ తరుగుతుంటుంది. దాన్ని ఎప్పటికప్పుడు సంపాదించుకుంటూ బ్యాలెన్స్ తగ్గకుండా చూసుకోవాలి. పాపం ఫిక్సెడ్ డిపాజిట్ లాంటిది. మనం దాన్ని ముట్టుకోకపోయనా రోజురోజుకూ పెరుగుతుంటుంది." అన్నారు శాస్త్రిగారు.

"ఇహ పెరక్కుండా చూడండి శాస్త్రిగారూ. దీనికేం చెయ్యాలో వెంటనే చెప్పండి. ముష్టి ఎలుకను చంపాలనుకుని ఏలినాటి శనిని నెత్తిన తెచ్చి పెట్టుకున్నాం." ఏడుపు ముఖంతో అన్నది సుందరి.




"కంగారు పడకమ్మా... మేమున్నదే అందుకు కదా... నువ్వెళ్ళి ఆ లోపల ఇందాక తెచ్చినట్లు ఈసారి చెంబుతో చిక్కని కాఫీ పట్రా" అని సంచిలోంచి పాత పుస్తకాల కట్టలు తీశారు. శాస్త్రిగారు. పుస్తకాలన్నీ చెదలుపట్టి పట్టుకుంటే చినిగి పోయేట్లు ముట్టుకుని కొన్ని శతాబ్దాలు గడిచిట్లున్నాయి. ఆ కట్టను కళ్ళ కద్దుకున్నారు శాస్త్రిగారు.

ఇంతలో సెల్ మోగింది.

"హలో....ఛీఫ్ మినిస్టరు గారా.... నమస్కారం సార్.... పిల్లి చచ్చిందా.... కాదా... కుక్క కారుకింద పడిందా! ఫర్వాలేదులే సార్... మరో రెండు మూడు గంటల్లో వస్తాను. ఉంటాను" ఆఫ్ చేశారు శాస్త్రిగారు.

"ఏంటి సీయమ్ గారే!" ఆశ్చర్యంగా అన్నాడు వెంకట్రావు.

"ఆయన ఇల్లు కదలాలంటే నేను వర్జ్యం చూసి చెప్పాలి. నేనంటే అంతగురి ఆయనకు... ఆ.... వెంకట్రావుగారూ.. ఈ గ్రంథాలే మంటున్నాయో తెలుసా?"

"ఏమో మరి? మాకేం అర్థమౌతాయి?"

"అవునవును. ఇవి ప్రాకృత పైశాచీ భాషల్లో ఉంటాయి. కాళిదాసుకు తప్ప అన్యులకు గ్రాహ్యం కావు. ఆఁ.... అబ్బో... ఔనా... చూద్దాం..అబ్బబ్బబ్బ... ప్చ్...ప్చ్..." మధ్య మధ్యలో కామెంట్లు చేస్తూ పుస్తకాలను మళ్ళీ కట్టగట్టి సంచిలో పెట్టారు శాస్త్రిగారు.

అతృతగా చూస్తున్న వెంకట్రావును చూసి చిర్నవ్వు నవ్వి రెండు సార్లు గొంతు సవరించుకున్నారు. ఇంతలో సుందరి కాఫీతో వచ్చింది.

"ఆహా....హా... చచ్చి ఏ లోకానుందో కానీ.... మా బామ్మ కూడా ఇలానే కాఫీ పెట్టేది. చూడండి వెంకట్రావు గారూ. మనపురాణాలలో శాస్త్రాలలో మనం చేసే ప్రతి పాపానికీ ఓ పరిహారం ఉన్నది. మానవ సహజగుణాలను దృష్టిలో పెట్టుకుని మన పెద్దలు ఎంతో ముందు చూపుతో ఆలోచించి ఇలాంటి ఏర్పాట్లు చేశారు. మన రాజకీయ నాయకులు ఎన్ని హత్యలు, దోపిడీలు, కుంభకోణాలు చేసి చట్టాల్లో ఉండే ఏవేవో లొసుగులను అడ్డం పెట్టుకుని పులుగడిగిన ముత్యాల్లా తిరిగి ప్రకాశిస్తున్నట్లే మనిషి తెలిసో తెలియకో చేసే అపరాధాలకు కొన్ని ప్రాయశ్చిత్తాలు చేసుకుని మళ్ళీ పునీతులవడానికి మార్గాలు అనేకం సూచించారు, విన్నారా?"

"వింటున్నాం. ముందు దీనికేం పరిష్కారం చెప్పారో చెప్పండి"

"ఈ పాపాలకు పరిష్కారాలుంటాయి కానీ కొంచెం... కొంచెం ఖరీదుగా ఉంటాయంతే. అయినా చర్మం వలిపించుకుని మరిగే నూనెలో వేగడమంత కఠినంగా ఉండ వనుకో" అన్నారు శాస్త్రిగారు నశ్యాన్ని పీల్చి.

"అవేంటో తొందరగా చెప్పండి శాస్త్రి గారూ.."

రెండుసార్లు పొడిగా దగ్గి బలిపశువులు దొరికారన్న ఆనందం మనసులో తాండ విస్తుండగా ఇద్దరి వంకా చూసి మొదలు బెట్టారు శాస్త్రిగారు.

"మనం ఏ జంతువునైతే చంపామో. ఆ జంతువెత్తు బంగారంతో ఆ జంతువాకారాన్ని తయారు చేయించి ఓ సద్బ్రాహ్మణుడికి సూర్యోదయ కాలంలో దానమివ్వాలి. ఇది మొదటి పరిష్కారం. అనగా మీరు పిల్లిని చంపారు కాబట్టి ఆ పిల్లి బరువుకు సరితూగే బంగారంతో ఒక పిల్లిని తయారు చేయించి నా వంటి పురోహితునకు దానం ఇవ్వాలి. దీన్ని శ్రేష్ట, ఉత్కృష్ట పరిష్కారం అంటారు."




"మైగాడ్.... బంగారు పిల్లే! మా వల్ల కాదు." అన్నాడు వెంకట్రావు.

నవ్వారు శాస్త్రిగారు.

"ఫరవాలేదు వెంకట్రావు గారూ శాస్త్ర కారులు దీనికీ పరిష్కారం చెప్పారు. అందరికీ బంగారపు దానాలు చేసే శక్తి ఉండదు. కనుక అటువంటివారు. వెండితో పిల్లిని చేయించి ఇంటి పురోహితుడికి దానం ఇవ్వచ్చు దీనికి మధ్యస్థ పరిష్కారం అంటారు" అన్నారు.

ఎక్కిళ్ళు ఆరంభమయ్యాయి వెంకట్రావుకు.

"శాస్త్రిగారూ.... పుచ్చుకోవడానికి మీరు సిద్ధంగానే ఉన్నా ఇవ్వడానికి మేము సిద్దంగా లేము. ఇటీవలే ఇల్లు కట్టుకుని పీకలమొయ్యా అప్పుల్లో ఉన్నాం. గృహప్రవేశానికి సువర్ణదానం అని బంగారపుటుంగరం పెట్టించుకున్నారు. దాని తాలూకు అప్పే ఇంకా తీరలేదు" ముఖం మాడ్చుకుని అన్నాడు.

"వెంకట్రావుగారూ... తరాల నుంచీ మీ ఇంటి పురోహితుడిని. మీ కుటుంబహితుడిని, మీకు సన్నిహితుడిని. మిమ్మల్ని ఇబ్బంది పెట్టి అప్పుల పాల్జేస్తానా? దీనికీ ఒక పరిష్కారం ఉంది. బంగారు వెండి పిల్లులను దానం చెయ్యలేని వారు రాగి పిల్లిని దానం ఇవ్వచ్చు. దీనిని అధమ నికృష్ట పరిష్కారం అంటారు. కానీ రాగి పిల్లిని దానం పుచ్చుకోగూడదని మా తాతగారు శాసనం చెయ్యడం వలన రాగి పిల్లికి బదులుగా ఇరవై వేలు రొఖ్ఖం దానంగా ఇవ్వచ్చు. ఇక నాకు తప్పేదేముంది? సర్దుకుంటాను." కంటి కొసలతో చూస్తూ అన్నారు శాస్త్రిగారు.

అరికాలి మంట నెత్తికెక్కింది వెంకట్రావుకు.

"శాస్త్రిగారూ. ఆశకు హద్దుండాలి. మేమేమీ రాజులం, జమిందార్లం కాదు. రాగిది కాదుకదా ప్లాస్టిక్ పిల్లిని కూడా ఇవ్వలేము." ఖరాఖండీగా అన్నాడు.

"పౌరోహిత్యం పాడి బర్రెలాంటి దంటారు. ఇందువల్లనే కాబోలు" అన్నది సుందరి.

నవ్వారు శాస్త్రిగారు.

"చూడమ్మా అది ఒకప్పటి మాట. నేడు ఈ వృత్తి వట్టిపోయిన గేదెలే తయా రైంది. వెనుకటి రోజుల్లో బ్రహ్మణులకు అగ్రహారాలు ఎకరాలకొద్దీ భూములు మందలు మందలు గోదానాలు, కిలోలు కిలోలు సువర్ణదానాలు ఇచ్చేవారు. ఈ రోజుల్లో సకల దానాలు అని ఓ వెయ్యి నూట పదహార్లు మొహాన కొడుతున్నారు. పెళ్ళిళ్ళకు, సత్యనారాయణ వ్రతాలకు మంత్రాల క్యాసెట్లు తెచ్చుకుంటున్నారు. ఆబ్దికాలు మఠాలలో పెట్టేస్తున్నారు. రానురాను మాకసలు విలువ, గౌరవం లేకుండా పోతున్నాయి," అన్నారు.

"ఈ అత్యాశలు భరించలేకనే అయి వుంటుంది." అన్నది సుందరి.

"ఏదో సమయం సందర్భం వచ్చినపుడే కదా మాకింత గిట్టు బాటయ్యేది" బదులిచ్చారు శాస్త్రిగారు.

"సర్లెండి. ముందు దానాల విషయం తేల్చండి." అనహనంగా అన్నాడు వెంకట్రావు.

"చూడండి వెంకట్రావుగారూ దానం పుచ్చుకోవడమంటే ఆషామాషీ వ్యవహారం కాదు. ఎవరూ ఊరికే దానధర్మాలు చెయ్యరు. తిరుపతి హుండీలో లక్షల రూపాయలు వేస్తుంటారు. దేనికి? వాళ్ళు చేసిన పాపాలు కోట్లలో ఉంటాయి. నరక బాధనుండి తప్పించు కోవడానికి మాకు దానాలు చేస్తుంటారు. అంటే అర్థం ఏంటి? చెప్పండి?"

"మీరే చెప్పండి"

"అంటే.... మీ పాపాలను మాకు ట్రాన్స్‌ఫర్ చేస్తున్నారన్నమాట! అంటే! మీకు బదులుగా కొరడా దెబ్బలు మేము తినాలి. నిప్పుల్లో మేము పొర్లాడాలి. మీ బదులు ఇనుప ముక్కుల కాకులతో మేము మా కళ్ళలో పొడిపించుకోవాలి. మీ బదులు మేము చర్మం వలిపించుకోవాలి. మీ దానాలు పుచ్చుకున్న నేరానికి మీ బదులు మేము నూనెలో వేగాలి. చీము నెత్తురుల గుంటల్లో మేము మునిగి భరించాలి. మీకు లక్ష రూపాయలిస్తాను ఈ శిక్షల్ని మీరు భరించగలరా?" ఉద్రేకంగా అన్నారు శాస్త్రిగారు.

"మీరు లక్ష చెప్పండి అంత భరించడం మా వల్ల కాదు." నిక్కచ్చిగా చెప్పాడు వెంకట్రావు.

"సరే మీ ఇష్టం. బుద్ధి కర్మానుసారిణీ అన్నారు. యమధర్మ రాజుకు పకోడీల టిఫిన్ పెట్టాలంటే కూడా అదృష్టం ఉండాలేమో! మీకా అదృష్టం ఉందేమో! ఇక నేనేం చెయ్యను? వస్తాను. రాఘవరావు గారింట్లో వాళ్ళబ్బాయి బల్లిని తొక్కాడట. బంగారవు బల్లిని దానమిస్తామన్నారు. బల్లికంటే పిల్లి పెద్దదిగదా అని ఇటొచ్చాను. ఆలస్యమైందంటే ఆయన మరొకరికి దానం ఇస్తారు" లేస్తూ అన్నారు శాస్త్రిగారు.

ఏం చెయ్యాలో తోచక అయోమయంలో పడ్డారిద్దరూ.




**-(ఇంకావుంది)**

# డిసీజ్ ఖర్మ్యా... దట్సాల్...!

సత్యమూర్తి



ఎన్నాళ్ళనుండో కల కంటున్న 'డ్రీమ్ హౌస్'ని ఊరికి దూరాన ప్రశాంతత కోసం సకల వైభోగాలతో కట్టుకుని హ్యాపీగా షిఫ్టవుతారు...



ఈ నిర్మానుష్య వాతావరణంలో దొంగతనాలు, దోపిడీలు జరుగుతాయని, అలా జరగకుండా ఉండాలంటే నెలకో 5వేలు తమకివ్వాలని లోకల్ గుండాలు, రౌడీలు బెదిరిస్తూ ఉంటే...




చవగ్గా వచ్చిన లేటెస్ట్ మోడల్ అనే పేపర్ ప్రకటన చూసి ఢామ్మని మొత్తం క్యాష్ కట్టేసి ఝూమ్‌ఝూమ్మని ఓ కంప్యూటర్‌ని కొంటారు...




మీరు బయటికి రాగానే ఇదింకా లేటెస్ట్ మోడల్ అంటూ ఏదోవంతు ధరలో లభించే మరో కంప్యూటర్‌ని షోరూంలో సేల్స్‌మెన్ మీముందే పెడుతూ ఉంటే...



అకస్మాత్తుగా ఆరోగ్యం దెబ్బ తినడంతో ఖరీదైన హాస్పిటల్‌లో అడ్మిటైన మిమ్మల్ని పరామర్శిస్తూ మొత్తం ఖర్చు మన కంపెనీయే భరిస్తుందని భరోసా ఇస్తాడు మీ బాసు...



డిశ్చార్జయ్యే దాకా పెండింగ్ వర్కంతా హాస్పిటల్‌కే పంపిస్తాను ఎలాగోలా పూర్తి చేసెయ్... అంటూ కొంచెం కోలుకోగానే బాసు తన ఫైల్స్ కూడా పంపించేస్తుంటే...

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

**తమిళం**
చిత్రం : అవళ్ ఒరుతొడర్ కదై
రచన : కణ్ణదాసన్
సంగీతం : ఎం.ఎస్.విశ్వనాథన్
గానం : ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం

**తెలుగు**
చిత్రం : అంతులేని కథ
రచన : ఆచార్య ఆత్రేయ
సంగీతం : ఎం.ఎస్.విశ్వనాథన్
గానం : ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం



## ముందు తమిళ చిత్రంలోని పాటను చూద్దాం

కడవుళ్ అమైత్తు వైత్త మేడై
ఇణైక్కుమ్ కల్యాణమేడై
ఇన్నార్క్కు ఇన్నారెన్ఱు
ఎళుది వైత్ తానే దేవన్ అన్ఱు ॥కడవుళ్॥
నాన్ ఒరు విగడ కవి - ఇన్ఱు
నాన్ ఒరు కదై శొల్లువేన్
ఓంగియ పెరుంగాడు - అదిల్
ఉయర్న్దదొరు ఆలమరమ్
ఆలమరత్ తినిలే అన్ ద అఱ్బుద వనత్తినిలే
ఆణ్ కిళి ఇరణ్డుండు పెణ్ కిళి ఇరణ్డుండు
అంగేయుం ఆశైయుండు
అదిలొరు పెణ్ కిళి అదనిడమ్ ఆణ్కిళి
ఇరండుక్కుమ్ మయక్కమ్ ఉండు
అన్బే ఆరుయిరే ఎన్ అత్తాన్ ॥కడవుళ్॥
కొట్టుమ్ ముళక్కంగళ్ కల్యాణ మేళంగళ్
కొణ్డాట్టమ్ కేట్టదమ్మా
ఆశై విమానత్తిల్ ఆనన్ద వేగత్తిల్
శీర్ కొండు వందదమ్మా
తేన్ మొళి మంగైయర్ యాళిశై మీట్టిడ
ఊర్కోలమ్ పోనదమ్మా
శింగారక్కాలోడు సంగీదత్తండైగళ్
సందోషమ్ పాడుదమ్మా
కన్ఱోడు పశు వంద కల్యాణప్పెణ్ పార్త్తు
వాళ్త్తొన్ఱు కూఱుదమ్మా
కాన్వెన్ట్ పిళ్ళైగళ్ పోల్ వందు
ముయల్గళ్ - ఆంగిలమ్ పాడుదమ్మా
పణ్బాన వేదత్తై కొణ్డాడుమ్ మాన్గళ్
మంతిరమ్ ఓదుదమ్మా
పల్లాక్కుత్తూక్కిడుమ్ పరివట్ట యానైగళ్
పల్లాణ్డు పాడుదమ్మా ॥కడవుళ్॥
ఒరు కిళియోడు ఒరుకిళి కై సేర్త్తు
ఉఱవుక్కుళ్ నుళైయుదమ్మా
ఉల్లాశ వాళ్క్కైయై ఉఱవుక్కు కొడుత్తిట్ట
ఒరుకిళి ఒదుంగుదమ్మా
అప్పావి ఆణ్కిళి తప్పాగ నినైత్తదు
అప్పోదు పురిందదమ్మా
అదు ఎప్పోదుమ్ కిళియల్ల
కిణట్ఱుత్తవళైతాన్ ఇప్పోదు పురిన్దదమ్మా ॥కడవుళ్॥



'అవళ్ ఒరు తొడర్ కదై' తమిళ చిత్రంలోని పాటల లాగానే 'అంతులేని కథ' చిత్రంలోని పాటలూ ఎంతో పేరు గడించాయి.

'అంతులేని కథ' చిత్రంలోని కథానాయికను ఆమె ఇంట్లో కాపురముంటున్న యువకుడు ప్రేమిస్తుంటాడు. ఆ యువకుడు ఒక ధ్వన్యనుకరణ కళాకారుడు. చివరికి నాయికను కాక వంచనకు గురి అయిన ఆమె సోదరిని పెళ్లాడుతాడు. అతను నాయిక సోదరిని పెళ్లాడడానికి నాయిక మీద ఉన్న ప్రేమతో బాటు ఆమె పట్ల అతనికికున్న గౌరవమూ కారణమే. ఈ ధ్వన్యనుకరణ కళాకారుడి వేషాన్ని తమిళ చిత్రంలో కమల్‌హాసన్, తెలుగు చిత్రంలో నారాయణరావు ధరించారు. ఈ 'మిమిక్రీ' కళాకారుడు - పెళ్లి 'రిసెప్షన్' సన్నివేశంలో పాడే పాట - తాళికట్టు శుభవేళ'. ఈ పాటకు తమిళ మాతృక 'కడవుళ్ అమైత్తు వైత్త మేడై'.

ఈ తమిళ గీతం బాణిలోనే తెలుగు చిత్రంలోని పాటనూ స్వరపరిచారు - విశ్వనాథన్. ఈ పాటలో వినిపించే రకరకాల ధ్వనులను వినిపించినవారు విశ్వనాథన్ సంగీత బృందంలో ఎంతోకాలం సభ్యులుగా ఉన్న సదన్ తదితరులు. (ఒకసారి ఒక బయలు ప్రదేశంలో సదన్ ఏవో పక్షుల కూతలు అనుకరిస్తూ ఉంటే కాకుల గుంపు ఒకటి ఆయన మీదికి దండెత్తి రాగా - ఆయన జింకలను అనుకరిస్తూ అక్కడినుంచి పారిపోయారట).

**కణ్ణదాసన్ రాసిన తమిళ గీతానికి భావానువాదం :**

దేవుడు అమర్చి ఉంచిన (అమర్చిన) వేదిక
(జత) కలిపే కల్యాణ వేదిక
వీరికి వీరంటూ
రాసి ఉంచాడే దేవుడు నాడు
నేను ఒక వికటకవిని - నేడు
నేను ఒక కథ చెబుతాను



**ఆచార్య ఆత్రేయ రాసిన తెలుగు పాట ఇక్కడ :**

అతడు: తాళికట్టు శుభవేళ మెడలో కల్యాణమాల
ఏనాడు ఏ జంటకో రాసి ఉన్నాడు విధి ఎప్పుడో

వికట కవిని నేను - వినండి ఒక కథ చెబుతాను -
కాకులు దూరని కారడవి - అందులో
కాలం ఎరుగని మానొకటి
ఆ అందాల మానులో ఆ అద్భుత వనంలో
చక్కని చిలకలు అక్కాచెల్లెలు పక్కన గోరింకలు
ఒక గోరింకకు ఓ చిలకమ్మకు ఒద్దిక కుదిరెనమ్మా
బావా - రావా - నన్నేలుకోవా ॥తాళి॥

మేళాలు తాళాలు మంగళ వాద్యాలు
మిన్నంటి మోగెనమ్మా
వలపుల విమానాన తలపుల వేగాన
వచ్చాయి కాన్కలమ్మా
ఊరేగు దారుల వయ్యారిభామలు వీణలు మీటిరమ్మా
సింగారి జాణల ముంగాలి మువ్వలు
ఘల్లున మోగెనమ్మా ॥తాళి॥

గోమాత లేగతో కొండంత ప్రేమతో
దీవించ వచ్చెనమ్మా
కాన్వెంటు పిల్లల పోలిన నెమళులు
గ్రీటింగ్స్ చెప్పిరమ్మా
నాలుగు వేదాలు వల్లించు హరిణాలు
మంత్రాలు చదివెనమ్మా
పట్టపుటేనుగు పచ్చగ నూరేళ్ళు
వర్ధిల్లమనెనమ్మా ॥తాళి॥

చేయీ చేయిగ చిలుకా గోరింక శయ్యకు తరలిరమ్మా
చెల్లెలి కోసం త్యాగం చేసిన చిలకమ్మ తొలగెనమ్మా
తప్పుగ తలచిన అప్పటి గోరింక కిప్పుడు తెలిసెనమ్మా
అది చిలుకే కాదని బావిలో కప్పని జాలిగ తలచెనమ్మా

దట్టమైన పెద్ద అడవి - అందులో ఎత్తయిన మర్రిచెట్టు
మర్రిచెట్టులో - ఆ అద్భుతవనంలో
మగ చిలుకలు రెండూ ఆడ చిలకలు రెండూ ఉన్నాయి
అక్కడా ఆశ (ప్రేమ) ఉండేది
అందులో ఒక ఆడ చిలుక - దానిపట్ల రెండు
మగ చిలుకలకూ మైకం ఉండేది
ప్రియా నా ప్రాణమా నా బావా
వాద్యాల మోతలు కల్యాణ మేళాలు
కోలాహలం వినిపించెనమ్మా
ఆశ విమానంలో ఆనందవేగంతో
కానుకలు వచ్చెనమ్మా
తేనె పలుకుల మగువలు (యాళ్) వీణలు మీటగ
ఊరేగింపు సాగెనమ్మా
శృంగార పాదాల సంగీతపు మువ్వలు
సంతోషంగా పాడాయమ్మా
దూడతో ఆవు వచ్చి పెళ్లి కూతురుని చూసి
అభినందన తెలిపెనమ్మా
కాన్వెంట్ పిల్లలలాగా వచ్చిన
కుందేళ్లు ఆంగ్లం(లో) పాడాయమ్మా
మేలిమి వేదాన్ని గౌరవించే జింకలు
మంత్రం చదివినాయమ్మా
పల్లకి మోస్తున్న అలంకరించిన ఏనుగులు
(చిరకాలం వర్ధిల్లమని) ఆశీస్సులు పాడినాయమ్మా
ఒక చిలుకతో ఒక చిలుక చేయి చేర్చి
బాంధవ్యంలోకి ప్రవేశించినదమ్మా (బంధుత్వం కలుపుకొన్నది)
ఆనంద జీవితాన్ని బంధువుకు ఇచ్చిన
ఒక చిలుక (ఆవలికి) తొలగిపోయింది
అమాయకమైన మగ చిలుక అపార్థం చేసుకొన్నదని
అప్పుడే తెలిసిందమ్మా
అది అసలు చిలుకే కాదని
బావిలో కప్ప అని ఇప్పుడు అర్థమైనదమ్మా

నాయిక ఇల్లు అడవిలోని మర్రిచెట్టు. నాయిక ఆడ చిలుకయితే ఆమెకు మీద ప్రేమ పెంచుకున్న ఇద్దరు పురుషులు మగ చిలుకలు. అయితే మగ చిలుకలు ప్రేమించిన ఆడ చిలుక తన ప్రేమను త్యాగం చేసింది. చేయీ చేయీ కలిపి బాంధవ్యాన్ని పెనవేసుకొని - పెళ్లయిన చిలుకల జంట సాగిపోతుండగా - త్యాగం చేసిన ఆడ చిలుక - వైదొలగిపోయింది. ఆ చిలుకకు ఇల్లే వైకుంఠం. ఆమె తన కుటుంబమనే ఆ బావిలో కప్ప.

తమిళ గీతంలోని భావాలనే తెలుగు పాట చాలా వరకు ప్రతిబింబించిందని చెప్పాలి.

తమిళ గీతం పల్లవిలోని 'దేవుడు' తెలుగు పాట పల్లవిలో 'విధి'గా దర్శనమిస్తాడు. 'తాళికట్టు శుభవేళ మెడలో కల్యాణమాల, ఏనాడు ఏ జంటకో రాసి ఉన్నాడు విధి ఎప్పుడో' అనే తెలుగు పాట పల్లవి తమిళ గీతం పల్లవి నుంచి వేరయినది. తెలుగు పాటలోని కొన్ని పంక్తులు తమిళగీతంలోని కొన్ని పంక్తుల కన్నా మెరుగ్గా ఉన్నాయి. 'మేళాలు తాళాలు మంగళ వాద్యాలు మిన్నంటి మోగెనమ్మా వలపుల విమానాన తలపుల వేగాన వచ్చాయి కాన్కలమ్మా' అనే పంక్తులు సొగసుగా ఉన్నాయి.

తమిళగీతంలో రెండు మగ చిలుకలు రెండు ఆడ చిలుకలు ఉన్నాయి. తెలుగులో రెండు (ఆడ) చిలుకలు, ఒక గోరింక కనిపిస్తాయి. తమిళ గీతంలో లేని స్పష్టతను తెలుగు పాటలో చూడవచ్చు. అయితే తమిళ గీతంలో 'కాన్వెంట్ పిల్లల వంటి కుందేళ్లు' ఉండగా, తెలుగు పాటలో కుందేళ్లు నెమళ్లుగా పరిణామం చెందాయి. తెలుగులో ఆ పంక్తులలో అన్వయదోషం కనిపిస్తున్నది. ఆ 'నెమళులు' కాన్వెంట్ పిల్లల వంటివే కానీ కాన్వెంట్ పిల్లలు కావు. కాగా పాటలో 'నెమళులు గ్రీటింగ్స్ చెప్పెనమ్మా' అని ఉండాలి. 'గ్రీటింగ్స్ చెప్పిరమ్మా' అనే ప్రయోగం నెమళ్ల పరంగా సరికాదు.

తమిళ సంప్రదాయంలో చిలుకలకూ గోరింకలకూ జంట కుదరదు. తమిళ గీతంలోని చిలుకల జంట తెలుగులో చిలకా గోరింకల జంట కావడం తెలుగు సంప్రదాయానికి అనువైనదే. తమిళ గీతంలో 'శయ్య' 'త్యాగం' అనే మాటలు వాచ్యంగా లేదు. ఒక (మగ) చిలుక, ఒక (ఆడ) చిలుక చేయీ చేయీ కలిపి చుట్టరికం కలుపుకొన్నాయనీ తన చుట్టానికి ఆనంద జీవితాన్ని అందించి మరొక (ఆడ) చిలుక దూరంగా ఒదిగి పోయిందనీ తమిళ గీతం చెబుతుంది.

తమిళ గీతంలో అమాయకమైన మగ చిలుక ఆడ చిలుకను అపార్థం చేసుకొందనీ అయితే తన ప్రేమను త్యాగం చేసిన ఆ ఆడ చిలుకను అపార్థం చేసుకొన్న సంగతి - ఆడ చిలుక తొలగిపోయిన దాకా తెలియలేదనీ ఉంది. తెలుగు పాటలోనూ గోరింక మొదట్లో అపార్థం చేసుకొన్నదనే వృత్తాంతమే ఉంది. అయితే వ్యక్తీకరణలో 'అప్పటి గోరింక' అని ఉండడం వల్ల ఇప్పటి గోరింక వేరే ఉందనే అపార్థం కలిగే అవకాశమూ ఉంది!

-పి.ఎస్.గోపాలకృష్ణ

## ఘంటసాల క్విజ్ -8 విజేతలు

1. మొదటి బహుమతి - ఎమ్.అప్పారావు, అనకాపల్లి
2. రెండవ బహుమతి - ఉపాధ్యాయుల రమాకుమారి, జయ్‌పూర్ (ఒరిస్సా)
3. మూడవ బహుమతి - ఎస్.హిమబిందు, జయ్‌పూర్ (ఒరిస్సా)

**కరెక్టు సమాధానాలు:**
1. రక్షరేఖ
2. తులసి
3. మంచి కుటుంబం
4. మనదేశం
5. చంద్రహారం

**బహుమతులు:**

1. మొదటి బహుమతి : ఎ) 'బహుదూరపు బాటసారి' (ఘంటసాల ప్రైవేట్ పాటల) డబుల్ డిస్క్/ స్వరసుధ ఘంటసాల 31 గాయనీ మణులతో పాడిన సినీ గీతాల డబుల్ డిస్క్ హెచ్.ఎం.వి.వారిది.
బి) ఘంటసాల పాడిన గోల్డెన్ అవర్స్ పాటల క్యాసెట్. హెచ్.ఎం.వి. వారిది.
2. రెండవ బహుమతి : 'బహుదూరపు బాటసారి' (ఘంటసాల ప్రైవేట్ పాటల) డబుల్ డిస్క్ హెచ్.ఎం.వి.వారిది.
3. మూడవ బహుమతి : ఎ) ఘంటసాల, ఎల్.ఆర్.ఈశ్వరి యుగళ గీతాల 'లవ్‌మీ నెరజాణ' హెచ్.ఎం.వి. వారి సింగిల్ సి.డి.
బి) ఘంటసాల పాడిన గోల్డెన్ అవర్స్ పాటల క్యాసెట్. హెచ్.ఎం.వి.వారిది.




# చాట్ మాటు సరసాలు

- సూరేపల్లి విజయ

అంబుజరావ్‌కు యమ టెన్షన్‌గా వుంది. వన్డే క్రికెట్ మ్యాచ్‌లో కూడా యింత టెన్షన్ ఫీలవ్వలేదు. భార్య పుట్టింటికి వెళ్తానన్నా యలాంటి యాహూ... రియాక్షన్ లేదు. గోడ గడియారం వంక కళ్ళు విప్పారించుకొని మరీ చూస్తున్నాడు. ఆ గడియారం పక్కనే వున్న గోడకు అతుక్కుపోయిన బల్లి ఓసారి అంబుజరావ్ వైపు లుక్కేసింది జాలిగా!

".... ఇంత హేపీగా వున్నావేమిట్రా.. పుసిక్కన మీ ఆవిడ పుట్టింటిగ్గానీ వెళ్ళిందా?" క్లర్క్ కూర్మారావు ఓ జోక్ జోకాడు.

"ఏంటీ.... కామెడీనా... నేనిప్పుడు మాంచి రొమాంటిక్ మూడ్‌లో వున్నాను" అన్నాడు అంబుజరావ్ చొంగను తుడుచుకుంటూ.

"కంగ్రాట్స్...!" చింతామణి లైన్ క్లియరైందా? లేక చూడామణి డిస్కౌంట్ గానీ యిస్తానందా?" ఉండపట్టలేక అడిగాడు క్యాషియర్ కనకాచలం.

ఓసారి వాళ్ళిద్దరి వైపు చూసి "రెండూ కాదు నేనిప్పుడు నెట్‌కు వెళ్తున్నాను... చా... చా... చాటింగ్" అన్నాడు గుసగుసగా.

కనకాచలం, కూర్మారావు మొహమొహాలు చూసుకున్నారు.

తర్వాత కిసుక్కున నవ్వి "మేమూ అటే... పద... పద" అన్నారు.

ఓన్లీవన్ ముక్కలో చెప్పాలంటే, ఈ మధ్యే ఓ ముష్టి మదనష్టపు ఫ్రెండ్ అంబుజాన్ని చాటింగ్ రూమ్‌కు తీసుకువెళ్ళి చాట్‌కి చెందిన చేట భారతాన్ని 'ఎండ చేట' లెవెల్లో క్లియర్ చేసాడు. అందులో మజా మెల్లమెల్లగా అర్థమైంది అంబుజరావుకు.

ఒక్క రోజైనా చాట్ మిస్సయితే దాదాపు మెంటల్ అయ్యే స్టేజ్‌లో వున్నాడు. ఆఫీసు వదలగానే చాట్ మొదలెడతాడు అదీ సంగతి.

* * *

"హాయ్ స్మార్ట్"

చాటింగ్ మొదలెట్టేడు అంబుజరావు.

"హాయ్"

"మీ హైటెంత?"

"ఫైవ్ టెన్..." అంటూ 'చాటాడు' అంబుజరావు మరో నాలుగంగుళాలు కలుపుకొని.

"వాహ్... మరి కలర్?"

ఓసారి తన మొహం వంక చూసుకొని బ్లాక్‌ని వైట్‌గా మార్చి చెప్పాడు "వైట్.. ఫెయిర్"

"మరి... జాబ్"

"బిజినెస్... మంత్లీ ట్వెన్టీ ఫైవ్ థౌజండ్"

అతని చేతి వేళ్ళు కీ బోర్డ్ మీద కదులుతున్నాయి.

"ఇవ్వాళ నేను ఎలోన్‌గా వున్నాను"

"వావ్...సేమ్ టు సేమ్"

ఇలా అరగంట సేపు సొల్లు వాగుడు చాట్‌లో కొనసాగాక... ఆవేళ్టికి ఆ డోస్ చాలు అన్నట్టు తృప్తిగా బయటకు వచ్చాడు అంబుజరావు.

****

మొగుడింటికి రాగానే మిసెస్ అంబుజరావ్ సీరియస్‌గా ఓ లుక్కేసి "ఎక్కడికెళ్ళొచ్చారు... మళ్ళీ ఆ మాయదారి చాటింగ్‌కేనా?" అని అడిగి కడిగేసింది.

అయినా అంబుజరావ్ 'తు నా బొడ్డు' అన్న ఎక్స్‌ప్రెషనొకటి యిచ్చి "సోవాట్!?" అన్నాడు.

మిసెస్ అంబుజరావ్ ఆ వేళే ఉసిరికాయ పచ్చడి పెట్టింది... అదింకా జాడీలోకి ఎత్తలేదు. మొగుడి మాటలు విన్నాక, ఆ పచ్చడి వుండాల్సింది జాడీలో కాదని దాని ప్లేస్ మొగుడి తలకాయ అని అర్థమై ప్లేటులో వున్న పచ్చడి అతని తల మీద గుమ్మరించి...

"నో సో వాట్... ఐయామ్ హాట్" అన్న ఎక్స్‌ప్రెషనొకటి యిచ్చి పడగ్గదిలోకి వెళ్ళింది.

'సోవాట్' అని ఈసారి అన్లేక పోయాడు అంబుజరావు. ఓ వేళ అంటే, ఈ ఉసిరికాయ పచ్చడి కాంబినేషన్ కోసం ఏ సాంబారో తెచ్చి నెత్తి మీద గుమ్మరిస్తుందని భయమేసింది.

'అయినా... మనిషి మారలేదు'

అన్న పాట వస్తోంది టీవీలో.




* * *

అంబుజరావ్‌కు ఆ రాత్రంతా నిద్ర పట్టలేదు. దానిక్కారణం మర్నాడు తను తన చాట్ ఫ్రెండ్‌ని కలుసుకో బోతున్నాడు.

చాటింగ్ చేసేప్పుడు అవతల ఓ క్యాండిడేట్ తగిలింది. తన పేరు లీసా అని చెప్పింది. "అబ్బ... నాకు మొనాలిసా గుర్తొస్తుంది" అని అన్నాడు చాట్ చేస్తు అంబుజరావ్.

తనకింకా పెళ్ళి కాలేదని... కారణం నీలాంటి మంచి పర్సన్ తగల్లేదని ఏవేవో చెప్పింది చాట్‌లో... వెంటనే అంబుజరావ్ ప్లాటయిపోయాడు. అంతకు ముందు ఓ రెండు మూడు అనుభవాలు ఎదురయ్యాయి అంబుజరావ్‌కు.

ఓసారి చాట్‌లో తను అబ్బాయినని చెబితే "ఛీ... పాడు... నాకు సిగ్గు బాబూ.. నేను అబ్బాయిలతో మాట్లాడను" అని (చాట్‌లోనే) వాపోయింది ఓ బేబి.

వెంటనే ఓ బ్రహ్మాండమైన ఐడియా ఆలోచించేసి తను అమ్మాయినని అబద్ధ మాడాడు. వెంటనే అవతలమ్మాయి ప్లాటయి ఫ్రెండ్షిప్ మొదలెట్టేసి ఓ రోజు పార్కులో కలుసుకుందామని చెప్పింది.

తీరా వెళ్ళి చూసాక అంబుజరావు బుగ్గ బూరె సైజులో ఉక్రోషంతో ఉబ్బిపోయింది.

ఎదురుగా వున్నది తనలాగానే మగ పురుషుడు. అమ్మాయంటే చాట్ మొదలెడతారని అవతల శాల్తీ తనలాగనే ప్లానేసేసరికి యిలా బెడిసి కొట్టింది.

ఇలాంటి ఎక్స్‌పీరియన్స్‌లు జరిగాక ఒళ్ళు దగ్గర పెట్టుకొని చాటింగ్ మొదలెట్టసాగాడు.

తను పక్కా అబ్బాయినేనని నిజం చెప్పి కొసమెరుపుగా తనో బిజినెస్ మ్యాన్‌నని అబద్ధం చెప్పాడీసారి.




తనకు కారు, బంగ్లా, స్టేటస్ వగైరా, వగైరాలు వున్నాయన్నాడు. దాంతో అవతల శాల్తీ ప్లాట్.. రోజూ ఇంటిక్కూడ తెగ ఫోన్లు.

అంబుజరావ్‌కు ఈ చాట్ తెగ నచ్చేసింది. చాట్‌ని కనిపెట్టిన వాడి ఫోటోకి రోజూ ఓ దండేసి... అగరొత్తులు ముట్టించి, దీప ధూప నైవేద్యాలు పెట్టాలన్న ఓవర్ ఎమోషన్‌కు గురయ్యాడు కూడా.

చివరికి తన తెలివి తేటలకు మురిసిపోయి మోకాల్లో వున్న తలకాయను మురిపెంగా నిమురుకున్నాడు.

* * *

ఆరోజు పొద్దున్నే మార్నింగ్ వాక్‌కు బయల్దేరాడు అంబుజరావ్. పుట్టి బుద్దెరిగాక ఎప్పుడూ మార్నింగ్ వాక్ చేయలేదతను. ఓ చాట్ ఫ్రెండ్ 'నేను రోజూ యూనివర్శిటీ రోడ్డులో జాగింగ్ చేస్తాన'ని చెప్పింది. దాంతో ఆమె కనబడక పోతుందా... అని వాకింగ్ మొదలెట్టాడు.

అంబుజరావ్ నడుస్తూంటే పక్కింటాయన కూడా జాయన య్యాడు. ఇద్దరూ పిచ్చాపాటి మాట్లాడుకుంటూ వుండగానే ఓ వ్యక్తి వాళ్ళ వైపు చూసి 'హ్హిహ్హిహ్హి... ఓ మై చాట్... ఐ లవ్యు.... మనీషా కొయిరాల... మాధురి దీక్షిత్... ఐశ్వర్యరాయ్... యిలా పిచ్చి పిచ్చిగా మాట్లాడుతూ పళ్ళు యికిలించాడు.

"వీడెవడండీ బాబు" అంబుజరావ్ తల పట్టుకున్నాడు.

పక్కింటాయన ఓసారి ఆకాశం వంక చూసి ఓ నిట్టూర్పు విడిచి "ఈ పిచ్చివాడు ఆర్నెల్ల క్రితం పెద్ద బిజినెస్ మాగ్నెట్... బిజినెస్ ట్రేడింగ్ ఇంటర్ నెట్‌లో చూస్తూ బోర్ కొట్టినప్పుడల్లా సరదాగా ఛాటింగ్ మొదలెట్టాడు.

ఆ సరదా కాస్త దురదగా మారి బరబర గోక్కునే స్టేజికి వచ్చింది. రోజుకో చాట్ ఫ్రెండ్ పరిచయం.. పొద్దస్తమానం చాటింగ్ చేస్తూ... చేస్తూ... బిజినెస్ నిర్లక్ష్యం చేశాడు. దెబ్బతో బిజినెస్‌లో లాస్ కొంప కళాస్... ఆ చాట్ ఫ్రెండ్స్ కలుద్దామని చెప్పడం రోజుకొకర్ని చొప్పున కలవడం వాళ్ళ ఖర్చులతో పర్సు తడిసి మోపెడవటం, క్రెడిట్ కార్డులు లిమిట్ దాటిపోవటం చివరాఖరికి అతని ఆస్తులన్నీ కొట్టులో తాకట్టుకెళ్ళడం వరకూ వెళ్ళాయి. ప్చ్... ప్రస్తుతం ముష్టెత్తుకొని, ఆ డబ్బుల్తో కేఫ్‌కు వెళ్ళి చాటింగ్ చేసొస్తాడు.

అంబుజరావ్ ఉలిక్కిపడ్డాడు. అతనికి తన ఫ్యూచర్ బ్లాక్ అండ్ వైట్‌లో నీచ నికృష్టంగా

కనిపించింది. కానీ ఆ వెంటనే తన మోకాలి వంక చూసుకొని... తను టూ యింటలిజెంట్ కనుక ఫరవాలేదనుకున్నాడు.

****

సేమ్ డే ఈవినింగ్ అంబుజరావ్ తెగ హుషారుగా వున్నాడు.

... తన 'చాటీ' తో... హోటల్ కసాబసాలో రాత్రి ఎనిమిది గంటలకు క్యాండిల్ లైట్ డిన్నర్. అందుకే వన్ అవర్ ముందే పర్మిషన్ తీసుకున్నాడు.

ఇంటికెళ్ళి నాలుగు రకాల ఫెర్ఫ్యూమ్‌లు కంపుకొట్టే వరకూ స్ప్రే చేస్కొని బయలుదేరాడు హోటల్ కసాబసాకు.

* * *

హోటల్ కసాబిసా...

కార్నర్ టేబుల్ దగ్గర ఓ అమ్మాయి అటు తిరిగి కూచుంది. చుడీదార్‌లో భలే టెంప్టింగ్‌గా వుంది. చేతుల్లో షేక్ మొదలైందతనికి.... 'ధైర్యే సాహసే చాటీ' అంటూ మెల్లగా భుజమ్మీద చేయ్యేసాడు.

ఆ శాల్తీ వెనక్కి తిరిగింది. 'హాయ్ బాయ్యా' అంటూ. అంబుజరావ్‌కి కళ్ళు




వినిపించడం మానేశాయి. చెవులకి మాట పడిపోయింది. మెదడు ఒణుకు తోంది. ఒంటికి ఆలోచించే శక్తి నశించింది. ఇన్నాళ్ళూ తను చాటింగ్ చేసింది ఆడ మగా కాని ఈ మాడా టైప్‌తోనా?

'నేనే బాయ్యా నీ ఛాట్ ఫ్రెండ్"... అంది శాల్తీ మీది మీదికి వస్తూ...

సరిగ్గా అప్పుడే పూలరంగడి కజిన్స్‌లా క్లర్క్ కూర్మారావు, క్యాషియర్ కనకాచలం కూడా అక్కడికి వచ్చేరు.

'రండి బాయ్యలు... ఇదిగో అంబుజం బాయ్యా' అంటూ కనకాచలాన్ని కూర్మారావ్‌ని పట్టి లాగిందా శాల్తీ.

* * *

మరుసటి రోజు ఉదయం అంబుజరావు భార్యకు ఆమె ఫ్రెండ్ ఫోను చేసి చెప్పింది. "నువ్వు చెప్పినట్టే చేసాను. అనుకోకుండా నాతో చాటింగ్ చేసిన మీ ఆయనకు, ఆయన ఆఫీసులో పని చేసే ఫ్రెండ్స్‌కు నిన్న రాత్రి కసాబసాలో పిచ్చ లెవెల్లో ఫినిషింగ్ టచ్ యిప్పించాను. ఛస్తే చాటింగ్ చేయరిక".

"థాంక్యూ మై ఫ్రెండ్" అంది మిసెస్ అంబుజరావు.

---

Just for fun

# నువ్వు(లు) - నేను(లు)

- వి.వెంకటరావు

"ఏ సినిమాకెళ్ళార్రా" అడిగాడు సుబ్బారావు తమ్ముడు సత్యాన్నీ, వాడి ఫ్రెండ్ రాంబాబునీ.

"నేనా! నేనయితే - నీకు నేను, నాకు నువ్వు"

"మరి రాంబాబో"

"నాకు నువ్వు - నీకు నేను"

"రెండు ఒకటి కాదా"

"కాదు"

"అదేంటి ఒక్కలాగే ఉన్నాయి"

"అలాగే ఉంటాయిగానీ ఒక్కటి కాదు"

"మొన్న మూడు రోజుల క్రితం కూడా దీనికే వెళ్ళానన్నావు"

"అది నువ్వులేక నేనులేను"

"అది మొన్న టి.వి.లో వచ్చింది కదా!"

"మొన్న టి.వి.లో వచ్చింది అదికాదు. అది - నువ్వేకావాలి"

"కాదు... ఒక నువ్వూ, ఒక నేను" అని చెప్పింది అంతలో అక్కడకు వచ్చిన సుబ్బారావు కూతురు సుజాత.



"నీ మొఖం నువ్వు పుస్తకాలు చదివి చదివి అన్నిటిని కలిపేస్తున్నావు. ఒక నువ్వూ - ఒక నేనూ నవల, సినిమా లేదు".

"మరి ఆ మధ్య మన ఫ్యామిలీ మొత్తం కలిసి వెళ్లామే అదేం సినిమా" అందర్నీ ఉద్దేశించి అడిగాడు సుబ్బారావు.

"అది నువ్వే - నువ్వే"

"నువ్వే - నువ్వేకి వెళ్లింది అమ్మా నాన్న కలిసి, అందరం కలిసి వెళ్ళింది - నువ్వు నాకు నచ్చావ్ అది కూడా అందరం వెళ్లలేదు. టికెట్లు దొరక్క సగం మంది - నిను చూడక నేనుండలేను కి వెళ్లాం."

"మరి పక్క ఇంటి ఆదిలక్ష్మి నువ్వు కలిసి వెళ్లారే అదేం సినిమా" అడిగాడు సుబ్బారావు భార్యనుద్దేశించి.

"మేం వెళ్లింది - నీతోనే ఉంటా గానీ, 'నీకోసం వేచి ఉంటా' గానీ అవుతుంది" అన్నాడు జ్ఞాపకం తెచ్చుకోవడానికి ప్రయత్నిస్తూ.

"ఆ రెండూ కాదు -నీకోసం...." సవరించింది కూతురు సుజాత.

"ఏమిటో గందరగోళం... అచ్చమైన తెలుగు భాషే అయినా చైనా భాషలోలాగా డింగ్‌డాంగ్, పింగ్‌పాంగ్, చిన్‌చున్, చిన్‌చాయ్ ఎన్ని రకాలు ఉన్నా అని అన్నీ ఒక్కలాగే ఉన్నాయి ఈ నువ్వూలూ, నేనులూ"

తను తరుచూ చూసే సినిమాలనేసరికి కోపం వచ్చినట్లుంది సత్యానికి "నువ్వులూ ఏమిటి? నువ్వులూ, పెసలు లాగ, నువ్వుకి బహువచనం లేదు ఏకవచనమే.. నువ్వులట, నువ్వులు".

"తెలుసులే గానీ మన మాటల్లో పడి మరచిపోయినట్లున్నావు టికెట్లు దొరుకుతాయ లేదో త్వరగా వెళ్ళు"

"ఆఁ ఆ బాధేం లేదులే. 'నేనులేక నువ్వులేవు'కి దొరక్కపోతే పక్కహాల్లో ఉన్న 'నిన్నే ఇష్టపడ్డాను' ఉంది. దానికి దొరక్కపోతే దాని పక్కనే 'నిన్నే ప్రేమిస్తా' ఉంది. అదీకాకపోతే నువ్వు వస్తావని, నిన్నే పెళ్ళాడుతా, నీ ప్రేమకోసం, నేను పెళ్లికి రడీ, నీతో... నన్ను ప్రేమించు, నీకోసం వేచిఉంటా, నీకోసం కలలు కంటా, నీ మనస్సులో నేను, నీ నవ్వులో నేను, నీతోనే ఉంటా, నిన్ను చూడాలనీ, నవ్వు నవ్వితే చాలు, నువ్వు తుమ్మితే చాలు, నీ దగ్గు కోసం వేచి ఉంటా... ఇంకా చాలాచాలా ఉన్నాయి." అంటూ స్నేహితుడితో కలిసి బయటపడ్డాడు.

ఇవన్నీ నిజంగా సినిమా పేర్లేనా? లేక తమ్ముడికి కోపం వచ్చి తనతో హాస్యం ఆడుతున్నాడా? అనే సందేహం వచ్చి వెళుతున్న ఇద్దరు స్నేహితుల వైపు చూస్తూ అలాగే ఉండిపోయాడు సుబ్బారావు.



# అంతేరా... బామ్మర్ది



ఆదివిష్ణు





**జరిగిన కథ**

భాగ్యనగరంలోని ప్రముఖ పారిశ్రామికవేత్త బసవరాజు, జానకిల కూతురు ఉమ. కొడుకు మురళి. ఉమ ప్రియుడు వేణుకి నాగపూర్లో ఉద్యోగం వచ్చినా ఉమకోసం హైదరాబాదులోనే ఉద్యోగం కై చూస్తూంటాడు. అతని బావ రంగనాధం తన బాల్యమిత్రుడు బసవరాజును స్వయంగా కలిసి అడుగుతానంటాడు. ఈ లోపుల బసవరాజు పేపర్లో వార్తలు చదివి ఖంగారుపడి బావమరిదికై ఉద్యోగాలకోసం వచ్చే ఫ్రెండ్స్‌ను కలవకూడదని నిశ్చయించుకుంటాడు. అందుకే అతన్ని కలవడానికి వచ్చిన రంగనాధాన్ని చూడ నిరాకరిస్తాడు. కానీ తరువాత బాధపడతాడు. ఆ సంగతి తెలియని రంగనాధం బసవరాజుపై మండిపడుతూంటాడు. బావగారి పేరు చెప్పకుండా ఉద్యోగానికై వేణు డైరక్టుగా వెళతాడు. బసవరాజు అతన్ని చూసి ఇంప్రెస్ అయి ఉద్యోగం ఇస్తాడు. ఆ ఉద్యోగానికి ఒప్పుకున్నందుకు ఉగ్రుడైన రంగనాధం వేణుని ఇంట్లోంచి పొమ్మంటాడు. బసవరాజు అసిస్టెంట్ పాణి చదివి వినిపించిన ఓ వార్త వల్ల బసవరాజు విచిత్రంగా ప్రవర్తిస్తాడు.

-(ఇక చదవండి)

బసవరాజు గారి బంగళా...

బంగళాలో అందరూ విచారంగానే వున్నారు.

డాక్టర్ మురళి బాధగా అంటున్నాడు -

"ఎంతో ప్రేమగా స్వీట్స్ తీసుకెళ్లేను. నాన్నా తినమని ప్రాధేయపడ్డాను. నేను తెచ్చింది విషమనుకున్నాడో ఏమో? వద్దంటె వద్దని శివాలు తొక్కేడు. నా తల కొట్టేసినంత పనయ్యిందమ్మా! ఏమ్మా! నువ్వు చెప్పు! ఇదేమైనా బావుందా?"

"నీ సంగతి ఇట్లా అఘోరించింది! ఎంతో కాలంగా ఎంతో నమ్మకంగా మన దగ్గిర పనిచేస్తూ - మనల్నే నమ్ముకున్నాడు ఆ రంగడు! నిన్నూ ఉమని ఎత్తుకు పెంచేడ్రా! మనింటో మనిషిగా మనందర్తో కలిసిపోయేడు. అల్లాంటి విశ్వాసపాత్రుడ్ని - కారణం చెప్పకుండా - ఉద్యోగంలోంచి తీసేసేడు! దీనికేం చెబ్తావ్?"

"పాపం! రంగడు పిల్లలు గల వాడమ్మా!" అన్నది ఉమ.

"ఇదంతా చూస్తుంటే - మావయ్యగారి మెదడ్ని ఎవరో పనిగట్టుకుని పాడు చేస్తున్నట్టుంది అత్తయ్యా!" అన్నది పద్మ.

సడన్‌గా బసవరాజు తన గదిలోంచి బయటకు వచ్చేడు!

వచ్చి - అందర్నీ చూసి - ఎవర్తోనూ మాటాడకుండా - హాల్లో వున్న ఇంగ్లీషు పేపర్ తీసుకుని, మళ్లా తన గదిలోకి వెళ్లిపోయేడు!

అతను వెళ్లింతర్వాత డాక్టర్ మురళి తల్లితో అన్నాడు -

"ఆ వాలకం చూడమ్మా! ఏదో గెస్ట్ హవుస్లో వున్నట్టు ఆ స్టైయిల్ చూసేవా? ఇవాళ ఆదివారం. 'సెలవురోజు'. అందరం ఇంటో వున్నాం. ఒక మాటా పలుకు లేకుండా అంటీ అంటనట్టు తిరుగుతాడే."

"అసలేం జరిగిందో నన్ను వెళ్లి కనుక్కోమంటావా?" అడిగింది తల్లి.

"వద్దమ్మా! నాన్న అంత బెట్టుపోతుంటే - నువ్వెందుకు వెళ్లాలి? ఎందుకు పలకరించాలి?" అన్నది ఉమ.

డాక్టర్ మురళి ఒక నిర్ణయానికొచ్చి అన్నాడు -

"ఆల్‌రైట్! లంచ్‌టైం వరకు చూద్దాం! అప్పటిక్కూడా ఆయన ఇదే వరస కంటిన్యూ చేస్తే - అప్పుడే అడుగుతాను!"

"ఏవని అడుగుతారు?" అన్నదిపద్మ.

"ఎవరిమీద అలిగేడో - ఎవరిమీద కోపమో అడిగి తెలుసుకుంటా!"

"మీరొక్కరే అడిగి ఎందుకు చెడ్డ అనిపించుకోవాలి? అడిగేదేదో అందరం కలిసే అడుగుదాం!"

సరిగ్గా అప్పుడే -

ఆ బంగళాలోకి వేణు పరుగెత్తుకుంటూ వచ్చేడు!

అతను కొంచెం కంగారుగానే వున్నాడు!

అందరూ అతన్ని వింతగా చూస్తున్నారు!

"బాసెక్కడ!" వేణు అడిగేడు.

"ఆయన గదిలో వున్నారు!" అన్నాడు డాక్టర్ మురళి.

"కాసేపట్లో ఆ పాణిగాడు వస్తాడు!"

"వస్తే మనకే? అందుకంత ఖంగారెందుకు?" అని అడిగింది జానకి.

"మేడం ఇప్పుడు నన్నేమీ అడక్కండి! అన్ని విషయాలు మీకు తర్వాత చెబ్తా! ముందు నేను దాక్కోవాలి!"




"దాక్కోడమా? చిన్నపిల్లల ఆటలాగా - దాక్కోడమేమిటి?" ఉమ అడిగింది.

"అంతగా దాక్కోవాలంటే ఇంత పెద్ద బంగళాలో చోటే దొరకదా?" అన్నది పద్మ.

"నో! నేను - ఆయన గదిలోనే దాక్కోవాలి. ఆ పాణి గాడు తిన్నగా ఆయన గదిలోకే వెడతాడు!"

అని - అటూ ఇటూ చూచుకుంటో బసవరాజు గారి గదిలోకి దూరిపోయేడు వేణు!

క్షణం తర్వాత పాణి హాల్లోకి అడుగు పెట్టేడు.

"గుడ్ మార్నింగ్ ఎవ్విరిబడీ! బాస్?" అడిగేడు పాణి.

"ఆయన గదిలోనే వున్నారు!" అన్నాడు మురళి.

"థేంక్యూ!"

అని పేపర్తో పాణి బాస్ గదిలోకి నడిచేడు!

ఏదో జరగబోతోందని మిగతా వాళ్లంతా హాల్లోనే వుండిపోయేరు!

బసవరాజు గదిలో...

బాత్‌రూం నుంచి బసవరాజు బయటికి వచ్చేడు!

"గుడ్‌మార్నింగ్ సార్!" అన్నాడు పాణి!

ఆ గదిలో ఒక బీరువా చాటున నిలబడ్డ వేణు - బాసునీ పాణినీ శ్రద్ధగా గమనిస్తున్నాడు!

అంతే శ్రద్ధగా వాళ్ల మాటల్ని కూడా వింటున్నాడు!

బసవరాజు తన కుర్చీలో కూచుంటో పాణి చేతిలో వున్న పేపర్ని చూస్తో అడిగేడు -

"ఏం పేపరది?"

"బహార్!"

"బహారా?"

"గుజరాతీ డైలీ పేపర్ సార్! లార్జెస్ట్ సర్క్యులేటెడ్ డైలీ ఇన్ గుజరాత్!"

"ఊ చదువు!"

పాణి - గుజరాతీ పేపర్లోని ఒక వార్తని గబగబా చదివేసేడు.

చదివింతర్వాత బసవరాజుని అడిగేడు -

"మీకు అర్థమై వుండదనుకుంటాను సర్!"



"గుజరాతీ భాష కదా! అర్థమవడం అంత ఈజీ కాదు!"

"ఊరుగానీ పేరు గానీ లేకుండా - టూకీగా వార్త మాత్రమే చెబ్తాను సార్!"

"ఆ టైపులోనే చెప్పు! బావుంటుంది!"

"తన భర్తని - మావగారు అవమానించేరనే కోపంతో, ద్వేషంతో, కసితో - ఒక కోడలు పిల్ల - కాఫీలో విషం కలిపి - మావగారికిచ్చింది!"

ఆ వార్తకి తట్టుకోలేక అన్నాడు బసవరాజు -

"ఘోరం!మావగారంటే ఎవరయ్యా?"

"దేవుడు సార్!"

"దేవుడికంటే గొప్పవాడు తండ్రి! మావగార్ని తండ్రిగా భావించమన్నారు! ఇది మన తెలుగు సెంటిమెంటు!"

"గుజరాతీ సెంటిమెంటు కూడా - యించుమించు మన టైపే సార్!"

"అలాంటప్పుడు కాఫీలో విషం కలిపి మావగారికి ఎందుకిస్తుంది?"

"ఇక్కడ తమరు ఆమె భర్తని మరిచిపోయేరుసార్! మావగారికంటే భర్తే ముఖ్యమైనవాడు! అలాంటి భర్తని మావగారు అవమానించారనే కోపం సర్! ఇది గుజరాతీ సెంటి మెంటు!"




"భర్తని ఎంత అవమానిస్తే మాత్రం? మావని చంపుతుందా కోడలు?"

"కలికాలం సార్? ఈ కాలంలో ఎవ్వరూ రూల్సు పాటించరు! ఇవాల్టికి నా డ్యూటీ అయిపోయింది సార్? సెలవిప్పిస్తే వెళ్లొస్తా!"

"ఊ..."

"తమరు రెస్టు తీసుకోండి!"

అని బసవరాజుకి చేతులు జోడించి - ఆ గది నుంచి బయటపడుతున్నాడు!

గది నుంచి హాల్లోకి వచ్చిన పాణికి - ఇంటి జనాభా యావన్మందీ కనిపించేరు!

వాళ్లు తనని వింతగా చూస్తున్నారు!

పాణి కీడు శంకించేడు!

అంచేత అక్కడ్నించి ఎంత త్వరగా నిష్క్రమిస్తే అంత మంచిదనే ఉద్దేశంతో -

"అర్జంటు మీటింగు! అందుకే రెండు నిమిషాల్లో పూర్తయింది! వస్తానండి! నమస్కారం!"

అని అతను అక్కడ్నించి పారిపోయేడు! అతను వెళ్లిం తర్వాత వేణు అంటున్నాడు -

"అయ్‌పిటీ హిమ్!"

డాక్టర్ మురళి మంటమీద అన్నాడు -

"నో! అతని మీద జాలిపడొద్దు! పాపం తగులుకుంటుంది! అల్లాంటి వాడ్ని జాలిపడి విడిచిపెట్టకూడదు. షూట్ చేయాలి!"

ఆ మాట వినేసి - వేణు మెల్లిగా ఆ గది నుంచి తప్పించుకుని హాల్లోకి వెళ్లిపోతున్నాడు!

క్షణం తర్వాత బసవరాజు పాణిని పలకరించేడు -

"మిస్టర్ పాణీ!"

"అడగండి సార్!"

"దేశం చెడిపోతోంది!"

"ఆహా! ఏదో ఆఫ్టరాల్ ప్రశ్న అడుగుతారని అనుకున్నానే గాని - ఇంత అద్భుతమైన స్టేట్‌మెంట్ సెలవిస్తారని అనుకోలేదు!"

బసవరాజు పాణి మాటల్ని పట్టించుకోలేదు.

అంచేత తన ధోరణిలో చెప్పుకు పోతున్నాడు -

"ఎంతో గొప్పది మన దేశం! అంత గొప్ప దేశం ఈ స్థాయిలో చెడిపోతున్నందుకు బాధ పడుతున్నాను!"

"నేను కూడా అంతే సార్! గొప్ప వర్రీ అవుతున్నాను సర్!"




"ఎందుకు?"

"ఇంకా ఎందుకని అడుగుతారేమిటండి? మీరేగా చెప్పేరు! దిక్కుమాలిన వార్తలు చదివి నాన్న మెదడు పాడు చేయడం అతని హాబీ అని!"

"హాబీ కాదు! అది అతని వృత్తి! కేవలం వార్తలు చదివేందుకు అతన్ని మీ నాన్నగారు అపాయింట్ చేసేరు!"

"ఇదేం ఉద్యోగమండీ?"

"పేపరు రీడింగు ఆఫీసరు! పిఆర్వో!"

"ఇప్పుడు తెలిసిందండీ! ఇతను చదివే పాపిష్టి వార్తలతో చెట్టంతనాన్న బెదిరిపోతున్నాడు! ఏ దిక్కుమాలిన వార్తో విని - నేను తెచ్చిన స్వీట్సు వద్దంటే వద్దని నన్ను అవమానించేడు!"

వేణు డాక్టర్ మురళి భుజం తట్టి అన్నాడు -

"రిలాక్సు! తప్పంతా పాణి మీద నెట్టేయడం పెద్ద తప్పు! ప్రతిరోజూ ఎక్కాలు చదివి వినిపించండి - ఏడువేల జీతమిస్తానని మీరు పేపరు ప్రకటన ఇచ్చి చూడండి! మీ ఇంటి ముందు పెద్ద క్యూ - చాలా పెద్ద క్యూ వుంటుంది. ఆ క్యూలో - మీరెంతో అభిమానించే నేను కూడా వుంటాను!"

"వేణుగారూ?" అన్నాడు డాక్టరు మురళి నొచ్చుకుంటో!

"హు! నిరుద్యోగమండీ! దాని పవరు అల్లాంటిది! నిరుద్యోగం ఎంతటివాడినైనా పిచ్చివాడ్ని చేస్తుంది! పెద్దపెద్ద చదువులు చదివి కూడా - ఉద్యోగం దొరకని కారణంగా - ఎక్కాలు చదివే ఉద్యోగం నేనేకాదు! ఎవరైనా చేస్తారు! బతుకు తెరువు డాక్టర్! మీలాంటి కోటీశ్వరుల బలహీనతలే మాకు బతుకుమార్గం!"

ఇంత చెప్పినా డాక్టర్ మురళి రాజీపడలేకపోయేడు.

అంచేత కఠినంగానే అన్నాడు -

"ఆర్గ్యుమెంట్సు అనవసరం! ఆ పాణికి బుద్ధి చెప్పాల్సిందే!"

"అంతేగదా? ఆ పని నాకు విడిచి పెట్టండి! అంతకంటే ముందు - మీ నాన్నగార్ని బాగు చేయాలి? ఇంత పెద్ద దేశంలో ఎక్కడో ఏదో ఘోరం జరిగిందనే వార్తకి స్పందించి - అదే

ఘోరం తనక్కూడా జరిగే అవకాశ ముందనే భయంతో ఆత్మీయుల్ని దూరం చేసుకునే పెద్ద మనిషిని ఎట్లా బాగుచేయాలి? ఈ పాయింటు ఆలోచించండి! ఇదే ఆలోచించండి!"

జానకి కలగజేసుకుంది -

"ఆపాటి ఆలోచనలు మాకు రావు నాయనా! చచ్చి నీ కడుపున పుడతా - ఆ పనేదో నీ చేతుల మీదగానే జరిపించి పుణ్యం కట్టుకో!"

"అవును వేణుగారూ! మా ఇంటిల్లిపాది కోరిక కూడా అదే!" అన్నాడు డాక్టర్ మురళి. అంతలో పద్మ కాఫీ కప్పుతో రంగ ప్రవేశం చేసింది!

"ఆ కాఫీ నాన్నకేగా?"

పద్మ తల ఊపింది.

"గదిలో వున్నాడు. వెళ్లు!"

"భయంగా వుంది!" అన్నది పద్మ

వేణు సర్ది చెప్పేడు -

"జరగబోయే సీను మాతో పాటు మీక్కూడా తెలుసుగదా? భయమెందుకు మేడం? ప్లీజ్... వెళ్లండి!"

ఆమె అన్యమనస్కంగానే మావగారి గదిలోకి కాఫీ తీసుకెళ్లింది!

జరగబోయే రాద్ధాంతం కళ్లారా చూసేందుకు - జానకి, ఉమ, డాక్టర్ మురళి, వేణులు కిటికీల దగ్గర నిలబడ్డారు!

బసవరాజు గదిలో -

పద్మని చూస్తో అన్నాడు బసవరాజు -

"కాఫీ తెచ్చేవా అమ్మా! మంచిది! నీ చేత్తో యిచ్చిన కాఫీనే తాగుతానని ప్రామిస్ చేసేను గదా! ఇల్లాగివ్వు"

మావగారు మామూలుగానే మాటాడుతున్నందుకు పద్మ ఆశ్చర్యపోయింది!

కాఫీ కప్పు మామగారికిచ్చింది!

అడిగి మరీ కాఫీ కప్పు తీసుకున్నందుకు - కిటికీల దగ్గర నిలబడ్డ జనాభా కూడా ఒకరి మొహాలొకరు చూసుకుంటున్నారు!

బసవరాజు కోడల్తో అంటున్నాడు -

"నువ్వెళ్లమ్మా! నేను తాగుతాలే!"

ఆ హామీకి అసలైన అర్థం తెలీక - అయోమయంగానే ఆ గది నుంచి బయటకు వచ్చేసింది పద్మ!

ఆమె వెళ్లేక -

ఆమె ఇచ్చిన కాఫీని బేసిన్లో పోసి నీళ్లు వదుల్తున్నాడు బసవరాజు!

ఆ దృశ్యాన్ని కిటికీల ద్వారా చూసిన జనాభా విషాదంగా నిట్టూర్పులు విడుస్తున్నారు!

**-(ఇంకావుంది)**




# ఘంటసాల క్విజ్

**మొదటి బహుమతి : రూ. 250/-**
**రెండవ బహుమతి : రూ. 200/-**
**మూడవ బహుమతి : రూ. 150/-**
**మరియు ఘంటసాల కలర్ ఫోటో**

**క్విజ్ రూపకల్పన, సమర్పణ, నిర్వహణ**
డా॥ కె.వి.రావు,
వ్యవస్థాపకులు,
పద్మశ్రీ ఘంటసాల గానసభ,
28, 1-1-79, ఆర్టీసీ క్రాస్‌రోడ్స్,
హైదరాబాద్ - 500 020.



## క్విజ్‌నెం-10

1. పాతాళభైరవిలోని 'ఎంతఘాటు ప్రేమయో' పాట రచయిత?

జ: ..............................

2. కీలుగుఱ్ఱంలోని 'కాదు సుమా కల కాదు సుమా' యుగళగీతంలో ఘంటసాలతో పాడిన గాయనీమణి పేరు?

జ: ..............................

3. ఘంటసాల, కె.రాణి కలిసి పాడిన తొలి చిత్రం?

జ: ..............................

4. ఘంటసాల సంగీతంలో వి.జె.వర్మ పాడిన తొలి చిత్రం?

జ: ..............................

5. ఎన్.టి.ఆర్, రేలంగి నటించిన ఓ చిత్రంలో ఘంటసాల రేలంగికి మాత్రమే పాడారు. ఆ చిత్రం పేరు?

జ: ..............................

పంపినవారి పేరు : ______________________

చిరునామా : ______________________

**నిబంధనలు:**

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పక్కన ప్రచురించిన కూపన్ మాత్రమే నింపి కవరులో పంపాలి. కూపన్ కాకుండా మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై **'ఘంటసాల క్విజ్'** అంటూ పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ప్రకటించిన బహుమతులను నగదుగా గాని, ఆడియో క్యాసెట్లుగా గాని, సీడీలుగా గాని విజేతలకు 'పద్మశ్రీ ఘంటసాల గానసభ - హైదరాబాద్' వారిచే నేరుగా పంపటం జరుగుతుంది.

డి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే తుది నిర్ణయం 'పద్మశ్రీ ఘంటసాల గాన సభ' వారిదే!

ఇ) ధారావాహికంగా కొనసాగే ఈ క్విజ్ పోటీలలో ఏ కేటగిరీలోనైనా వరసగా 5 సార్లు విజేతగా ఎన్నికైనవారికి ఓ ప్రముఖవ్యక్తి ద్వారా హైదరాబాద్‌లో మరొక ఆకర్షణీయమైన బహుమతిని అందజేయటం జరుగుతుంది.

**కూపన్‌లు 30-9-2003 లోగా చేరాలి**

**కూపన్‌లు పంపవలసిన అడ్రసు**
'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.

## కొంటెకొశ్చెన్లు - తుంటరి జవాబులు




**రమణశాస్త్రి, సంగారెడ్డి**

ప్ర: రెండో కంటికి తెలియకుండా పనిచేయటం ఎలా?

జ: మెల్ల కన్ను పెట్టి

ప్ర: ఇళ్ళల్లో కుక్కల్ని ఎందుకు పెంచుతారు?

జ: అరిచి దొంగల్ని - కరిచి చుట్టాల్ని తరమడానికి

ప్ర: నాకు తెలిసిన ఓ బారు ఓనరు తన కారుని చాలా చవగ్గా అమ్మేస్తానంటున్నాడు.... కొనచ్చా?

జ: చవకబారు కారు అంటారేమో ఆలోచించండి.

## ఈ రూటేవేరు




| | | |
|---|---|---|
| Moon Light eye | = | వెన్నెలకంటి |
| Single Tooth | = | ఏక దంతం |
| | | - టి.యస్.ప్రసాద్, విశాఖపట్నం |
| Good Juice | = | సరసం |
| | | - మామడి శ్రీలత, పూణే |



## పేరు - లిపేరు




ఇడియట్ - ఐ లవ్ యు రా

- ఎమ్.వి.యస్.యస్.జగదీష్

ఒట్టేసి చెపుతున్నా - పెళ్ళాం ఊరెళితే - నిను చూడక నేనుండలేను

- తెలికిచెర్ల రామకృష్ణ, విజయనగరం.

తోడికోడళ్ళు - కలసివుంటే కలదు సుఖం

- ఉషా సుజాత, హైద్రాబాద్.

## చిలిపి లిపి

Time Pregnency

కాల గర్భం

Foot Juice

పాదరసం

Ghost Time

భూత కాలం

-బద్ది నాగేశ్వరరావు, అనకాపల్లి.



## డబుల్ రోల్




'జలజ' కళ్ళ నుండి కన్నీళ్ళు
'జలజలా' రాలేయి

- బి.విశ్వజ, హైదరాబాద్.

'నే తలు'చుకుంటే ఎంతటి
'నేతలు' అయినా దిగిరావల్సిందే

'ఆవాలు' కొన్నది 'ఆ వాలు' కనుల
చిన్నదే

- టి.యల్. ప్రసాద్,
విశాఖపట్నం.

## పేరడీ పేరేడ్




ప: పర పర చికెనును కొరుకుతు వుంటే
బిరియానీ తోడుగ వుంటే
ఫట్ ఫట్ మంటూ గ్లాసులు కలిపి
పెగ్గులు వరసగ బిగియిస్తుంటే
చెప్పలేని ఆ హాయి ఎంతో థ్రిల్లుగ వుంటుందోయి
చెప్పలేని ఆ హాయి ఎంతో థ్రిల్లుగ వుంటుందోయి

ప: బుస బుస సోడా పొంగుతు వుంటే
కసి కసి కసిగా మింగుతు వుంటే
మసక వెలుగులో 'మధువని' బార్లో
మత్తుగ మైకం కమ్ముతు వుంటే
చెప్పలేని ఆ హాయి ఎంతో థ్రిల్లుగ వుంటుందోయి
చెప్పలేని ఆ హాయి ఎంతో థ్రిల్లుగ వుంటుందోయి

1చ: బారు మూతపడు టైమవుతుంటే... టైమవుతుంటే... ఓ....
బార్లో ఎవడూ కనబడకుంటే... కనబడకుంటే.... ॥బారు॥
లోపల వున్నది నేనొక్కడినే
లోపల వున్నది నేనొక్కడినే
అనుకొని అక్కడ కునికేస్తే....
చెప్పలేని ఆ హాయి ఎంతో థ్రిల్లుగ వుంటుందోయి
చెప్పలేని ఆ హాయి ఎంతో థ్రిల్లుగ వుంటుందోయి

2చ: తడితడిగా అనిపిస్తుంటే ఆహా హా హా
పడిలేచి పాకుతువుంటే ఓహెూ హెూ హెూ ॥తడి॥
చిరు చీకటిలో ఎవరో తిడుతూ
చిరు చీకటిలో ఎవరో తిడుతూ
ఇంటికి మనలను చేరేస్తే....
చెప్పలేని ఆ హాయి ఎంతో థ్రిల్లుగ వుంటుందోయి
చెప్పలేని ఆ హాయి ఎంతో థ్రిల్లు వుంటుందోయి ॥పర పర॥

-తాళాభక్తుల లక్ష్మీప్రసాద్, విశాఖపట్నం.

(ఆత్మబలం చిత్రంలో "చిట పట చినుకులు పడుతూ వుంటే" పాటకు పేరడీగా)

## షార్ట్‌కట్స్




| | | |
|---|---|---|
| కోగంటి కావ్య కోమలాక్షి | = | కోకాకోలా |
| తోట కమలాకర్ | = | తోక |
| చిక్కాల లక్ష్మీ కల్పన | = | చిలక |

- బి.శ్రీనివాసాచారి, హైద్రాబాద్.

| | | |
|---|---|---|
| మానికొండ యతిరాజులు | = | మాయ |
| టక్కుల పాపారావు | = | టపా |
| పచ్చిపులుసు గన్నయ్య | = | పగ |

- మహేంద్రాడ చలం, టెక్కలి.

## చిలిపి కవిత




పొట్టలో ప్రొడ్యూసవుతూ వుంటుంది గ్యాస్
ఒంట్లో వుత్పత్తవుతూ వుంటుంది షుగర్
రక్తప్రసరణ ఓ నయాగరా జలపాతం
బట్ట తలొక దివ్య దర్పణం
అన్నీ తిందామంటే అజీర్తి
ఇక ఏ విషయంలోనైనా ఎందుకుంటుంది కక్కుర్తి?

- తెలికిచెర్ల రామకృష్ణ, విజయనగరం.

# సరిగపదమని ఫలితాలు 1

ప్రముఖ సంగీత దర్శకుడు శ్రీ కీరవాణి ఈ పజిల్ ఫలితాలను డ్రా తీయడానికి అంగీకరించినందుకు 'హాసం' కృతజ్ఞతలు.



కూపన్లను పరిశీలిస్తున్న శ్రీ కీరవాణి, ఆయన సహాయకుడు జెమినీరావు



ఎంపిక చేసిన కూపన్లతో శ్రీ కీరవాణి

## డ్రాలో గెలుపొందిన వారు

మొదటి బహుమతి : కె.సురేష్‌కుమార్, చీరాల.

రెండవ బహుమతి : ఎం.గోపాలకృష్ణ, నరసరావుపేట.

మూడవ బహుమతి : పి.వైష్ణవి & ఎన్.ఐశ్వర్య, పేరూరు, అమలాపురం.

కన్సొలేషన్ బహుమతి : పి.షర్మిళా ఋషి, చింతల అగ్రహారం.

### జవాబులు

**అడ్డం:** 1.కీరవాణి 3.ఇదాలోకం 7.గుడి 8.భువన 9.రేకో 12.జగదేకవీరుడు 15.కళ్ళు 18.తోట 19.లేవరా 20.రహస్యం 21.మల్లెమాల

**నిలువు:** 1.కీలుగుఱ్ఱం 2.వాసు 4.దాన 5.కంచుకోట 6.శివశంకరి 10.వగల 11.వురుడు 13.ఏకవీర 14.ఘంటసాల 16.ఏలే 17.శ్రీరామ (ఓరామ)



ప్రస్తుతం వస్తున్న పత్రికలలో 'హాసం' మా యింటిల్లిపాదికి ఎంతో అభిమానమైనది. సరిగపదమని-1లో నాకు మొదటి బహుమతి వచ్చినందుకు చాలా సంతోషంగా ఉంది. 'హాసం'కు నా కృతజ్ఞతలు.

**- కె.సురేష్‌కుమార్, చీరాల.**



మాకు కన్సొలేషన్ బహుమతి వచ్చినందుకు సంతోషం. మేము మా పాప పేరుతో కూపన్ పంపించాము. కీరవాణి గారు డ్రా తీయడం మరింత ఆనందకరం. మా అభిమాన సంగీత దర్శకులు ఇళయరాజా, కీరవాణి. హాసం పత్రికను మొదటి ప్రతి నుంచి భద్రంగా దాచుకుంటున్నాము. మాలాంటి వారికి ఎంతో ఊరట కలిగించే ఈ హాస్య, సంగీత, సినీ పత్రిక - మాకు చాలా ఆహ్లాదాన్ని ఆనందాన్ని కల్గించే పత్రిక. పూర్వం 'విజయచిత్ర' ఉండేది. ఆ పత్రిక లేని లోటును, ఈ హాసం పత్రిక తీర్చుతోంది. ప్రతి తెలుగు ఇంటిలో ఉండవలసిన పత్రిక 'హాసం'.

**- పి.షణ్ముగం, పి.సునీత (షర్మిళా ఋషి తల్లిదండ్రులు)**
**చింతల అగ్రహారం గ్రామం - వేపగుంట పోస్ట్ -**
**పెందుర్తి మండలం - విశాఖపట్నం**



'హాసం' ఎడిటర్ గారు పంపిన టెలిగ్రామ్ అందినది. 'సరిగపదమని' క్విజ్ నంబర్ -1లో నన్ను ద్వితీయ విజేతగా ఎంపికచేసినందుకు ఆనందంతో ఉక్కిరిబిక్కిరి అయ్యాను. ఆ ఆనందం ఒక ఎత్తయితే ఎడిటర్‌గారితో ఫోన్లో స్వయంగా మాట్లాడటం మరొక ఎత్తు. నేను వృత్తిరిత్యా టీచర్ని. ఉపాధ్యాయ దినోత్సవం సందర్భంగా నాకు మా విద్యార్థులు ఇచ్చిన బహుమతి కంటే 'హాసం' ద్వారా లభించిన ఈ అమూల్యమైన బహుమతి ఎంతో విలువైనదిగా భావిస్తున్నాను. నేను ఎంతో అభిమానించే మధుర గాయకులు ఘంటసాల గారి మధుర గీతాల క్యాసెట్ 'ఆయన గానం ఆమెకు ప్రాణం' ను బహుమతిగా అందుకో బోవటం ఒక అరుదైన అనుభూతి. శ్రీమతి సావిత్రి గారిచే ఎంపిక చేయబడిన మధుర గీతాల క్యాసెట్‌ను నేను జీవితాంతం భద్రపరుచుకుంటాను. నేను 'హాసం' రెగ్యులర్‌గా చదువుతున్నాను. అన్ని శీర్షికలు, సీరియల్స్, అరుదైన ఫోటోలు అద్భుతంగా ఉంటున్నాయి. 'హాసం'లో నా ఫోటో చూసుకోవటం వాహ్... ఎంతో అద్భుతం.

**- ఎం. గోపాలకృష్ణ, నరసరావుపేట, గుంటూరు జిల్లా.**

డ్రా ఫలితాల గురించి మూడవ బహుమతి గ్రహీతలకు ఫోన్ ద్వారా తెలియజేయడం జరిగింది. ఈ సంచిక ప్రింటింగ్‌కి పంపే సమయం వరకు వారి వద్ద నుండి ఫోటో గాని, ఉత్తరం గానీ రానందున ప్రచురించలేక పోతున్నాము.

**- ఎడిటర్.**

## కరెక్టు సమాధానాలు వ్రాసిన వారి పేర్లు

శ్రీపాద వసుంధర- హైదరాబాద్, నందిపాటి వెంకటేశ్వరరావు - గుంటూరు, ఆర్.విజయలక్ష్మి - హైదరాబాద్, యు.యు.యు. - ఎమ్మిగనూరు, సుస్మిత్.ఎ.వి.ఎస్.ఆర్ - కాకినాడ, పుల్లాబొట్ల ఉమాకళ్యాణి - కొంతమూరు, ఎ.వి.ఆర్.రాజేశ్వర రావు - సికింద్రాబాద్, మాదిరాజు - హైదరాబాద్, తాతాపద్మావతి - విశాఖపట్నం, జి.జయరాజ్ - ఎర్రగుంట్ల(కడప), తాడి రంగారావు - రాజమండ్రి, ఎ.ఆదినారాయణ - పోతవరం(గుంటూరు జిల్లా), జి.ఎస్.భాస్కర రావు - హన్మకొండ, ఎన్.శేషగిరిరావు - కోదాడ, తనికెళ్ళ రామకృష్ణ - విజయవాడ, బైర్రాజు చంద్రకళ- హైదరాబాద్, వి.కృష్ణకుమారి - హైదరాబాద్, ఉపాధ్యాయుల రమాకుమారి - జైపూర్(ఒరిస్సా), ఎమ్.లక్ష్మి సుజాత - గుడివాడ, చవిటిపల్లి త్రిమూర్తులు - నరేంద్రపురం (తూ.గో.జిల్లా), ఎమ్.గోపాలకృష్ణ - ఒంగోలు, వి.మీనాక్షి - చిలంకూర్ (కడప జిల్లా), శిష్టా మాధవి - నర్సాపురం (ప.గో.జిల్లా), కె.వెంకటేశ్వర రావు - విజయవాడ, వెంకట సుబ్బరావు ఓలేటి - విజయవాడ, పఠానేని అన్నపూర్ణ - హైదరాబాద్, ఎమ్.అప్పారావు - అనకాపల్లి, సి.హెచ్.ఎన్.శ్రీనివాస్ - రాజమండ్రి, జి.భోగేశ్వర రావు - విశాఖపట్నం, జి.గాయత్రి - విశాఖపట్టణం, దేవరం సతీష్‌కుమార్ - జగిత్యాల, ఎన్.సమత - సికింద్రాబాద్, యం.సాయిబాబు - హైదరాబాద్, కె.బి.కైలాస్‌నాథ్ - అనంతపురం, జి.పాండురంగ శర్మ - హైదరాబాద్, వి.రజిత - హైదరాబాద్, ఎన్.శంకరాచార్యులు - హైదరాబాద్, వి.కృష్ణవేణి - ఉయ్యూరు, పి.స్వాతి - చీపురుపల్లి (విజయనగరం జిల్లా), పి.నాగరాజేశ్వరశర్మ - కొత్తపల్లి (కరీంనగర్ జిల్లా), మంత్రి లక్ష్మీనారాయణ - సిరిసిల్ల, బలుపరి విజయ్ - పెబ్బేరు (మహబూబ్‌నగర్ జిల్లా), ఆత్మూరి అన్నపూర్ణ - హైదరాబాద్, కొండుపర్తి జగదాంబ - సికింద్రాబాద్, వై.ఇ.ఎ.నారాయణరావు - శ్రీకాకుళం, జె.నాగేష్ - హైదరాబాద్, పి.వి.ఆర్.యస్.కిరణ్‌కుమార్ - నరసాపురం (ప.గో.జిల్లా), సి.విజయ సారథి - శ్రీరామనగర్ (కర్నూలు జిల్లా). డి.మల్లిఖార్జున్ - శ్రీపతినగర్ (ఆదిలాబాద్ జిల్లా). బి.శృతి - హైదరాబాద్, జి.ఎస్.ఎస్.సాయి - హైదరాబాద్, వి.మధుకృష్ణ - విజయవాడ, వానపల్లి గంగరాజు - విశాఖపట్నం, పి.జె.డి.రాజు - అచ్చంపేట్, పి.పాపారావు- విశాఖపట్నం, యస్.వి.నాగభూషణం- హైదరాబాద్, ఎమ్.వి.తేజస్విని- విద్యానగర్ (కర్నూలు జిల్లా), సి.హెచ్.సూర్యారావు-చీపురుపల్లి (విజయనగరం జిల్లా), టి.భాస్కరరావు - తిరుపతి, బి.వి,రమణమూర్తి & సత్యవాణి - హైదరాబాద్, సి.నళినీకుమారి - సికింద్రాబాద్, ఎన్.లలితా త్రిపుర సుందరి - విశాఖపట్నం, కె.జగన్నాథ రావు - టాటానగర్ (జార్ఖండ్), ఎ.టి.శ్రీనివాసన్ - అనంతపురం, ఎ.బల్నత్ - నిజామాబాద్, సోమయాజుల సాయిప్రసాద్ - ఒనక డిల్లీ(ఒరిస్సా), కె.సునితా - ఖమ్మం, నాగరాజేశ్వరరావు.సి.హెచ్ - విశాఖపట్నం, డి.వెంకటరావు - సాలూరు (విజయనగరం జిల్లా). ఆర్.శ్రీనివాస్ - బెంగూళూరు, చందలూరి ఆంజనేయశాస్త్రి - కాకినాడ, పి.మధు - విజయనగరం, బి.వేంకటేశం గౌడ్ - హైదరాబాద్, ఎమ్.ఎన్.వి.ప్రసాద రావు - రాజమండ్రి, ఎన్.రమాదేవి - శివునిపల్లి (వరంగల్ జిల్లా), యశ్వంత్ ఆలూరు - కడవ, జి.నోబుల్ వాణి - గణపవరం (ప.గో.జిల్లా), కిశోర్‌కుమార్.ఆర్ - గోదావరిఖని, ఎస్.నాగబాబు - హైదరాబాద్, వై.వి.ఎస్.సత్యనారాయణ - కాకినాడ, ఎస్.వి.ఆర్.శ్రీనివాస మూర్తి - హైదరాబాద్, కూచికార్తీక వర్ధని- హైదరాబాద్, యుమ్మిని సత్యనారాయణమూర్తి - థానే జిల్లా, మహారాష్ట్ర, పి.దుర్గాకుమారి - గుంటూరు, జె.లక్ష్మి - సికింద్రాబాద్, వై.యస్.ఎజగమణి హైటరాబాద్ పి.లక్ష్మిప్రసాద్ - సికింద్రాబాదు, మామిడి మునిశ్రీలత - పూణె, ఆర్.ఎన్.పి.అపర్ణ - హైదరాబాద్, జి.వసంత లక్ష్మి - థానే(వె) (మహారాష్ట్ర), రామనుజం టి.వి.ఎస్.ఆర్ - జగ్గయ్యపేట్, టి.రామలక్షణాచార్యులు - ఆరుగొలను (కృష్ణా జిల్లా), వెంపటి సుధాప్రసన్న - హైదరాబాద్, పి.ఎన్.వి.సావిత్రి - హైదరాబాద్, మల్లిడి దుర్గా ప్రసాద్ రెడ్డి - రామవరం (తూ.గో.జిల్లా), ఎ.వి.ఎస్.ఎస్.శర్మ - ఒంగోలు, తారా దీప్తి - పూణె, డి.లక్ష్మి - తణుకు, శ్రీహర్షిత.యన్ - అనంతపురం, ఇ.బి.ఎస్.శర్మ - తిరుచ్చి, ఎస్.హిమబిందు - జైపూర్ (ఒరిస్సా), గుండాల రాజ్యలక్ష్మి - విజయనగరం, సి.సి.ఎ.ఆర్.ప్రసాద్ - ఒంగోలు, బి.గోవర్ధన్ - కడప, ఎ.అపూర్వ - ఖమ్మం, ఎమ్.శ్యామ్‌ప్రసాద్ - నెల్లూరు, తెలికిచెర్ల రామకృష్ణ - విజయనగరం, కందుకూరి శివరామకృష్ణ ప్రసాద్ - హైదరాబాద్, తాతిరాజు జగన్ - బెర్‌హంపుర్ (ఒరిస్సా), వి.ప్రమీలా కుమారి - చెన్నై, ఎస్.అన్నపూర్ణ - సికింద్రాబాద్, నల్లమిల్లి రామకృష్ణారెడ్డి - కుతుకులూరు (తూ.గో.జిల్లా), మల్లిడి విజయ భాస్కర్‌రెడ్డి - కుతుకులూరు (తూ.గో.జిల్లా), జి.వసంతలక్ష్మి - హైదరాబాద్, తురుమెళ్ళ నాగలక్ష్మి లత - నెల్లూరు, టి.కె.వెణుగోపాల్ - హైదరాబాద్, ఎన్.ఎస్.జ్యోతిర్మయి - విజయనగరం, ఆర్.ఉదయశ్రీ - హైదరాబాద్, తాతిరాజు రమణి - బెర్‌హంపుర్ (ఒరిస్సా). తాటిపాముల మెహర్‌కుమార్ - లింగంపల్లి (నిజామాబాద్ జిల్లా), డి.కృష్ణా సాండిల్య - హైదరాబాద్, ఎస్.సితామహాలక్ష్మి - హైదరాబాద్, కొమరవెల్లి సరస్వతి - హైదరాబాద్, బి.వి.కిరణ్ కుమార్ - హైదరాబాద్, యు.విజయశేఖర రెడ్డి - హైదరాబాద్, అగ్నిహోత్రం లక్ష్మణకుమార్ - హైదరాబాద్, ఆయి.మధురనాథ్ - నంద్యాల, బి.ఎన్.రావు - వరంగల్, చల్లా సుబ్బలక్ష్మి - అత్తిలి, గేదెల రామరావు - ఏలూరు, బల్లా పల్లవి - విశాఖపట్నం, కాద సుదర్శనరావు - శ్రీకాకుళం, ఎన్.ఎస్.కృష్ణమూర్తి - సికింద్రాబాద్, ఎ.రవి ప్రకాష్ - హైదరాబాద్, గంగారపు వెంకట్రావు - సత్తెనపల్లి, పి.రోహిణి శ్రీకృష్ణప్రియ - నర్సాపురం (ప.గో.జిల్లా), పింగళి కనకవల్లి - హైదరాబాద్, ఎ.టి.కాశీనాథ్ - హైదరాబాద్, కె.వి.సాయిలక్ష్మి - హైదరాబాద్, జె.శ్రీనివాస్ - సత్తెనపల్లి, వై.రోసి రెడ్డి - సత్తెనపల్లి, అడ్డాల మణికుమారి - గుంటూరు, బెల్లంకొండ రాంబాబు - పమిడిపాడు (గుంటూరు జిల్లా), జె.వంశీధర్ - పిఠాపురం, జి.రాములు - గొల్లపుడి (కృష్ణా జిల్లా), డా॥స. రహమతుల్లా - పర్లాకిమిడి (ఒరిస్సా). మద్ది త్యాగరాజు - నరసన్నపేట, డి.ఎస్.శంకర్ - వక్కలంక (తూ.గో.జిల్లా), వై.చైతన్య స్రవంతి - మార్కపూర్ (ప్రకాశం జిల్లా), షబానాభాను - కాకినాడ, డి.ఎస్.ఆర్.ప్రసాద్ - సికింద్రాబాద్, ఇ.నాగేశ్వర రావు - హైదరాబాద్, పి.మనోహర్- యర్రగుంట్ల (కర్నూలు జిల్లా). కొత్తపల్లి జేజిబాబు - మచిలీపట్నం, రాఘవేంద్ర శ్రీనివాస్ - మచిలీపట్నం, ఎమ్.మణిబాబు - హైదరాబాద్, దోనెపూడి నాగ సౌజన్య- విశాఖపట్నం, ఎస్.వి.చంద్రశేఖర్ - నగరి (చిత్తూరు జిల్లా), బి.ఇ. శ్రీనివాసమూర్తి - అనంతపురం, వి.శ్రీనివాస రావు - హైదరాబాద్, వై.భానుప్రసాద్ - కర్నూలు, పి.వంశీకృష్ణ - నెల్లూరు, మట్టిపల్లి పూర్ణచంద్ర రావు - హైదరాబాద్, కె.వి.ఎన్.పల్లవి - కావలి, యం.రాజ్‌కుమార్ - హైదరాబాద్, యన్.యస్.ప్రసాద్ - విజయవాడ, ఎ.సాయిలీల - రేపల్లె, ముప్పిరాల శశాంక - హైదరాబాద్, టి.ధనుంజయరావు - అవని గడ్డ, కొదిగెనహాళి రాధాకృష్ణ - మదనపల్లె, బియ్యపు రాజని సాయి కృష్ణ - హైదరాబాద్, ఎన్.జగన్మోహనరావు - కరీంనగర్, వి.లక్ష్మీనారాయణరావు - రాజమండ్రి, కె.వి.సంజీవ రావు - జగ్గయ్యపేట, బి.రామశేషు & బి.ఎన్.రమ్యశ్రీ - హైదరాబాద్, ఎన్.కె.నాగేశ్వర రావు - పెనుగొండ, ఎం.కాశీ విశ్వేశ్వరరావు - పెనుగొండ, ఎన్.ఎస్.ఎస్.ఎస్.లక్ష్మి - రాజమండ్రి, ఆర్.వి.వి.కృష్ణ - హైదరాబాద్, బద్వేలి రమేష్ - అనంతపురం, కె.వి.ఎన్.పి.సాయి సౌమ్య - నెల్లూరు, ఎన్.వి.శేషగిరి- విశాఖపట్నం, టి.కుమార స్వామి - కర్నూలు.

## ఒక తప్పుతో వ్రాసిన వారి పేర్లు

పి.బాలత్రిపుర సుందరి - రాజమండ్రి, గాదె రంగనాయకమ్మ - జంగారెడ్డిగూడెం, శ్రీవల్లి.కె - తెనాలి, కీర్తి నాగబాబు - ఏలూరు, బి.పద్మావతి - సాలూరు (విజయనగరం జిల్లా). గంటి పద్మజ - అశ్వాపురము (ఖమ్మం జిల్లా), యమ్.లక్ష్మి - విజయనగరం, డి.వి.ప్రసాద్ - విజయవాడ, పి.చిన్నిస్వామి - జగ్గయ్యపేట, సాయిబాబు తాయి - రాజమండ్రి, కె.రవికుమార్ - రాజమండ్రి, వి.వి.టి.శేషశ్రీ - శ్రీకాకుళం, జె.జయలక్ష్మి - ఇబ్రహింపట్నం (కృష్ణా జిల్లా), కవిరాట్ మురళి - విజయవాడ, ఎన్.వి.కె.శాస్త్రి - కంచిలి (శ్రీకాకుళం జిల్లా), శిష్టా సాంబశివరావు - ఘట్‌కేసర్ (రంగారెడ్డి జిల్లా), జి.వి.రమణ - సంగారెడ్డి, వి.చంద్రకుమారి - హైదరాబాద్, వి.అమృతవల్లి - హైదరాబాద్, ఎస్.శివసాయి తేజ - ఘట్‌కేసర్ (రంగారెడ్డి జిల్లా), కె.నరసింహ మూర్తి - నిజామాబాద్, కె.హిమబిందు - విశాఖపట్నం, కొడాలి లలితాశ్రీ - విజయనగరం, లలితా ప్రసాద్ - హైదరాబాద్, పి.వి.ఎల్.ప్రశాంతి - హైదరాబాద్, మాద్రవీనారయణన్ - విశాఖపట్నం, ఎం.హరిశ్చంద్రరెడ్డి - రాజమండ్రి, చింతలపాటి లక్ష్మి శైలజ - విజయవాడ, వి.వీణమాధురి - హైదరాబాద్, వి.పి.చందన్ రావు - నిజామాబాద్, కె.శంకర నారయణ - హైదరాబాద్, వి.భాస్కర్ - హైదరాబాద్, ఒరుగంటి శ్రీకాంత్ - త్యాల్లురు, ఇ.మురళి కుమారి - చిత్తూరు, జోశ్యుల మోహన్ - నెగ్గిపూడి (ప.గో.జిల్లా), నృసింహదేవర శ్రీనివాసశర్మ - యానాం (తూ.గో.జిల్లా), కె.రాజేంద్ర - జగ్గయ్యపేట (కృష్ణాజిల్లా).

## రెండు తప్పులతో వ్రాసిన వారి పేర్లు

కె.కె.రావు - రాంచి, జి.రామనందరెడ్డి - పూణె, డా॥ ఆర్.ఎమ్.కె.గాంధీ - రాజమండ్రి, వి.వి.కళ్యాణి - నెల్లూరు, మరువాడ కామేశ్వరరావు - మంచిర్యాల.

## మూడు తప్పులతో వ్రాసిన వారి పేర్లు

ఎమ్.లీలావతి - సిద్లఘట్ట (కర్ణాటక), ఇలపావులూరి శేషతల్పశాయి - అద్దంకి, యం.నాగేంద్రం - నాగర్ కర్నూలు.

పైన ఉదహరించిన వారు మాత్రమే కాకుండా మూడు తప్పులకు మించి కూడా కూపన్లు పంపినవారెందరో ఉన్నారు. ఈ పజిల్‌కు ఆనందభరితుడై తన కూపన్‌ను పంపే కవరుపై 'సరిగపదమని నెం-1' ను ప్రచురించిన కవర్ పేజీపై గల ఫోటోను రేఖా చిత్రంగా గీసి పంపిన కె.సుదర్శనరావు (3-8-90, గాజులవీధి, శ్రీకాకుళం) గారికి, కూపన్లు నింపి పంపిన ప్రతి ఒక్కరికీ 'హాసం' కృతజ్ఞతలు తెలుపుకుంటోంది.





సప్తస్వర సుందరి



# లతా మంగేష్కర్



ప్రఖ్యాత నేపథ్య గాయకుడు,
బహుభాషా కోవిదుడు, కవి, రచయిత
'కళైమామణి', 'గానకళా సార్వభౌమ' బిరుదాంకితులు
**డా॥ పి.బి.శ్రీనివాస్**
'కోసం' పాఠకుల కోసం
తన అభిమాన గాయని జీవిత చరిత్రను
అక్షరబద్ధం చేస్తున్న సీరియల్ ఇది

ప్రారంభదశలోనే లతా ప్రతిభని గుర్తించి, తగిన ప్రోత్సాహాన్ని ఇచ్చిన ఆర్.కె.సంస్థ గురించి చెప్పుకోవడానికి ఎంతో ఉంది. సాంగ్స్ సెలక్షన్లో రాజ్‌కపూర్ సామర్థ్యం లోకవిదితం. ఆయన ఎన్నుకున్న ఏ గీతమూ వమ్ము కాలేదు సరికదా, సరికొత్త దాఖలాలు సృజించ గలిగేది. 'అందాజ్' లో లతా పాడిన పాటలు విని విస్మితుడైన రాజ్‌కపూర్ ఆమెకు ఆహ్వానం అందించాడు.

రాజ్‌కపూర్, శంకర్, జైకిషన్, శైలేంద్ర, హస్రత్ జైపురి, రఫీ, ముకేశ్, మన్నాడేల కాంబినేషన్‌తో లతా పాటలు అన్నీ హిట్‌సాంగ్స్. "బర్సాత్" చిత్రవిజయంతో చిత్రసంగీత చరిత్రలో ఒక వినూతన, సులక్షణ, సుమధుర యౌవనపూర్ణ ప్రత్యేక శైలి రూపొంది, చాలా యేళ్లవరకూ సాగింది. తమ సంగీతరచనలో ప్రతిపాట పైనా తమ ముద్ర వినగానే స్ఫురించేరీతిగా "శం-జై"లు తమ స్వంతబాణీని మలచుకోగలిగారు. మొదట్లో నౌషాద్ బాణీ ప్రభావం వారిపై ఒకింతగా పడినప్పటికీ క్రమక్రమంగా, వారి బాణీప్రభావం ఇతర సంగీతదర్శకులపై కూడా పడేటంతగా, ఆ జంట సంగీతజ్ఞుల సంగీతరచనలు అపూర్వ ఘనవిజయాన్ని సాధించాయి.

దానికి ఒక ముఖ్యకారణం, వాళ్లని పరిచయం చేసిన గొప్ప సంగీతరసజ్ఞుడు, మహామేధావి అయిన నిర్మాత, దర్శకుడు, నటుడూ అయిన బహుముఖ ప్రజ్ఞాశాలి అయిన ది వన్ అండ్ ఓన్లీ ఆల్‌రౌండర్ రాజ్‌కపూర్. పృథ్వీరాజ్ పుత్రుడైన రాజ్ నిర్మాతగా మారి తీసిన తొలి సినిమా 'ఆగ్' సంగీతరచన చేసిన రామ్‌గంగూలీ చాలా హిట్ పాటలే ఇచ్చారు. ముకేశ్‌చే పాడించిన 'జిందాహూ మై ఇస్ తరహ్ జిందగీ నహీ, జల్‌తా హువా దియాహూ మగర్ రోశ్‌నీ నహీ' అనే విషాదగీతంలో ముకేశ్ గాత్రంలో గల ఆర్తి ఆ గీతవిషాదానికి మరింత వేదన చేకూర్చి, శ్రోతల మనసులని రంజింపజేసి కరిగించి వేసింది. అలాగే షంషాద్ పాడిన 'న ఆంఖోంమే ఆసూ, న హోటోంపే ఆహే' అనే పాటకి గంగూలీ కట్టిన మెట్టు నన్నెంతగా ప్రభావితుణ్ని చేసిందంటే నా మొట్టమొదటి రేడియో ప్రోగ్రాములో నేను ఒకపాటకి కట్టిన



దర్శకనిర్మాతగా రాజ్‌కపూర్ తొలిచిత్రం - ఆగ్, సంగీతం - రామ్ గంగూలీ

మట్టుకి స్ఫూర్తి నిచ్చింది. ఆ పాట విశ్వనాథ వారి 'కన్నెకాటుక కళ్లు, చిన్నినాథుని జూచి కదలాడినవేళ, కందళించిన వేళ'.

అంతటి మేలిమి సంగీతాన్ని అందించిన రామ్‌గంగూలీకి రాజ్‌కపూర్ నిర్మించిన ద్వితీయచిత్రం "బర్సాత్" లో అవకాశం లభించకపోవడం విధినిర్ణయం కావచ్చు, 'ఆగ్'



ఆర్కే సంస్థతో లతా అనుబంధం మొదలైన 'బర్సాత్'లో నర్గీస్

పెద్దగా హిట్ కాకపోడం కావచ్చు. "బర్సాత్" ద్వారా లభించిన అవకాశాన్ని శం-జై లు పూర్తిగా వినియోగించుకున్నారు. ఆర్.కె.సంస్థకి ఆస్థానవిద్వాంసులై స్థిరపడిపోయారు. లతా ముకేశ్‌తో పాడిన యుగళగీతాలు, ముఖ్యంగా శోకగీతాలు విని రాళ్లు కూడా కరగవలసినదే. 'ఛోడ్ గయే బాలమ్' లో ముకేశ్ బేస్‌లో పాడుతూ వుండగా లతా పాడిన టాప్ హమ్మింగ్ వలన ఆ పాటే టాప్ అయి విజృంభించింది. నర్గీస్ రాజ్‌ల జంట అభినయ క్షేత్రంలో చాలా పంటలు పండించింది.

# రాజ్‌కపూర్ - లతా - సత్యం, సౌందర్యం, వివాదం



రాజ్‌కపూర్ దర్శక నిర్మాతగా 1978లో విడుదలయిన 'సత్యం, శివం, సుందరం' అనేక వివాదాలలో చిక్కుకుంది. ఆ సినిమా తను తీయడానికి స్ఫూర్తి లతాయే అని రాజ్‌కపూర్ స్టేటుమెంట్ ఇవ్వడంతో తొలి వివాదానికి తెర తీసినట్టయింది. దాంతో మండిపడిన లతా ఆ సినిమాతో సంబంధాలు తెంచుకుంది. రికార్డింగ్‌కి సిద్ధమైన పాట ఒకటి పాడకుండా తప్పించుకుని తిరిగింది.

అది మరొక బ్యానర్ అయితే పెద్ద విశేషం కాదు. కానీ ఆ బ్యానర్ ఆర్.కే., ఆ దర్శక నిర్మాత రాజ్‌కపూర్. 'బర్సాత్' లతా కెరియర్‌ను ఆకాశపథానికి ఎగరేసిన సినిమా. ఆ తర్వాత 'ఆవారా'. ఒకటి కాదు, రెండు కాదు, ఎన్నో ఆర్.కే. సినిమాలతో లతా అనుబంధం పెనవేసుకుని పోయింది.

రాజ్‌కపూర్ మాత్రం? లతా వీరాభిమాని. 'బాబీ' కై లతా విధించిన షరతుకు లోబడి తనకు అత్యంత ఆత్మీయుడైన సంగీతదర్శకుడిని బలి ఇచ్చిన మనిషి. శంకర్ కంటె లతాయే తనకు ముఖ్యమని ఆ విధంగా చాటి చెప్పిన మనిషి. తన సినిమాకు లతాయే ఇన్‌స్పిరేషన్ అని చెబితే లతాకు అంత కోపమెందుకు?

అది మామూలు సినిమా కథ అయితే ఇంత రభస కాకపోను. ఆ సినిమాలో హీరోయిన్ ఒక అందవికారి. మొహం వికారంగా ఉన్నా, అద్భుతమైన గాత్రం కలది. హీరో ఆ పాట విని ముగ్ధుడై ఆమెను ప్రేమించి పెళ్లాడతాడు. సగం ముసుగులో దాగిన ఆమె వికారత్వాన్ని శోభనం నాడు మాత్రమే చూసి నిర్ఘాంతపోతాడు. ఆమెను తిరస్కరిస్తాడు. ఏది సుందరం? ఏది సత్యం? శారీరకమైన అందమా? లేక అలౌకికమైన ఆనందాన్ని ఇచ్చే గానమా? అన్న వేదాంతపరమైన ప్రశ్న ఉంది ఇందులో అని రాజ్‌కపూర్ భావం.

ఈ సినిమాకు ప్రేరణ తనే అని లతా ఒప్పుకుంటే తను అందవికారి అని ఆమె ఒప్పుకున్నట్టే. లతా అందగత్తె కాకపోవచ్చు కానీ కురూపి కూడా కాదు. చూస్తూ, చూస్తూ అటువంటి స్టేటుమెంటుతో ఎవరు ఏకీభవిస్తారు? సినిమాచూడబోతే వేదాంతచర్చ మాట ఎలా వున్నా ప్రేక్షకుడు కథానాయిక శరీరం ఎత్తుపల్లాల్లో జారిపడేట్లు చిత్రీకరించాడు రాజ్‌కపూర్. జీనత్ అమాన్ అంగాంగ ప్రదర్శనపై పెద్ద ఎత్తున చర్చలు జరుగుతున్నాయి.

అసలు జీనత్ స్థానంలో లతా వేషం వేయవలసినది. కోకిలస్వరం గల లతాను చూసి పరవశించిపోయిన రాజ్‌కపూర్ ఈ కథకు రూపకల్పన 1954లోనే చేశాడు. ఒక మామూలు అమ్మాయి. ఎవరూ పట్టించుకోరు. కానీ ఆమె కంఠం విని అంతా వెంటబడతారు. తను హీరోగా లతా హీరోయిన్‌గా సినిమా ప్లాన్ చేశాడు రాజ్. లతా కూడా ఎంతో సంతోషించింది. వారిద్దరూ ఎన్నో రోజులు కథాచర్చల్లో పాల్గొన్నారు. ఆమె తాంపూరా పట్టుకుని వాయిస్తూ ఉండేది. అతను పాటలు అల్లుతూ ఓ వక్క స్క్రిప్టు తయారుచేసేవాడు.


'సత్యం..'లో జీనత్‌కు అభినయించి చూపుతున్న దర్శకుడు

కానీ తయారయిన స్క్రిప్టు రాజ్‌కపూర్‌కి సంతృప్తి నివ్వలేదు. మూలపడేశాడు. అలా పడేసినదాన్ని 23 ఏళ్ల తర్వాత దుమ్ము దులిపాడు. కానీ అప్పటికే తను ముసలివాడయిపోయాడు. అందుచేత హీరోగా తమ్ముడు శశికపూర్‌ను పెట్టుకున్నాడు. హీరోయిన్‌గా ఎవరాని చాలాకాలం వెతికి, వెతికి చివరకు జీనత్ అమాన్ ఆదివాసీ పిల్ల డ్రస్ వేసుకుని వచ్చి కనబడేటప్పటికి ఎగిరి గంతేసి 'నువ్వే నా కథానాయిక' వన్నాడు. చాలీచాలని దుస్తులలో ఆమె స్టిల్స్ బయటకు రాగానే కథ సంగతి దేవుడెరుగు, ఈ దేహప్రదర్శనే చిత్రాన్ని ప్రజలు తెల్లబోయారు., నిరసన తెలిపారు.



ఈ నేపథ్యంలో అలాటి సినిమాకు ఇన్‌స్పిరేషన్ తనేనని ఏ మహిళ అనుకుంటుంది? అంగీకరిస్తుంది? పాట పాడడానికి లతా రాకపోవడంతో రాజ్‌కపూర్ ఖంగు తిన్నాడు. 'నా ఇన్‌స్పిరేషన్ లతా కాదు, లతా గొంతు' అని ఇంకో స్టేటుమెంటు ఇచ్చాడు.

అయినా లతా కరగలేదు. కరుగుతుందన్న ఆశ పోలేదు రాజ్‌కపూర్‌కి. అందాకా హేమలతా చేత పాడించి, లత చల్లబడ్డాక మారుద్దామనుకున్నాడు. హేమలతా చేత పాడించడం, తెరపై చిత్రీకరించడం జరిగింది. ఇంతాచేసి రషెస్ చూసుకునేటప్పుడు ఆ సన్నివేశం అనవసరం అనిపించడంతో మొత్తం పాటను తొలగించేశాడు రాజ్‌కపూర్!

**- ఎమ్బీయస్ ప్రసాద్**

'బర్సాత్' లో లతా పాడిన పాటలన్నీ హిట్లే. 'అందాజ్', 'బర్‌సాత్' చిత్రాల దిగ్విజయంతో పాటు, నౌషాద్ శంకర్‌జైల సంగీతం, లతా రఫీ ముకేశ్ మన్నాదేల గానం ప్రత్యేకమైన గుర్తింపు పొందాయి. లతా ఎదిగి, ఎదిగి ఏకచ్ఛత్రాధిపత్యం సాగించే స్థాయికి చేరింది. లతాకే స్ఫూర్తి నిచ్చిన నటీగాయకామణి నూర్‌జహాన్ పాకిస్తాన్ తరలివెళ్లడంతో లతతో గానంలో స్పర్ధించగలవారే లేకపోయారు.

ఆర్కేతో లతా ద్వితీయవిఘ్నం లేకుండా 'ఆవారా' కూడా ఘనవిజయం సాధించింది. లతా సోలోలు, ముకేశ్‌తో యుగళగీతాలూ బాక్సాఫీసు రికార్డుల్ని బద్దలు కొట్టాయి. 'దమ్‌భర్ జో ఉధర్ ముహ్ ఫేరే ఓ చందా, మై ఉన్‌సే ప్యార్ కర్‌లూంగీ' అనే డ్యూయట్ నర్గీస్ రాజకపూర్‌ల

చిత్రం:- భాభీ కీ ఛుడియాఁ (1961) గానం:- లతా

సంగీతం : సుధీర్ ఫడ్కే రచన : నరేంద్ర శర్మ

ఆ: ఆ.... జ్యోతి కలశ్ ఛల్ కే ॥4॥
వే గులాబీ లాల్ సునెహరే
రంగ్ ధల్ బాదల్ కీ ॥జ్యోతి॥
ఆ:- ఘర్ ఆంగన్ వన్ ఉపవన్ ఉపవన్
కర్‌తీ జ్యోతి అమృత్ కే సించన్
మంగళ్ ఘట్ ఢల్‌కే ...... మంగళ్ ఘట్ ఢల్‌కే ॥జ్యోతి॥
ఆ:- అంబర్ కుంకుమ్ కణబర్ ఛాయే
ఫూల్ బసురియా కర్ ముస్ కాయే
బిందు తుహిన జల్ కే..... బిందు తుహిన జల్ కే ॥జ్యోతి॥
ఆ:- పాత్ పాత్ బిర్ వా హరియాలా
ధర్ తీ కా ముఖ్ హువా ఉజాలా
సచ్ సప్ నే కల్‌కే.... సచ్ సప్ నే కల్‌కే ॥జ్యోతి॥
ఆ:- ఊషా నే ఆఁ చల్ ఫైలాయా
ఫైలీ సుఃఖ్ కీ శీతల్ ఛాయా
నీచే ఆఁ చల్ కే.... నీచే ఆఁ చల్ కే ॥జ్యోతి॥
ఆ:- జ్యోతి యశోదా ధర్ తీ గయ్యా
నీల్ గగన్ గోపాల్ కన్హయ్యా ॥జ్యోతి యశోదా॥
శ్యామల్ చవీ ఝుల్ కే.... శ్యామల్ చవీ ఝుల్ కే ॥జ్యోతి॥



'భాభీకీ ఛుడియాఁ'లోని 'జ్యోతి కలశ్ ఛల్ కే' పాటలో మీనాకుమారి,మాస్టర్ అజీజ్



మరో మ్యూజికల్ హిట్ - 'ఆవారా'

సహజాభినయకౌశలంతో భలేరక్తి కట్టింది.

'ఆవారా' లో ఈ నాటికీ ఏ నాటికీ ఎవ్వరూ మరచిపోలేనిది డ్రీమ్ సాంగ్. మొదట ఆ పాటకి ఏ సన్నివేశమూ లేకపోయినా 'శం-జై'లు వినిపించిన ట్యూను విని, రాజ్ కపూర్ ఫెర్‌టైల్ బ్రెయిన్ ఊహించి చిత్రీకరించిన సన్నివేశమది. అతికినట్టుగా లేకుండా, సహజంగా చిత్రకథ కథనానికి మెరుగులు దిద్దడం రాజ్‌కపూర్ రజజ్ఞతకు నిరుపమాన నిదర్శనం. దానికి తగ్గట్టు ప్రజానాడిని పట్టుకోగలిగిన జంట - శం-జై.

'తేరే బినా ఆగ్ యే చాంద్‌నీ తూ ఆ...జా...తూ..ఆజా' అనే ఆ గీతాన్ని ఆలాపించిన మహాగాయకీగాయకులు, లతా మన్నాదేలు. హాంటింగు సాంగులకీ, డ్రీమ్ సీక్వెన్సులకీ ఆ గీతం పథప్రదర్శకమై వెలుగొందుతూ ఉందీ ఈ నాటికీ. ఈ సన్నివేశంలో లతా కంఠస్వరం మన స్వప్నాలలో కూడా సదా ప్రతిధ్వనిస్తూనే వుంటుంది - "తూ ఆ..జా.." అని.

అప్పుడప్పుడు కొన్ని మార్పులు జరిగినా, ఆ నాటి తారస్థాయి నందుకున్న తారామణి నర్గీస్‌కి లతా గొంతు స్థిరపడి చాలా సంవత్సరాల వరకూ కొనసాగింది. నర్గీస్‌కి లతా ఆత్మానుభూతితో ఆలపించిన గీతాలన్నీ తమ తమ వైశిష్ట్యాన్ని నిరూపించుకున్నాయి. అప్పటినుండి నౌషాద్‌కీ, శంకర్‌జైకిషన్లకీ లతా అనివార్యగాయని, అనివార్య కారణాలుంటే తప్ప! 'పూనం', 'ఔరత్' మున్నగు



మెచ్చి పచ్చనోటు ఇచ్చినా దరిమిలా శత్రువైన శంకర్

సినిమాలలో లత ఏకైక గాయిక. ఒక్క మగగొంతుక కూడా పాడలేదు.

ఒకసారి ఓ పాట పాడి, బయటకి రాగానే శంకర్ ఆనందం పట్టలేక, జేబులోంచి ఒక పచ్చనోటు బహూకరించారట. అప్పట్లో నూరు రూపాయలకి విలువ చాలా ఎక్కువ. అటువంటి శంకర్‌కీ, లతాకీ తదుపరి కాలంలో బొత్తిగా పడని సందర్భం రావడం శోచనీయం. ఒకానొక రోజున మెడ్రాస్ విమానాశ్రయంలో ఫ్లయిట్ కోసం వేచి వున్న సమయాన, మాటల సందర్భంలో శంకర్ వాడిన భాషని విని నేను నిర్ఘాంతపోయాను. కాలం ప్రతికూలిస్తే అనుయాయులు కూడా ఎనిమీలై పోతారు.

రాయల్టీ విషయంలో భేదాభిప్రాయాలు పొడసూపడం వలన ఆర్.కే.బేనర్ 'మేరానామ్ జోకర్' లో లతా పాడేందుకంగీకరించలేదు. ఆ చిత్రంలో ఆమె పాడని లోటు అభిమానులందరికీ స్పష్టంగా స్ఫురించింది. అప్పటిదాకా శం-జై లతాల మధ్య అంతగా సయోధ్య లేకపోవడం మరో కారణం.

కానీ రాజ్‌కపూర్ వంటి షోమాన్ ఆఫ్ ది మిలీనియంకు కూడా లతా చేత పాడించకుండా వుండడం వీలుపడలేదు. ఆమె గానం పట్ల ఆయనకున్న ఆత్మీయత ఇద్దరిమధ్యనా కాంప్రమైజ్‌కి దారి సుగమం చేసింది. 'బాబీ'లో లతా చేతనే పాడించేందుకు ఆమె షరతులకు రాజ్ తలవూపి రాజీ పడడం వలసివచ్చింది. ఆ నిబంధల్లో ఒకటి లక్ష్మీకాంత్, ప్యారేలాల్‌లకి సంగీతదర్శకత్వం

అప్పగించడం. అందువల్ల శంకర్‌కి ఆర్.కె.లో గల స్థానం అదృశ్యమై మనస్పర్థకి దారితీసింది. అదే లతా శంకర్ల వైమనస్యానికి ముఖ్యకారణమై దుర్భాషలకు తావిచ్చింది.

కానీ టీము విడిపోయేదాకా, శం-జైలకు లతా పాడిన పాటలు - అన్నీ కాకున్నా, ఎన్నో ప్రజాదరణ పొందివే. శం-జైలు మిగతా రాగాలని కూడా ప్రయోగించినా ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చిన రాగాలు సింధుభైరవి, శివరంజనీ అని తోచక మానదు. ఈ రాగాల్లో వాళ్లు నవరస భావాలని ఒలికించారు.

ప్రథమచిత్రం నుండే శం-జైలు తమదైన ఒక లయని (కుప్పిగంతులేసే దుప్పి పరుగుతో పోటీ పడేలా) రూపొందించి, వందల పాటలు సృష్టించారు. మంచి స్వింగు గల ఫాస్ట్ టెంపోలో ఉత్సాహపూర్ణమైన పాటలే కాక, శోకగీతాలు కూడా రచించేవారు. 'అనాడీ'లోని నూతన్‌పై చిత్రీకరించబడిన లతా సోలో - 'తేరా జానా' అనే




పాట ఈ నిజానికి ఒక చిన్న ఉదాహరణ.

కొంతమంది ఇతర సంగీతదర్శకులు కూడా శం-జైల పద్ధతినీ, లయలనీ అనుసరించారు. ముఖ్యంగా కళ్యాణ్‌జీ, ఆనంద్‌జీ, లక్ష్మీకాంత్ ప్యారేలాల్ వంటి జంట సంగీత దర్శకుల సంగీత రచనల్లో కొన్నాళ్ల దాకా శం-జై ప్రభావం కొట్టొచ్చినట్టు స్ఫురించేది. కనిపించేది.


జైకిషన్, శంకర్, లతా , తలత్

'ఆయీ ఆయీ రాత్ సుహానీ' అనే జోలపాట మాధుర్యంలోనూ లాలిత్యం లోనూ మించి మరీ కంపోజ్ చేశారా అనిపిస్తుంది. 'కలతని తొలగించే కల్పలత లతా' అనిపిస్తుంది.

శం-జై టీమ్‌లో ఇద్దరికిద్దరూ అఖండులే. మంచి రేపోర్టు, సేమ్ వేవ్‌లెంగ్తూ కలవారు. వీళ్ల కలిసి స్వరపరిచినా, వేరువేరుగా స్వరపరచినా ఏ పాటైనా శం-జై ముద్ర తప్పనిసరిగా వుండడం వీరి కాంబినేషన్‌లోని ప్రత్యేకత. బెంగుళూరులో ఒక సంగీత కార్యక్రమంలో జైకిషన్‌ని చూడడం, విష్ చేయడం తప్ప నాకు పరిచయం లభించలేదు. శంకర్‌ని మాత్రం తరుచు కలుసుకోగలిగేవాడిని. వాళ్ల కంపోజింగ్‌రూమ్‌లో కలిసినప్పుడు శంకర్ హార్మోని వాయించగా నేను తలత్ గజల్ పాడి వినిపించాను. చాలా మెచ్చుకుని అభినందించారు. అక్కడ వున్న పియానో దగ్గరకి నన్ను రమ్మని రష్యన్ మెలోడీ ఒకటి వాయించి వినిపించారు. అందులోనే ఆయన నైపుణ్యాన్ని అర్థం చేసుకోగలిగాను. శంకర్ జైకిషన్‌లు విడిపోయిన తరవాత కూడా ఓ రోజున ఆయన ఇంటికి తీసుకెళ్లి చాలా ఆప్యాయంగా ఆదరించారు. ఎంత మంచివాళ్లకైనా, విపరీతపరిస్థితిలో మారక తప్పదేమో అనుకున్నాను.

ఈ జంట లతా చే నాలుగు వందల పై చిలుకు పాటలను పాడించారని ఓ అంచనా. కానీ లక్ష్మీ-ప్యారేలు పాడించినవి ఇంచుమించు ఏడు వందలు. కల్యాణ్‌జీ ఆనంద్‌జీలు మూడు వందలు పాడించగా మొదట్లో హుస్నలాల్ భగత్‌రామ్‌లు పాడించినవి వంద దాటాయి. ఎవరికి పాడినా ఒకే విధమైన భక్తితోనూ శ్రద్ధాదీక్షలతోనూ పాడడం వలన ఆమె ఆలపించిన ఏ గీతానికీ అన్యాయం జరగలేదు.

- (సశేషం)

సెప్టెంబరు 29 మెహమూద్ జన్మదిన సందర్భంగా...



# నిర్మాతగా మెహమూద్

నిర్మాతగా మారిన హాస్యనటులు చాలామంది అపజయం పాలయ్యారు. కానీ మెహమూద్ విషయంలో ఆ సూత్రం చాలాకాలం వర్తించలేదు. చాలా ఏళ్లపాటు చిత్రనిర్మాణం సాగించి, ఎంతోమందికి బ్రేక్ నిచ్చాడు. అమితాబ్ బచ్చన్‌కు కూడా 'బాంబే టు గోవా' ద్వారా గుర్తింపును తెచ్చింది మెహమూదే!

**అమితాబ్ అదృష్టం బాగుండి అతని కా వేషం దక్కింది కానీ లేకపోతే మెహమూద్ ఆ పాత్రను రాజీవ్‌గాంధీకి ఆఫర్ చేసి వుండేవాడు. అవును, అక్షరాలా రా..జీ..వ్..గాం..ధీకే! ఆ కథాక్రమం బెట్టిదనిన..**

అప్పటికే 4,5 విజయవంతమైన సినిమాలు తీసిన మెహమూద్ తన తన తరువాతి సినిమాగా 'బాంబే టు గోవా' ప్లాను చేస్తున్న రోజులవి. దానిలో హీరో కంటె డ్రైవర్, కండక్టర్ ప్రాధాన్యం ఎక్కువ. అందుచేత హీరో ఎవరైనా ఫర్వాలేదనుకుని కొత్తమొహాల కోసం చూస్తున్నాడు.



యువకుడిగా రాజీవ్‌గాంధీ, భార్య సోనియాతో...

ఓరోజు ఇంటిలాన్‌లో తిరుగాడు తూంటే తన ఇంట్లోనే అతనికో కొత్త స్తంభం కనబడింది. (తొలిచూపులో అమితాబ్ అలాగే అనిపించా డతనికి) ఎవరాని తమ్ముడు అన్వర్ అలీనడిగితే తెలిసింది - అతని స్నేహితుడని, సినిమా వేషాలకోసం ప్రయత్నం చేస్తూ తన ఇంట్లోనే తనకు తెలియకుండా ఉంటున్నాడని. వెంటనే స్క్రీన్‌టెస్టు చేయించి, ధైర్యం చిక్కబట్టుకుని హీరోగా ఫిక్స్ చేసేశాడు.

అయితే త్వరలోనే అతని దృష్టి ఇంకో కుర్రాడిపై పడింది. అతనూ తన ఇంట్లోనే తారసిల్లాడు. అందంగా, నటుడికి కావలసిన లక్షణాలన్నీ పుణికిపుచ్చుకుని ఉన్నాడు. ముఖ్యంగా మానర్స్, ఆత్మవిశ్వాసం అన్నీ వున్నాయనిపించింది. ఈతనెవరని అడిగితే అమితాబ్ కోసం వస్తూ పోతూంటాడని సమాధానం వచ్చింది. ఫ్రెండు గాబోలు, ఇతనిలాగానే వేషాలకోసం తిప్పలు పడుతున్నాడేమో, హీరో చేసేద్దాం అనుకుని అన్వర్‌కి చెప్పాడు, అతని సంగతి కనుక్కో అని.

ఆ మాట విని అన్వర్ షాకయిపోయాడు. "మతిపోయిందా? అతనెవరో తెలుసా? మన ప్రధానమంత్రి ఇందిరాగాంధీ పెద్దకొడుకు. అమితాబ్ స్నేహితుడు. ఎయిర్‌లైన్స్‌లో పైలట్. సినిమా వేషం ఇస్తానని అతనితో చెప్పావు గనక." అన్నాడు. ఇంకేముంది? కథ కంచికి!

ఆ విషయం గురించి తరువాత ప్రస్తావిస్తూ మెహమూద్ అన్నాడు, "ఆ మాట విని నేను చాలా నిరాశపడ్డాను. ఆ రోజుల్లో రాజకీయాల్లో వున్నవారికి సినిమాలంటే చిన్నచూపుండేది. కానీ, ఇప్పుడు రోజులు మారాయి. ప్రజలను చేరువ చేసే సినిమా ఎంత పవర్‌ఫుల్ మీడియాయో తెలిసివచ్చింది. ఇప్పుడయితే ప్రధానమంత్రి కొడుకే కాదు, సాక్షాత్తు ప్రధానమంత్రిని అడిగినా తప్పుపట్టరు."

అప్పుడు మెహమూద్ ధైర్యం చేసి రాజీవ్‌గాంధీని అడిగివుంటే? రాజీవ్ అవునని ఉంటే?? ఏమో!

****

మెహమూద్ సినిమాలన్నిటిలోనూ సంగీతం ప్రధానపాత్ర వహించేది. ప్రథమశ్రేణి సంగీత దర్శకుడు రాహుల్‌దేవ్ బర్మన్‌కు తొలి ఛాన్సు ఇచ్చింది మెహమూదే! దానికీ ఓ కథ ఉంది -

ఓ రోజు రాహుల్ తన ఇంటి ఆవరణలో క్రికెట్ ఆడుతున్నాడు. మెహమూద్ హడావుడిగా వచ్చి మెట్లెక్కి మేడ మీదకు వెళ్లి అతని తండ్రి సీనియర్ బర్మన్ వద్దకు వెళ్లాడు. కాస్సేపటికి మెహమూద్ బాల్కనీలోకి వచ్చి, "పంచమ్! (రాహుల్ ముద్దుపేరు) నేను నిర్మాతగా మారి సినిమా తియ్యబోతున్నాను. నువ్వు మ్యూజిక్ ఇస్తావా?" అని అరిచాడు.

"ఏం నాన్నగారు కుదరదు పొమ్మన్నారా?" అని అరిచాడు రాహుల్ అంతే ఫోర్సుగా!

ఏమనుకున్నాడో ఏమో మెహమూద్ గబగబా మెట్లు దిగి వచ్చి "ఛీ, ఛ! అలా అనుకోవద్దు. ఏదో మర్యాదకి పెద్దాయన్ని కలిశాను. నీ ప్రతిభ తెలియక కాదు. గురుదత్‌లాటి వాడే నీకు ఛాన్సివ్వబోయాడు. నాదెంత? నీ టేలెంటు మీద నాకు గురి వుంది. అందుకే నేను తీయబోయే 'ఛోటే నవాబ్'కు నువ్వే సంగీతదర్శకుడివి." అన్నాడు.

తండ్రి సచిన్‌దేవ్ బర్మన్‌కి అసిస్టెంటుగా పనిచేస్తున్నపుడే బాలమేధావిగా రాహుల్ అందరి కళ్లల్లో పడ్డాడు. సంగీతం పై చక్కటి అవగాహన గల గురుదత్ రాహుల్‌కి 'రాజ్' అనే సినిమాకై ఆఫర్ ఇచ్చాడు. కానీ ఆ సినిమాకు పురిట్లోనే సంధి కొట్టింది. అందువలన రాహుల్‌కు అప్పటిదాకా ఎవరూ ఛాన్సు ఇవ్వలేదు. మెహమూద్ ఇచ్చిన ఛాన్సుకి వేరే ఎవరైనా అయితే ఎగిరి గంతేయాల్సిందే!



ఆర్.డి.బర్మన్

కానీ ఆత్మాభిమానం గల రాహుల్ ఒప్పుకోలేదు. తండ్రి కాదంటేనే సెకండ్ ఛాయిస్‌గా మెహమూద్ తన దగ్గరకి వచ్చాడన్న రోషం అతనిది. అతనిపై తనకున్న నమ్మకాన్ని ప్రదర్శించడానికి మెహమూద్ "ఛోటే నవాబ్'కే కాదు, ఆ తర్వాత నేను తీయబోయే 'పడోసన్', 'కువారా బాప్' సినిమాలకు కూడా నువ్వే సంగీతదర్శకుడివి. నీమీద నాకు గౌరవం ఉందని ఒప్పు కుంటావా?'. అన్నాడు మెహమూద్. రాహుల్ కోపం పోయింది. సినిమా జయాపజయాలతో నిమిత్తం లేకుండా ఇటువంటి ఆఫర్ ఎవరిస్తారు గనక? సరేనన్నాడు.

అయితే తమాషా ఏమిటంటే మెహమూద్ తను అనుకున్న వరుసలో సినిమాలు తీయలేదు. 'ఛోటే నవాబ్' (1963) తరువాత 'భూత్ బంగ్లా' (1965) తీశాడు. దానికి సంగీతం ఇవ్వడంతో బాటు ఫ్రెండ్‌షిప్ కొద్దీ రాహుల్ ఓ వేషం వేశాడు కూడా! ఆ తరువాత ఇంకా సినిమాలు వచ్చాయి. 'పడోసన్'(1968) కి రాహులే సంగీతం సమకూర్చినా, 'కువారా బాప్' (1974) నాటికి చాలా బిజీ అయిపోయాడు. పట్టుబట్టి సాధించుకున్న మెహమూద్ ఆఫర్‌ను వినియోగించుకోలేని పరిస్థితిలో ఉన్నాడు. ఆ సినిమాకు సంగీతం రాజేష్ రోషన్. పాటలన్నీ హిట్. దాన్ని బట్టే తెల్తుంది - మ్యూజిక్‌డైరక్టర్ ఎవరైనా సరే చెప్పి చేయించుకోగల టేస్టున్న నిర్మాతల్లో మెహమూద్ ఒకడని!

-సి.ఎస్.ఎన్.మూర్తి

తన అభినయంతో ఎన్నో గీతాలకు ప్రాణ ప్రతిష్ట చేసి, హాస్యానికి కూడా కొత్త ఊపిరులూదిన అక్కినేని నాగేశ్వరరావు జన్మదినాన్ని (సెప్టెంబరు 20) పురస్కరించుకుని...



నలభై ఏళ్ళుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు, నటుడు

## రావి కొండలరావు

రాసిన వ్యాసమిది






**కొన్నేళ్లక్రితం:**

**(ఇంగ్లీషు భాష, సినిమా జ్ఞానం అసలు లేని, తెలియని ఒక తెలుగు మాస్టారు, సారథి స్టూడియోలో హీరో అక్కినేని నాగేశ్వరరావుని కలిశారు. మాస్టారుకి ఏవో సినిమా పేర్లు, సినిమావాళ్ల పేర్లు తెలుసుగాని, కచ్చితంగా తెలీదు. మాస్టార్ని నాగేశ్వరరావుగారి దగ్గరికి తీసుకెళ్లి పరిచయం చేశారు ఒకాయన. అప్పుడు ఆయన మేకప్ పూర్తి చేసుకుని, డ్రెస్ వేసుకుంటున్నారు - సెట్టుకి వెళ్లడానికి)**

"మాస్టారూ, వీరు తెలుసుగా, అక్కినేని నాగేశ్వరరావు గారు" అని చెప్పాడు తీసుకెళ్లినాయన.

మాస్టారు ఎగాదిగా చూసి, "అలాగా! ఏం చేస్తుంటారీయన?" అని అడిగారు, తాను వెర్రి మొహం వేసి, వాళ్ల చేత కూడా వెర్రి మొహాలు వేయించీ.

"అదేమిటి మాస్టారూ! సినిమా హీరో. ఆయన తెలీకపోడం ఏమిటీ?" అన్నాడు పరిచయ కర్త రెండు కళ్లూ కనుబొమలకు తగిలేలా ఎత్తి. మాస్టారు మరోసారి చూసి-

"అవునూ, ఎన్‌టీ రామారావు అని ఒకాయన వున్నట్టు విన్నాను. ఆయన వేరా?" అని అడిగారు.



అక్కినేని వారికి కాస్ట్యూమర్ షూ తొడుగుతూ వుంటే ఆయన మాస్టార్ని ఓరకంటితో **వింటున్నారు...**

"అయ్యా క్షమించాలి. నాకు తేడాలు తెలియవు. సినిమాలు చూడను. పౌరాణికాలయితే కొన్ని చూశాను. అందులో ఎంటీ రామారావు కృష్ణుడో రాముడో వేస్తే ఆ పేరు మాత్రం గుర్తుంది. తమ పేరు ఏమిటన్నారూ? అక్కినేని...?"

"నాగేశ్వరరావు"

"అవును - గోడల మీద పోస్టర్లూ అవేవో అతుకుతారు. అందులో చదివినట్టు జ్ఞాపకం. 'నాగేశ్వరావు, సావిత్రి, రేలంగి' అని పేర్లుంటాయి. నాకేం తెలుసు? తమరు పౌరాణిక చిత్రములలో వెయ్యరనుకుంటాను." అని అడిగారు మాస్టారు అక్కినేని వారిని.

"వేశానండి - ఎక్కువగా వెయ్యలేదు"

"ఒక చిత్రం పేరు చెప్పండి"

"చెంచులక్ష్మిలో విష్ణువు వేశాను"

"ఏది - మహా విష్ణువు! నాలుగు చేతులతో? మరి మీకు రెండే వున్నాయి."

"అవి తగిలిస్తారు లెండి"

"ఓహో! ఆ రెండూ వీూ చేతులు కావన్నమాట. అట్ట చేతులు కట్టి ప్రజల్ని మోసగిస్తున్నారన్నమాట" అన్నారు మాస్టారు అదోలా చూస్తూ.

నాగేశ్వరావు గారు ఊరుకోలేదు. "మోసమే! సినిమాయే మోసం కదా మాస్టారూ! తెరమీద కనిపించేది బొమ్మే కదా. నిజం భ్రాంతితో అందరూ చూడ్డం లేదూ! అదే సినిమా గొప్పతనం మాస్టారూ! అది కేవలం బొమ్మ, నీడ అని తెలిసి కూడా మనం ఉద్వేగ పూరితుల మవుతాం. ఎమోషనల్ అవుతాం. కళ్ళమ్మట నీళ్లు పెట్టుకుంటాం కదూ" అన్నారు.

"మీకు చాలా తెలుసు. తమరు అనేక చిత్రముల్లో నటించి, నటిస్తున్నట్టున్నారు. తమ తొలి చిత్రము?" అన్నారు మాస్టారు మామూలుగా, విలేకరి అడిగినట్టు కాకుండా. పరిచయకర్త చెప్పారు - "సీతారామ జననం. అందులో రాముడు వేశారు" అని.

"ఓహో! మంచి ప్రవేశము. మంచి శకునము. తమరు అన్యథాభావించనంటే, ఊరికే ఎంక్వయిరింగ్ గా వుంటాను - తమకి కిరాయి, అదే వేషధారణకి - ఎంత ముడుతుంది?" అడిగారు మాస్టారు.

"అలాంటివి అడక్కూడదు మాస్టారూ. అయినా, ఓ లక్ష రూపాయలనుకోండి" అని పరిచయకర్త తగ్గించి చెప్పాడు.

"లక్షా!" అని ఆశ్చర్యపోయాడు మాస్టారు. "ఏమిటి - తమరు ఆనాడు వేసిన తొలి చిత్రము నుంచి, అన్ని చిత్రాలకూ కలిపా - ఆ కిరాయి?"

"కాదండి. ఒక్క చిత్రమునకే" అన్నారు అక్కినేని, కవ్విస్తున్నట్టు చూసి.

"ఓహో! అవునుమరి.... తమకి చాలా ఖర్చులుంటాయి. ఇదిగో, ఈ దుస్తులూ అవీ తమరు కుట్టించు కొనవలెను గదా"

"లేదండి. నాకు డబ్బిస్తూ ఈ సినిమా తీస్తున్నాయనే ఈ దుస్తులు కూడా కుట్టిస్తారు."

"ఓహో... ఆ ఖర్చు తమకి లేదన్నమాట? మరి తమ ముఖమునకు అదేదీ, మేకప్పొ



"గొర్రెప్పొ ఏదో అంటారు, అదే రంగులు ఆ రంగులు వేసినతనికి ఏదైనా ఇచ్చుకోవద్దూ?"

"అబ్బే అక్కర్లేదు మాస్టారూ. అతనికి కూడా కంపెనీయే ఇస్తుంది"

"అలాగా! అయితే ఆ ఖర్చూ మీకు లేదు. మరి నెత్తిపైన, ఆ కుల్లాయా అదే- విగ్గు- ఆ విగ్గు కొనుక్కోవాలిగదా"

"అదీ కంపెనీయే కొంటుంది."

"అదీ కంపెనీయే కొంటుందా?... ఓహోహో... అవునూ, మరి మీ రాకపోకలకి బస్సు ఖర్చులూ..."

"లేదండి కార్లో వస్తాం కార్లో వెళతాం... అది కూడా ఈ చిత్రం తీస్తున్న నిర్మాతే కారు పంపిస్తారు. ఆ ఖర్చూ వుండదు."

"బావుంది బావుంది... ఆ ఖర్చూ లేదన్నమాట. మరి, ఈ షూటింగ్‌లోకి వచ్చాక, భోజనం తెప్పించుకోడాలు వగైరాలు..."

"భోజనాలు, కాఫీలు, టిఫిన్లూ అన్నీ కూడా కంపెనీయే పెడుతుంది"

"ఓహో... అదీ ఫ్రీయే! బాగానే వుందే- నేను ఇన్నేళ్లాయి స్కూల్లో పాఠాలు చెబుతున్నాను- ఒక్కనాడు టీ చుక్క కూడా స్కూలు వాళ్లు పొయ్యలేదు. మీ పనే బావుంది. ఏ ఖర్చూ లేదు తమకి.... అన్నీ వాళ్లే ఇస్తున్నారు డబ్బు కూడా లక్షలు ఇస్తున్నారు...! మరి, తమరు చిత్రములో చెప్పవలసిన సంభాషణములు - తమరే రాసుకుని చెప్పవలసి వుంటుంది కదా"

"అబ్బెబ్బె... దానికి రచయితలని వుంటారు. వాళ్లు రాస్తారు. అవి మేం చెబుతాం అన్నమాట."

"అలాగా! అది కూడా మీరు రాసుకోన వసరం లేదా?... ఇంకొకరు రాస్తారా!... అది మీరు చదివి, వప్పజెప్తారన్నమాట.... చాలా బావుంది.... ఐనా, మీ పాటలూ అవీ మీరు పాడుకోవాలి గదా, శ్రుతి బద్ధంగా... అవి నేర్చుకోవాలి గదా సాధన చేసి...."

"అక్కర్లేదు మాస్టారూ- నేను పాడను. ఘంటసాల వెంకటేశ్వర్రావు గారనీ, ఆయన పాడతారు. దానికి నేను పెదవులు కదుపుతూ నటిస్తాను"

"... ఏ..మి...టీ...! ఎంత ఆశ్చర్యం. పాట కూడా తమకి రాదు.... అతనెవరో వెనక పాట పాడితే, మీరు పెదవులు కదిలిస్తారా... మీరేదీ కొనరు, సంభాషణలు రాయరు, పాట పాడరు... ఆహాఁ! మరి, ఒక్కోసారి కత్తియుద్ధాలు చేస్తారు, ఒక్కోసారి ముష్టియుద్ధాలు గట్రా చేస్తారు... మీకు పాపం అపాయమే కదా..."

"అది కూడా రిస్కీ షాట్స్ అయితే, మేం చెయ్యం. డూప్స్ వుంటారు. వాళ్లు చేస్తారు. దగ్గర్లో కెమెరా పెట్టి తీసినపుడు మాత్రం మేం వుంటాం"

"ఓరి ఓరి ఓరి హోరి! దానికీ వేరే వాళ్లుంటారా - తమకేమీ అపాయం రాదు. మరి వాళ్లు బాగా ట్రయినింగయిన వాళ్లన్నమాట. ఆ ట్రయినింగేదో తమరే అయితే, తమకే పేరు వస్తుంది గదా.... సర్లెండి... సులభ పద్ధతుల్ని ఆచరిస్తారు మీ సినిమా నటులు! బాగానే వుంది. పాట పాడక్కర్లేదు, యుద్ధం చెయ్యక్కర్లేదు, ఏ ఖర్చూ లేదు- ఇక మీరు చేసేదేమిటని? తెలీకడుగుతాను దేనికి తమకి లక్ష రూపాయలు?.. ఆఁ?.... సైలెన్స్-"

నాగేశ్వరరావు గారు స్పోర్టివ్‌గా చిన్న చిర్నవ్వు నవ్వి - "టైమైంది. లోపల పిలుస్తున్నారు" అని వెళ్తే మాస్టారు "ఈ స్టారు షూటింగు ఏమిటో చూద్దాం పదండి...." అని పరిచయకర్తతో ఫ్లోర్‌లోకి దారి తీశారు. 'ఫ్లోర్' అంటే నేల కదా, ఈ షెడ్డుని ఫ్లోర్ అంటారేమిటి చెప్మా ఈ సినిమా వాళ్లు?..." అనుకుంటూ లోపల ప్రవేశించారు మాస్టారు.

(నాగేశ్వరరావు గారు ఎంత 'స్పోర్టివ్'గా తెలుగు మాస్టారి పరోక్ష విమర్శని తీసుకున్నారంటే- హైద్రాబాదులో తాను పాల్గొన్న సభల్లో - మాస్టారు అన్న పై మాటల్ని వేదికమీద చెప్పి- తాను నవ్వుతూ, ప్రేక్షకుల్ని నవ్విస్తున్నారు. ఎవరో అన్నట్టు ***"That is the Sportive Sport of The Maha Star!".)***




పాటకు ట్యూన్ కట్టేటప్పుడు సంగీత దర్శకులు రకరకాల వాద్యాలను ఆసరాగా తీసుకొని వరస చేయడం పరిపాటి. ఆ రోజుల్లో ఎక్కువగా హార్మోనియం మీద ఆధారపడేవారు. అశ్వత్థామ వంటివారు అగ్గిపెట్టె మీద తాళం వేస్తూ ట్యూన్ చేసేవారు. వీణవంటి ప్రాచీన తంత్రీవాద్యంపై ఆధారపడి ట్యూన్ చేసేవారు అతి తక్కువ. వారిలో తాతినేని చలపతిరావు ఒకరు. ఆయన ప్రతిభా విశేషాలను వెల్లడించే చిత్రాలలో ప్రసాద్ ఆర్ట్ పిక్చర్ వారి

# ఇల్లరికం

ఒకటి. 1959లో విడుదలైన ఆ చిత్రంలో బహుళ జనాదరణ పొంది నేటికీ అదే స్ఫూర్తిని కలిగిస్తూ సజీవంగా వున్న పాటలివి.



వేణు : అడిగిందానికి చెప్పి - ఎదురాడక ప్రశ్నను విప్పి
నిల్చెదవా గెల్చెదవా - ఓహో చిన్న దానా
రాధ : అడిగిందానికి చెబుతా - ఎంతైనా పందెం గడతా
నిల్చెదనోయి గెల్చెదనోయ్ - ఓహో చిన్న వాడా
వేణు : ఒంటికాలిపై నుండి హఠయోగ ముద్రలోనుండి ॥ఒంటి॥
గుట్టుగ తన పని సాధించునది - వివరిస్తావా ఏదది
కోరస్: అడిగిందానికి చెప్పి - ఎదురాడక ప్రశ్నను విప్పి
నిల్చెదవా గెల్చెదవా - ఓహో చిన్నదానా
రాధ : ముక్కు మూరెడే యౌను అది కొక్కొకొమని గొణిగేను ॥ముక్కు॥
కొంగ జపమని ప్రసిద్ధియేను ముందుకు వచ్చి కాదను
కోరస్: అడిగిందానికి చెబుతాం ఎంతైనా పందెం గడతాం
నిల్చెదమోయ్ గెల్చెదమోయ్ ఓహో చిన్న వాడా
వేణు : వాయు వేగమును మించి లోకాలన్నీ గాలించి ॥వాయు॥
గడియలోననే ఉన్న చోటకే వడిగా చేరేదేదది
మొగవాళ్ళు : అడిగిందానికి చెప్పి ఎదురాడక ప్రశ్నను విప్పి
నిల్చెదవా గెల్చెదవా ఓహో చిన్న దానా
రాధ : రాకెట్టని అనుకోను అది స్పూత్నిక్కని అనలేను ॥రాకెట్టని॥
ముమ్మాటికి అది మనసేను ఇక - ముందుకు వచ్చి కాదను.
కోరస్: అడిగిందానికి చెబుతాం ఎంతైనా పందెం గడతాం
నిల్చెదమోయ్ గెల్చెదమోయ్ ఓహో చిన్న వాడా
వేణు : దానమిచ్చి చెడె నెవ్వడు
రాధ : కర్ణుడు
ఆడపిల్లలు : కర్ణుడు
వేణు : తప్పు తప్పు బలిచక్రవర్తి
మగవాళ్ళు : హేయ్ బలిచక్రవర్తి
వేణు : జూదానికి నిపుణుండెవ్వడు
రాధ : ధర్మజుడు
కోరస్: ధర్మజుడు
వేణు : తప్పు తప్పు శకుని
మొగవాళ్ళు : హేయ్ శకుని
వేణు : అన్నదమ్ముల పోరాటంలో సందుచూచుకుని కూల్చిందెవడు
రాధ : భీముడు
కోరస్: భీముడు
వేణు : తప్పు తప్పు రాముడు మొగవాళ్ళు : హేయ్ రాముడు - శ్రీరాముడు - శ్రీరాముడు

సుశీల, ఘంటసాల బృందం పాడిన ఈ పాటను జమున, అక్కినేని, మరికొంతమంది నృత్యకళాకారులు అభినయించారు. పహడీ, మోహన రాగాలకు సంబంధించిన స్వరాలపై ఈ పాట ఆధారపడిందని చెప్పొచ్చు. వాద సంవాద ప్రక్రియలతో కూడిన పద్యాలు కాని పాటలు గాని ఎప్పుడు విన్నా శ్రోతలకు ఆనందంగానే వుంటుంది. నోటికి పట్టుబడే ట్యూన్ దానికి జతపడితే ఆ పాటగాని పద్యం గాని ఎక్కువ కాలం జనం నోట నలిగే అవకాశం వుంటుంది. ఆ కోవలోకి ఈ పాట కూడా చేర్చుకోవచ్చు. ఈ పాటలో స్వరరచన, గానం, అభినయం ఒక ఎత్తయితే రచన ఒక్కటీ ఒక ఎత్తు. సాహిత్యం గమనిస్తే ఈ పాటను కొసరాజు రాశారంటే చాలామందికి నమ్మబుద్దేయదు, అందుకు కారణం ఆయన వ్యంగ్య వైభవం ఈ పాటలో నేరుగా కనిపించక పోవటం! పైగా 'హఠ యోగముద్ర లోనుండి' వంటి వాక్యాలు - మనకు రెగ్యులర్‌గా అలవాటైన కొసరాజు శైలికి భిన్నంగా కనిపిస్తాయి. కొంగ జపానికి హఠయోగముద్రకి ముడిపెట్టడంలోనే కొసరాజు చమత్కారం ఉందేమో !? ఇదిలా వుండగా జూదానికి నిపుణుడు శకుని అని, అన్నదమ్ముల పోరాటంసందు చూసుకుని కూల్చిన వాడు ఎవరంటే (కథానాయకుడు గెలవటం కోసం అన్నట్టు) చటుక్కని భీముని పేరు చెప్పటం - వీటికి మనసంత త్వరగా అంగీకరించదు. అయినా పాట, సన్నివేశం, అభినయం బలంగా వుండడం చేత ఈ 'దిష్టిచుక్కలు' అందంగానే ప్రకాశించడమే గాని అడ్డు మాత్రం కాలేదు. ఎప్పటికైనా తీర్చుకోవలసిన సందేహాల లిస్ట్‌లో- ఈ సమీక్షకుని మనసులో ఇంకా వున్నవాటిలో ఇవి కూడా ఉన్నాయి.

పల్లవి : ఎక్కడి దొంగలు అక్కడనే గప్‌చుప్ ॥ఎక్కడి॥
ఎవరే పిలిచారు నిన్నెవరే పిలిచారు
ఎవరే పిలిచారు? నిన్నెవరే పిలిచారు ॥ఎక్కడి॥

చరణం : చాటుగా కనుచాటుగా
చూడకే ఇటు చూడకే
పొదలలో - పూపొదలలో పొంచినా గాలించినా ॥పొదలలో॥
కనులకు నేకనిపించనులే ॥ఎక్కడి॥

చరణం : నీడలో దోబూచిగా - ఆడకే తారాడకే
నీటిలో కోనేటిలో - చూడకే వెదుకాడకే ॥నీటిలో॥
దాగుడు మూతలు చాలునులే ॥ఎక్కడి॥

చరణం : వెదికినా నే దొరకనే - పిలిచినా నే పలుకనే
హృదయమే నా కొసగినా - ఎదుటనే కనిపింతునే ॥హృద॥
ఎన్నటికీ నిను వీడనులే ॥ఎక్కడి॥



ఈ పాటను ఘంటసాల పాడారు. శ్రీశ్రీ రాసిన ఈ పాటను తెరపై అక్కినేని, జమున అభినయించారు. కళ్యాణిరాగం స్వరాలతో వినిపించే ఈ పాటను 'తుమ్ సా నహి దేఖా' (1957) అనే హిందీ చిత్రంలోని టైటిల్ సాంగ్‌ను ఆధారంగా తీసుకుని చేశారు. 'యూతో హమ్‌నే లాఖ్ హసీ దేఖే హై తుమ్ సా నహి దేఖా' అనే పల్లవితో ప్రారంభమయ్యే ఆ హిందీ పాట - స్వరకర్త ఓపినయ్యర్‌కు, గాయకుడు మహమ్మద్ రఫీకి, అభినయించిన షమ్మీకపూర్‌కి ఎనలేని పేరు ప్రఖ్యాతులు తెచ్చిపెట్టింది. కలిపి అయినా విడివిడిగా అయినా ఆ ముగ్గురిలో ఏ ఒక్కరి గురించి చెప్పాలన్నా ఈ పాటను ఉదహరించకపోతే అది సంపూర్ణం అనిపించుకోనంత గొప్పగా హిట్ అయిన ఆ పాటను తీసుకుని చరణాలలో మొదటి రెండు లైన్లను తనదైన ట్యూన్‌తో ముడిపెట్టి, పల్లవిని అందుకునే లైన్లకు మాతృకలోని ట్యూన్‌ని జత కలుపుతూ వరస చేశారు టి.చలపతిరావు. ఆ హిందీ పాటను, ఈ తెలుగు పాటను ఏక కాలంలో వినటం జరిగితే ఆ తేడా తెలుస్తుంది. అంతేకాదు ఒకే ట్యూన్‌ను ఇద్దరు మహాగాయకులు వారి వారి పద్ధతుల ప్రకారం పోలికలో తేడాని, తేడాలో పోలికను చూపిస్తూ పాడిన విధానాన్ని అధ్యయనానికి సంబంధించిన ఓ అనుభవంగా స్వీకరిస్తే ఆ అనుభూతి ఎంత హృద్యంగా ఉంటుందో అది కేవలం అనుభవైక వేద్యం మాత్రమే. ముఖ్యంగా 'గప్‌చుప్' అనే మాటని ఘంటసాల ఎంత లబ్జుగా అంటారో వర్ణించలేం.

చేతులు కలసిన చప్పట్లు మనసులు కలిసిన ముచ్చట్లు ॥చేతు॥
ఇద్దరి మధ్యా పొందిక వుంటే రానే రావు పొరపాట్లు
రానే రావు పొరపాట్లు ॥చేతు॥
పాలూ తేనే కలసిన మాదిరి ఆలూ మగలూ వుండాలి ॥పాలూ॥
గువ్వల జంటా కులికే రీతిగ నవ్వుల పంట పండాలి
నవ్వుల పంట పండాలి ॥చేతు॥
కొత్తకుండలో నీరు తీయనా కోరిన మగవాడే తీయన ॥కొత్త॥
కొత్తకాపురం చక్కని వరము - కోరిక తీరు రయ్ రయ్‌నా ॥చేతు॥
వన్నెల చిన్నెల వలపు తోటలో పూలబాటలే వేయాలి ॥వన్నెల॥
అన్యోన్యంగా దంపతులెపుడూ కన్నులపండుగ చెయ్యాలి
కన్నులపండుగ చెయ్యాలి ॥చేతు॥
ఇద్దరి మధ్య పొందిక వుంటే రానే రావు పొరపాట్లు
చేతులు కలిసిన చప్పట్లు మనసులు కలిసిన ముచ్చట్లు ॥చేతు॥



ఈ పాటను ఘంటసాల, సుశీల, మాధవపెద్ది సత్యం, బృందం పాడగా అక్కినేని, జమున, రేలంగి, కొందరు నృత్య కళాకారులు అభినయించారు. రచనాపరంగా ఎటువంటి విన్యాసాలూ, ప్రయోగాలూ లేకుండా, చెప్పాలనుకున్న విషయాన్ని నేరుగా చేప్పేసిన పాట యిది. ఈ పాట రచన ఆరుద్ర. పాట మూడవ చరణంలోని 'వన్నెల చిన్నెల వలపు తోటలో పూలబాటలే వెయ్యాలి' అనే లైన్లకి జతపడిన ట్యూన్‌ని గమనిస్తే - మాస్టర్‌వేణు స్వరకల్పనా విధానానికి దగ్గరగా వచ్చిందనిపిస్తుంది. ఇది కేవలం పరిశీలనతో కూడిన అభిప్రాయం మాత్రమే. అది - నిజమో కాదో - అయితే అలా అంత దగ్గరగా రావటానికి గల కారణాలు, పరిస్థితులు ఏమిటో ఇంకా నిర్ధారించుకోవలసివుంది.

ఆమె : నేడు శ్రీవారికి మేమంటే పరాకా
తగని బలే చిరాకా ఎందుకో తగని బలే చిరాకా ॥నేడు॥
ఆమె : మొదట మగవారు వేస్తారు వేషాలు
పెళ్ళి కాగానే చేస్తారు మోసం
అతడు : ఆడవారంటే శాంత స్వరూపాలే
కోపతాపాలు రావండి పాపం
ఆమె : కోరి చేరిన మనసు చేత జిక్కిన అలుసు ॥కోరి॥
కొసకు ఎడబాటు అలవాటు చేస్తారు
అతడు : నేడు శ్రీమతికి మాతోటి వివాదం
తగువే బలే వినోదం - ఎందుకో
తగువే బలే వినోదం ॥నేడు శ్రీమతికి॥
అతడు : వారి మనసైతే వస్తారు ఆడవారు
చేర రమ్మంటే రానేరారు
ఆమె : ఆ, ఆ... తెలుసుకున్నారు స్త్రీల స్వభావాలు
తెలిసి తీర్చారు ముద్దు మురిపాలు
అతడు : అలుక సరదా మీకు - అదే వేడుక మాకు ॥అలుక॥
కడకు మురిపించి గెలిచేది మీరేలే
ఇద్దరు : ప్రణయ కలహాల సరసాలె వినోదం
నిజమే బలే వినోదం... ఆ.. ఆ.. ఆ...
నిజమే బలే వినోదం.... ఆ....



ఈ పాట యమన్ రాగంలో స్వరపరచబడింది. ఆరుద్ర రాసిన పాటను ఘంటసాల, సుశీల పాడగా తెరపై అక్కినేని, జమున అభినయించారు. ఏ వాద్యం తర్వాత ఏ వాద్యం రావాలి అనే 'ఇన్‌స్ట్రుమెంట్స్ ప్లేసింగ్'కి ఉదాహరణగా ఈ పాటని చెప్పుకోవాలి. చక్కగా అమరే అటువంటి ప్లేసింగ్ - సన్నివేశానికి తగిన మూడ్‌ని సృష్టించి పాటకు శాశ్వతత్వాన్ని కట్టబెడుతుంది. ముఖ్యంగా ఈ పాట మొదట్లో వరసగా వచ్చే పియానో, క్లారినెట్, వయొలిన్, వీణ, ఫ్లూట్ వాద్యాలు ఆ వాదాన్ని ధృవీకరిస్తాయి. ఇక ఈ పాటలోని 'అక్షరసత్యాలు' అనుభవంలోకి రాని జంట భూత భవిష్యద్వర్తమానాలలో వుండదని చెప్పవచ్చు. కవిగా అదీ ఆరుద్ర ప్రామాణికత!

భలే ఛాన్సులే... భలే ఛాన్సులే.... భలే ఛాన్సులే
లలల్లాం లలల్లాం లక్కీ ఛాన్సులే - భలే ఛాన్సులే
ఇల్లరికంలో ఉన్న మజా ॥ఇల్లరికం॥
అది అనుభవించితే తెలియునులే భలే ఛాన్సులే
చరణం : అత్తమామలకు ఒక్క కూతురౌ అదృష్టయోగం పడితే ॥అత్త॥
బావమరుదులే లేకుంటే
ఇంటల్లుడిదేలే అధికారం - భలే ఛాన్సులే
చరణం : గంజిపోసినా అమృతంలాగ
కమ్మగ వుందనుకుంటే - బహు కమ్మగా వుందనుకుంటే
ఛీ - ఛా... ఛీ - ఛా... యన్నా చిరాకు పడక
దులపరించుకుని పొయ్యే వారికి - భలే ఛాన్సులే॥ఇల్లరికం॥
చరణం : జుట్టు పట్టుకుని బయటి కీడ్చినా
చూరుపట్టుకుని వ్రేలాడీ..... ఈ.... ఈ.... ॥జుట్టు॥
దూషణ భూషణ తిరస్కారములు ఆశీసులుగా
తలిచే వాడికి - భలే ఛాన్సులే ॥భలే॥
చరణం : అణిగి మణిగీ వున్నామంటే
అంతా మనకే చిక్కేది ॥అణిగి॥
మామ లోభియై కూడబెట్టితే మనకే గాదా దక్కేది
అది మనకే గాదా దక్కేది ఇహ మనకే గాదా దక్కేది
అదిమనకే - ఇహ మనకే అది మనకే - మనకే - మనకే
మ... మ... మ.... మనకే



ఈ పాటను మాధవపెద్ది సత్యం పాడారు. తెరపై రేలంగి ప్రధాన పాత్రధారి. ఆయనతో పాటు పేకేటి శివరాం, బాల, చివర్న వచ్చి కలిసే రమణారెడ్డి, మరొకాయన కూడా అభినయించారు. హిందుస్థానీ రాగాలైన పహాడీ, మాండ్ రాగాలను తీసుకొని వాటిని కాస్తా అటూ, ఇటూ చేసి మధ్య మధ్య ప్రతి మధ్యమం ఛాయల్ని కలుపుకుంటూ బహుజన రంజకంగా తయారు చేసిన ట్యూన్ ఇది. ఒక్క ఇల్లరికం ఉండే అల్లుళ్ళకే కాకుండా విద్య, ఉద్యోగం,

కళ, వ్యాపారం, రాజకీయం ఇలా ఏ రంగంలోనైనా సరే అంతరాత్మ గొంతు నొక్కేసుకుంటూ బాధపడేవాళ్ళకి ఓదార్పులా - కష్టపడకుండా పైకొచ్చేద్దామనుకునే తత్వంతో అతి లౌక్యంగా ప్రవర్తించే వాళ్లకు ఓ చురకలా - ఇలా రెండు విధాలా పనికొచ్చేట్టుగా రెండువైపులా పదునున్న కత్తిలా రాసిన ఈ పాటలోని వ్యంగ్య వైభవం తెలుగువాడి గుండెల్లో తెలుగుతనం చచ్చిపోనంతవరకు బ్రతికుంటుంది. ఈ పాట రచన కొసరాజు.

**నిలువవే వాలు కనులదానా - వయ్యారి హంసనడక దాన**
**నీ నడకలో హొయలున్నదె చానా**
**నువు కులుకుతు ఘలఘల నడుస్తువుంటే**
**నిలువదె నా మనసు ఓ లలనా అది నీకే తెలుసు** ॥నిలువవే॥
**ఎవరనీ ఎంచుకొని నావో పరుదని భ్రాంతి పడినావో**
**ఎవరనీ ఎంచుకొనినావో భ్రాంతి పడినావో సిగ్గుపడి తొలగేవో**
**విరహాగ్నిలో నను తోసిపోయేవో** ॥నువు కులుకుచు॥ ॥నిలువవే॥
**ఒకసారీ నన్ను చూడరాదా చెంతజేరా సమయమిది కాదా**
**ఒకసారీ నన్ను చూడరాదా సమయమిది కాదా**
**చాలు నీ మరియాదా**
**వగలాడి నే నీవాడనే కాదా** ॥నువు కులుకుచు॥ ॥నిలువవే॥
**మగడంటే మోజు లేనిదానా మనసుంటే నీకు నేను లేనా**
**మగడంటే మోజు లేనిదానా నీకు నేను లేనా కోపమా నా పైనా**
**నీ నోటి మాటకు నోచుకోలేనా** ॥నిలువవే॥



ఈ పాటను కూడా కొసరాజు రాఘవయ్యచౌదరిగారే రాశారు. ఘంటసాల పాడిన ఈ పాటను జమునతో కలిసి అక్కినేని అభినయించారు. ట్యూన్‌పరంగా పూర్తి జానపద సరళిలో సాగిన ఈ పాట - అక్కినేని, ఘంటసాల, కొసరాజు, చలపతిరావు కాంబినేషన్‌కి ఓ నదుపమానంగా నేటికీ నిలిచిపోయింది. ఈ పాట వినగానే ఇది కథానాయకుని స్థాయికి తగదని, తీసెయ్యమని, కావాలంటే ఆ పాట కోసం ఎంత ఖర్చయిందో అంతా భర్తీ చేస్తానని అప్పట్లో అక్కినేని అన్నారట. కానీ దర్శకులు టి.ప్రకాశరావు తదితరులంతా ఈ పాట బాగా వస్తుందని, తమకు నమ్మకం ఉందని చెప్పి ఆయనని ఒప్పించారట. సినిమా పూర్తయిన తర్వాత రిలీజ్ అయ్యేలోగా కొన్ని ప్రివ్యూలు వేయడం జరిగింది. ఎవరెవరు వచ్చారు, సినిమా ఎలా ఉందన్నారు అని తెలుసుకుంటూ ఉండగా తన సతీమణి అన్నపూర్ణ మూడుసార్లు వచ్చి చూసినట్టు తెలిసిందట అక్కినేనికి. ఇంటికివెళ్ళి - మూడుసార్లు వెళ్లేటంతగా సినిమాలో ఏం ఆకర్షించిందని అడిగితే - ఆవిడ 'నిలువవే వాలు కనులదానా' పాటని ప్రశంసించారట. తీసుకునే నిర్ణయాలు తిరిగి పరిశీలించుకుని అవసరమైతే మార్చుకునే తన తత్వానికి ఆనాటి ఆ సంఘటన, ఆ పాట విజయం ఎంతగానో ఉపకరించిందని స్వయంగా అక్కినేనే ఎన్నో సభలలో చెప్పేవారు. ఆ సినిమాని మళ్ళీ ఎప్పుడైనా చూడటం తటస్థిస్తే జాగ్రత్తగా ఆ పాటని గమనించండి... మొదట ఆ పాటను కాదన్నా తనను బలవంతంగా ఒప్పించారన్న అసంతృప్తిగాని, ఏదోలా చేసేసి చేతులు దులిపేసుకుందాంలే అనే ధోరణి గాని అక్కినేని అభినయంలో రవంత కూడా కనిపించదు. అంకితభావంతో కూడిన వృత్తి ధర్మానికి ప్రతీకలా తన తత్వాన్ని తీర్చిదిద్దుకున్నారు కనుకనే నేటికీ పరిశ్రమలో ఆయన స్థానం పతాక స్థాయిలో ఉందని అనిపిస్తుంది.

ఇక సన్నివేశాల నేపథ్యంలో వినిపించే సంగీతానికి సంబంధించినంతవరకూ గమనించవలసిన అంశం ఒకటుందీ చిత్రంలో, వీడియో దొరికినప్పుడు గాని, ఛానల్స్‌లో ప్రసారం అవుతున్నప్పుడు గానీ, లేదా పాత సినిమాలు మళ్ళీ థియేటర్లలో ఆడే మంచిరోజులు కలిసొచ్చినప్పుడు గానీ... జాగ్రత్తగా చూడండి. టైటిల్స్ చూపిస్తున్నప్పుడు సంగీత దర్శకునిగా టి.చలపతిరావు పేరు రాగానే - అంతవరకూ వినిపించిన వాద్య సంగీతం ఓ మలుపు తీసుకుంటుంది. అక్కణ్ణించి వినిపించే వాద్య సంగీతాన్నే ఈ చిత్రంలో అక్కినేని నాగేశ్వరరావుకి గుమ్మడి తన మైకా ఫ్యాక్టరీని చూపిస్తున్నప్పుడు వుపయోగించారు. ఆ మ్యూజిక్‌ని గుండెల్లో బలంగా ముద్రించుకుని భద్రపరుచుకొని - 1973లో శోభన్‌బాబు, వాణిశ్రీ హీరోయిన్‌లుగా నటించిన 'మైనర్‌బాబు' అనే చిత్రం చూడటం తటస్థించినపుడు - మనసులో రీకాల్ చేసుకోండి. ఈ 'మైనర్‌బాబు' చిత్రంలో శోభన్‌బాబు ఓ ఫ్యాక్టరీలో పనిచేస్తున్నట్టుగా ఎస్టాబ్లిష్ చేసే సన్నివేశాల్లో తిరిగి అదే వాద్య సంగీతాన్ని వుపయోగించినట్టు అర్థమైతే ఆ అనుభూతి భలే థ్రిల్లింగ్‌గా వుంటుంది. కారణం - 'ఇల్లరికం' కి దర్శకత్వం, సంగీత దర్శకత్వం వహించిన తాతినేని ప్రకాశరావు, తాతినేని చలపతిరావులే 'మైనర్‌బాబు' కి కూడా దర్శకత్వం, సంగీత దర్శకత్వం నెరపటమే!

ఎన్నో కళల సమ్మేళనం.... సినిమా! దాన్ని నిర్మించటం చాలా పెద్ద కళ... ఆ కళ(ల)ను స్వీకరించవలసిన పద్ధతిలో స్వీకరించి మనలో ఏ ప్రతిభ వుందో ఆ ప్రతిభకు దోహద పడేట్టుగా నిరంతరం మెరుగు పెట్టుకుంటూ, తద్వారా గ్రహించిన విషయాలను, విశేషాలను సహృదయులతోనూ, రసహృదయులతోనూ పంచుకొని పెంచుకోవటమే ఈ శీర్షిక లక్షణం, లక్ష్యం... అందుకు తోడ్పడిన చిత్రాలలో ఈ 'ఇల్లరికం' ఒకటి. ■




అక్కినేని నాగేశ్వరావు
ఎక్కలేని ఎత్తులెక్కావు
సాగలేని దూరాలెళ్ళావు
మోయలేని భారాలెత్తావు

ఐనా —
ఈనాడు తెలుగుసినిమా నావ
నతడు చేర్చదలచే రేవు
నీటికీ నేటికీ
నూరామడ అనిపించే
హైదరాబాదు!

జ్యోతి - 1963

— అంటూ మేము అరవై మూడులో
వెక్కిరించినా హాయిగా నవ్వేసి
ముందుకు సాగిన అక్కినేనీ!
తెలుగు సినిమా నావను
ఓడగా పెంచిన ధీరా!
హైదరాబాదులో హార్బరు
నిర్మించిన వీరా!
అనుకున్నది సాధించిన అసాధ్యుడా!
అఖండుడా!
ఓ మా అందరి హీరో!
నీకు మా జోహారో!

హేపీ బర్త్‌డే — బా॥ రమణ
20.09.2003




# రాష్ట్ర ముఖ్యమంత్రితో మీరు మాట్లాడాలా? మీ కోసం ఒక వేదిక ఉంది. అదే... "ప్రజలతో ముఖ్యమంత్రి"

రాష్ట్రవ్యాప్తంగా నిరాటంకంగా కొనసాగుతున్న "ప్రజలతో ముఖ్యమంత్రి" కార్యక్రమం ఎన్నో సామాజిక సమస్యలను పరిష్కరించింది. 1997 ఏప్రిల్‌లో ప్రారంభమైన ఈ కార్యక్రమంలో ఎంతోమంది ప్రజలు స్వయంగా ముఖ్యమంత్రితో టెలిఫోన్‌లో మాట్లాడి సమస్యలను పరిష్కరించుకోవడం విశేషం. ఈ వినూత్న కార్యక్రమంలో ప్రజలు విలువైన సమయాన్ని వివేకవంతంగా వినియోగించుకోవాలి. సామాజిక సమస్యలతో పాటు, అభివృద్ధి పథకాలపై ప్రశ్నలు అడగాలి. పరిష్కారాన్ని అందుకోవాలి.

## ఒక ప్రత్యేక అంశం మీ అందరి కోసం దూరదర్శన్‌లో ప్రతి సోమవారం సా॥ గం.6.25 ని.లకు

## ఆలస్యమెందుకు...?

ఈ క్రింద టెలిఫోన్ నెంబర్లకు డయల్ చేయండి.

హైదరాబాద్ నుంచి : 23453229, 23453230

రాష్ట్రంలోని ఇతర ప్రాంతాల నుంచి : (040) 23453229, 23453230, 23453231, 98480-54343

**ప్రకటించిన అంశంపై ప్రశ్నలు అడగండి - పరిష్కారం పొందండి.**

జారీచేయువారు : సంచాలకులు, సమాచార, పౌర సంబంధాల శాఖ, హైదరాబాద్.